# ఫ్యాషన్ ప్రపంచంలో సాటిలేని చీరలు,
# కరిష్మా శారీస్.






## శుభాకాంక్షలు

మా పాఠకులు, రచయిత(త్రు)లు, ఏజెంట్లు, ప్రకటన కర్తలందరికీ రిపబ్లిక్ దినోత్సవ శుభాకాంక్షలు. —సం.

## సీరియల్స్

మల్లాది గారి సీరియలంట
కడుపుబ్బ నవ్వులంట
ఆంధ్రసచిత్ర వారపత్రిక వారి సమర్పణంట
అదే వినాయకరావు పెళ్ళంట
ఇక ఆలస్యం ఎందుకంట
అంతా చదువుదాం రండంటా!

—ఎన్. వి. ఎన్. డి. ప్రసాద్, హైదరాబాద్

★ ★ ★

హరికిషన్ గారి "ఆడపిల్లలు – అనుభవాలు" సీరియల్ నిజ జీవితాలకు అతి దగ్గరగా వున్నది. ఓ పేద వ్యక్తి ఒక డబ్బున్న మనిషిని చిన్నమాటంటే డబ్బుందన్న అహంభావంతో చెయ్యి చేసుకున్నాడు. అదే తప్పు డబ్బున్న వాడు చేస్తే డబ్బు లేనివాడు చెయ్యి చేసుకుంటే చాలా గొడవలు జరిగిపోతాయి ఈ సీరియల్ ద్వారా ఈ విషయాలు తెలిసేవిధంగా వ్రాసిన రచయిత హరికిషన్ గార్కి నా హృదయపూర్వక అభినందనలు.

—చలపాక ప్రకాస్, విజయవాడ

★ ★ ★

కీ. శే. కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి "వేయి పడగలు" సీరియల్‌ను ప్రచురిస్తున్నారు. ఈ సీరియల్ కడురమ్యంగా ఉంది మా హృదయాలను రంజింప చేస్తున్నది.

—చిక్కా వెంకటేశ్వర్‌రావు, పొన్నెకల్

★ ★ ★

నిత్య నూతన సీరియల్ 'కవిసామ్రాట్' శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి "వేయి పడగలు" చాలా ఆసక్తిదాయకంగా ఉంది. రావినూతల సువర్ణాకన్నన్ గారి "మంజీరనాదం" సీరియల్ సూపర్బ్. "ఆడపిల్లలు–అనుభవాలు" సీరియల్ చాలా ఇంటరెస్టింగ్‌గా కొనసాగుతోంది.

—ఎస్. మహమ్మద్ రఫీ, కాశీబుగ్గ

★ ★ ★

"డి. ఎస్. పి విజయ్", "రేపటి మహిళ"లు ఎంతో ఆసక్తిగా వున్నాయి

—చిత్రాడ. విజయకుమార్, సోంపేట

★ ★ ★

"రేపటిమహిళ" సీరియల్ ముగింపు బాగుంది.

—ఎమ్. శకుంతల, ఏలూరు

## కథలు

"ఇదీ ప్రగతి" కథ బాగా నచ్చింది. రాఘవరావు పాత్ర కళ్ళకు కట్టినట్లు వర్ణించారు రచయిత. రచయితకు నా అభివందనాలు.

—కె రాజశేఖర్, కె. ఎన్. వి రవికుమార్, మైలవరం

## శీర్షికలు

మీరు ప్రచురిస్తున్న శ్రీ రామ్‌జీగారి షేర్ మార్కెట్ గురించిన వ్యాసాలు పాఠకులకు ఎంతో లాభాన్ని చేకూరుస్తాయనడాన్కి ఏమాత్రం అనుమానం లేదు —పి. ఎస్ ప్రసాద్, సామర్లకోట

★ ★ ★

"న్యాయపీఠం" శీర్షిక మమ్మల్ని ఎంతగానో ఆకర్షించింది. మాకు తెలియని విషయాల్ని ఈ శీర్షిక ద్వారా తెలియ చేయుచున్న రచయిత గారికి కృతజ్ఞతలు. —కె. జమునారాణి, వైజాగ్

★ ★ ★

'ఈకాలం పెళ్ళిళ్ళు' శీర్షికలో వ్యాసాలు చాలా ఉత్తేజకరంగా ఉంటున్నాయి.

ఎం. స్వయంప్రభ, రాజమండ్రి ■




# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)
15.1.88; 22.1.88
శ్రీ ప్రభవ నామ సం. పుష్య బ. ఏకాదశి,
మాఘ శు. చవితి
సంపుటము 80 : సంచికలు 21; 22
ముఖ్య సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు.
మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 3 00 |
| పోస్టులో 6నెలల చందా | రు. 87 10 |
| పోస్టులో 12నెలల చందా | రు 174.20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
"స్టేషన్‌మాస్టర్"లో అశ్విని

# ఒక ముఖ్య గమనిక

ఆంధ్రపత్రిక ప్రచురణలు అయిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక, సినిమారంజని, కలువబాల, బాలరంజని పత్రికలు గత కొంత కాలంగా ఆలస్యంగా విడుదల అవుతున్నా పాఠకులు, ఏజెంట్లు, ప్రకటనకర్తలు ఎప్పటిలాగే తమ ఆదరాభిమానాలని, సహాయ సహకారాలని అందజేస్తున్నందుకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము.

అనివార్య కారణాల వల్ల ఈ ఆలస్యం జరుగుతున్నదంటే ఏమిటి ఆ కారణాలని చాలామంది అడుగుతున్నారు. అందువల్ల వాటిని వివరంగా తెలియజేయటం అవసరమని అనుకుంటున్నాము.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఒక ప్రత్యేక చట్టం ద్వారా ప్రభుత్వ భవనాల లీజ్‌ని రద్దు చేయటం వల్ల ఆంధ్రపత్రిక హైదరాబాద్ ఎడిషన్ ఉన్న భవనాన్ని కొన్ని సంవత్సరాల ముందుగానే ఖాళీ చేసి దానిని వేరొక భవనంలోకి మార్చవలసి వచ్చింది. ఎదురు చూడని ఈ పరిస్థితి వలన అంతా అస్తవ్యస్తం అయి ఎన్నో ఇబ్బందులని ఎదుర్కొనవలసి రావటం, వ్యయప్రయాసలకి లోను కావటం జరిగింది.

పత్రికల ప్రచురణలో ప్రకటనలు ముఖ్యపాత్రని నిర్వహిస్తాయి. చదివేవారికి అందుబాటులో పత్రికల ధర వుండటానికి ప్రకటనలు ఎంతైనా అవసరం. వాటి ద్వారా రావలసిన డబ్బు సకాలంలో అందకపోతే ఎన్నో యిబ్బందులని ఎదుర్కోవాల్సి వస్తుంది. ముద్రణకి కావలసిన న్యూస్‌ప్రింట్ కాగితం ధర యిటీవలి కాలంలో ఊహించనంతగా పెరిగి పత్రికల మీద మోయలేని భారం పడింది. దానికి తోడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంతో సహా కొందరు ప్రకటనకర్తలు తాము విడుదల చేసిన ప్రకటనల తాలూకు డబ్బును సకాలంలో చెల్లించకపోవటం వల్ల, నిరవధికంగా వాయిదాలు వెయ్యటంచేత పరిస్థితి అస్తవ్యస్తం అయింది. ముద్రణకి అవసరమైన న్యూస్‌ప్రింట్‌కి ముందుగా డబ్బు కట్టి తీసుకోవాల్సి వుంటుంది. రావలసిన బకాయిలు సకాలంలో వస్తేనే పత్రికల ముద్రణ సక్రమంగా జరిగి ఎవరికీ ఏ యిబ్బందీ కలగకుండా వుంటుంది. అందుకు అవసరమైన ప్రయత్నాలన్నిటినీ శక్తివంచన లేకుండా చేస్తూనే వున్నాము. త్వరలోనే ఆంధ్రసచిత్ర వారపత్రిక, సినిమారంజని, కలువబాల, బాలరంజని పత్రికలు సకాలంలో విడుదల చెయ్యటానికి తగిన ప్రయత్నాలన్నిటినీ చేస్తున్నాము.

తాత్కాలికంగా ఏర్పడిన ఈ అసౌకర్యాన్ని పాఠకులు, ఏజెంట్లు, ప్రకటనకర్తలు సహృదయంతో అర్థం చేసుకుని ఎప్పటి మాదిరే తమ ఆదరాభిమానాలని, సహాయ సహకారాలని అందజేయవలసిందిగా మనవి చేసుకుంటున్నాము.

ఆంధ్ర సచిత్ర వారపత్రికని సకాలంలో పాఠకులకి అందించే ప్రయత్నంలో ఒక భాగంగా ఈ సంచిక నుంచి వరుసగా కొన్ని వారాలపాటు ఒక్కొక్క సంచికపై రెండు తేదీల, లోపల రెండు సంచికల వరుస నెంబర్లని వేస్తున్నాము. ఇందువలన పాఠకులకి ఎటువంటి అసౌకర్యమూ ఉండదు. ఈ సంచికలో వారఫలం శీర్షికని వెయ్యటం నిరుపయోగం కాబట్టి దానిని ప్రచురించటంలేదు. మిగతా శీర్షికలు, సీరియల్ నవలలు మొదలైన వాటి వరుసక్రమంలో ఎటువంటి మార్పు ఉండదు. అనివార్యం అయిన ఈ మార్పుని పాఠకులు సహృదయంతో స్వీకరించి ఎప్పటివలెనే తమ ఆదరాభిమానాలని అందించగలరని ఆశిస్తున్నాము. వీలైనంత త్వరలో ఆంధ్ర సచిత్రవారపత్రికని సకాలంలో విడుదల చెయ్యగలమని అనుకుంటున్నాము.

–సంపాదకుడు

ఛాలెంజ్... ఛాలెంజ్... ఛాలెంజ్!

ఇట్లు
రాకా



ఎవరీ రాకా....? ఏమా కథ...?

అది తెలియజేయడానికే
త్వరలో మీ ముందు కొస్తున్న-

చల్లా సుబ్రహ్మణ్యం
విశ్లేషణాత్మక సీరియల్

# న్యూఢిల్లీ లేఖ

డా. జయ్ దుబాషి



## విషయం తెలియని వి.పి. సింగ్!

నేను చెప్పబోయేదాన్ని విశ్వనాథప్రతాప్‌సింగ్ అంగీకరించకపోవచ్చుగాని, నా అనుమాన మేమంటే; ఆయనను మాయచేయడంలో రాజీవ్ గాంధీ, ఆయన బృందం కృతకృత్యులయ్యారు. ఆయనకు చాంతాడు పొడవు అవకాశం వచ్చింది. కాని రాజాసాబ్ ఆ చాంతాడుతో తనకు తానే ఉరివేసుకున్నారు.

గోయెంకా, వి. పి. సింగ్ తదితరులు రాజీవ్‌గాంధీ బృందానికి వ్యతిరేకంగా కుట్ర పన్నారనే ఒక సాధారణ అభిప్రాయం కొన్ని నెలలకిందిదాకా వుండేది. ఈ కుట్ర గురించిన కథనాన్ని కాంగ్రెస్‌వాళ్ళు స్వయంగా ప్రచారం చేశారు. చాలామంది పాత్రికేయులు దానికి విలువ యిచ్చారు కూడా. కుట్ర వున్నమాట నిజమే. కాని అది రాజీవ్ గాంధీకి వ్యతిరేకంగా కాదు. అది విశ్వనాథ ప్రతాప్‌సింగ్‌కు వ్యతిరేకంగా రేస్‌కోర్సురోడ్‌లోని ఐదో నంబర్ యింట్లో పన్నబడింది. ఈ కుట్రలో చిట్టచివరి అధ్యాయం ఠక్కర్ – నటరాజన్ నివేదిక. ఇక ఆ భూతాన్ని ఖననం చెయ్యడం జరిగింది గనుక దానితో ప్రభుత్వానికిగానీ, మరెవరికిగానీ ఏమంత పెద్ద వుపయోగం వుండదు.

నన్ను మొదటినుంచి ప్రారంభించనివ్వండి. సింగ్ మామూలు కాంగ్రెస్ నమూనాలో తయారుకాలేదని కనీస పరిజ్ఞానం వున్న ఏ కాంగ్రెస్‌వాదికైనా స్పష్టంగా తెలుసు. పైవారు ఏమి కోరుకుంటే అది చెయ్యననడానికి శక్తి లేనంతటి ఒంటరివాడాయన. డబ్బు గురించి, రాజకీయాల గురించీ కూడా ఆయనకి అలౌకికమైన అభిప్రాయాలున్నాయి. మొదటి సంవత్సరమో, కొంచెం ఎక్కువకాలమో వారు చెప్పినట్టల్లా సింగ్ ఆడారు. ఆశించినట్టుగానే ప్రవర్తించారు. ఆయన తన మొదటి బడ్జెట్ ప్రవేశపెట్టినతర్వాత, ప్రభుత్వం ప్రజలలో పెద్ద ఎత్తున ఆదరణకోల్పోయే మార్గం చేపట్టిందని, ఆదాయపు పన్ను రేట్ల తగ్గింపు, లైసెన్సుల్లో, దిగుమతుల్లో నియంత్రణ రద్దు వంటి చర్యలతో ఆ మార్గం రీగన్ అనుసరించే మార్గమని స్పష్టమైపోయింది. సింగ్ మనసు అందుకు అంగీకరించలేదు. ఐనా ఆయన తనని చేయమన్న పనిచేశారు. ఘనతవహించిన పైవారు కోపంతెచ్చుకుని, దాదాపు ఆయనను తోసివేసే స్థితి వచ్చేసరికి సింగ్ బైటపడి విచిత్రమైన పనులు చేశారు. కిర్లోస్కర్‌తో ప్రారంభించి థాపర్ వరకు పారిశ్రామికవేత్తలను ఆయన జైల్లో పెట్టడం ప్రారంభించారు. ఇది యిచ్చిన ఆదేశం కాదు. కనుకనే యిది అధిష్టానవర్గానికి దిగ్భ్రాంతిని మాత్రమే కాదు, భయాన్నీ కలిగించింది. పారిశ్రామికవేత్తలకు గుణపాఠం చెప్పేపనికి మంచిపేరంతా సింగ్ పొందడం మొదలైంది. సింగ్‌ను సమర్థించనందుకు రాజీవ్‌గాంధీకి చెడ్డ పేరు వచ్చింది. రాజాసాబ్ తన పాదరక్షల్లో పట్టనంత పెద్దవాడయిపోతున్నాడనేది స్పష్టమైపోయింది. అప్పుడిక ఆయన స్వస్థలమేదో చూపెట్టదలచుకున్నారు. అది ప్రభుత్వానికి బైట, పార్టీకి బైట.

సింగ్ దృష్టి రిలయన్స్ మీద లేదు. అలహాబాద్‌లో తన ప్రత్యర్థి ధీరూభాయి అంబానీ కన్న శక్తివంతుడూ అయిన అమితాబ్ బచ్చన్‌పైన ఆయన దృష్టివుంది. సింగ్ ఆయనపని పట్టదలచుకున్నారు. కాని ప్రత్యక్షంగా కాదు. మొట్టమొదట ప్రత్యర్థి గురించి తెలుసుకోవలసిందంతా తెలుసుకోవాలి. కాని ఆపని సూటిగా చేసేవీలులేదు గనుక తనకు సాయపడగల ఏజెంటుకోసం వెతికాడు. అట్లా దొరికాడు హెర్ష్‌మన్. కాని హెర్ష్‌మన్ ఆకాశం నుంచి వూడిపడలేదు. రాజీవ్ అండ్ కోకి తెలిసి, కాకపోతే వాళ్ళమిలాఖత్తుతోనే సి. ఐ. ఏ. హెర్ష్‌మన్‌ను సమకూర్చింది. హెర్ష్‌మన్ ఒక డబుల్ ఏజెంటు. అటుగురుమూర్తి అండ్ కంపెనీకోసం, యిటు ప్రభుత్వంకోసం ఒకేసారి పనిచేశాడు. గురుమూర్తి అండ్‌కోకి కావలసిందేమిటో ఆయనకు తెలుసు. తనకు తగినంతకాలం వాళ్ళకు సాయపడుతూ వచ్చాడు. హెర్ష్‌మన్‌సంస్థ ఫెయిర్‌ఫాక్స్ ప్రభుత్వం దగ్గరినుంచి ఒక్క డాలర్ కూడా తీసుకోకపోవడం గమనించవలసిన విషయం. మామూలుగా ఏ అమెరికన్ ఏజన్సీ ఆయినా యిటువేలు అటు కదిపితే పదిలక్షల డాలర్లకు తక్కువగాకుండా వసూలుచేసే పరిస్థితిలో ఈ త్యాగం అసాధారణమైనది. హెర్ష్‌మన్‌కు అందవలసిన డబ్బు అందింది. చెల్లించినది నస్లీ వాడియాకాదు, భారత ప్రభుత్వమే. పైగా ఆయన ఠక్కర్ నివేదికమీద పెదవి విప్పి మాట్లాడలేదు. విచారణకు కూడా హాజరుకాలేదు. హెర్ష్‌మన్ నుంచి ఫెయిర్‌ఫాక్స్ నుంచి మనం వినడం యిదే ఆఖరిసారి అని నేననుకుంటాను. ఎందుకంటే వాళ్ళ పాత్ర ముగిసిపోయింది.

ఫెయిర్‌ఫాక్స్‌ను వి. పి. సింగ్ నియోగించడం గురించి తనకేమీ తెలియదని ప్రభుత్వం ప్రకటించడం హాస్యాస్పదం. ఎందుకంటే ఒక విదేశీసంస్థను వినియోగించుకోవడం లాంటి ముఖ్యమైన విషయం ప్రభుత్వానికి తెలియకుండా జరగడం అసాధ్యం. ఈ నియామకం గురించి ప్రభుత్వానికి తెలుసు. ప్రభుత్వమే సి.ఐ. ఎ. ద్వారా ఈ నియామకాన్ని జరిపించింది. తాను చేస్తున్నదాని గురించి ప్రభుత్వానికి తెలుసునని తెలియనిది వి. పి. సింగ్‌కే. మాజీ ఆర్థికమంత్రిని ఒక అనుమానాస్పద వ్యవహారంలో యిరికించే ప్రయత్నం జరిగింది. ఆ ప్రయత్నం విజయవంతంగానే పూర్తయినట్టున్నది. తాను ఏమి చేస్తున్నాడో పూర్తి వివరాలు ప్రధాన మంత్రికి తెలియజేశానని వి. పి. సింగ్ అన్నప్పటికీ, తనకే విషయాలూ చెప్పలేదని ప్రధాని అంటున్నారు. వి. పి. సింగ్‌ను గాని, రాజీవ్ గాంధీని గాని విచారణకు హాజరుకమ్మని ఠక్కర్ – నటరాజన్ కమీషన్ అడగకపోవడం కూడా గమనించవలసిన విషయమే. ఎందుకంటే వాళ్ళను అడగవలసిన అవసరమే లేదు.

ఫెయిర్‌ఫాక్స్ గురించి ఫోర్జరీ లేఖ అనబడేదానిపై గొడవజరిగింది. నిజానికి ఆ లేఖను రిలయన్స్ వాళ్ళు రాయలేదు.. హెర్ష్‌మన్ స్వయంగా గాని, ఆయన సహచరు డెవరైనాగాని రాసి వుంటారు. ఆ లేఖను బైటపెట్టినది ప్రభుత్వమే. జైల్‌సింగ్ రాజీవ్‌గాంధీకి రాశారని చెపుతున్న లేఖ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌పై గొడవ జరిగిన లేఖ కూడా ప్రభుత్వంలోని కింది అధికారులే బైటపెట్టారు. దాని లక్ష్యాన్ని నెరవేర్చింది. అదేమంటే మాజీ రాష్ట్రపతికి పత్రికలలోని అవాంఛనీయ వ్యక్తులతో సంబంధం వున్నదని చూపి, రాష్ట్రపతి ఎన్నికలలో రాజకీయం ఆడడం, యిటువంటి గందరగోళపు వ్యవహారాల్లో ఎప్పుడూ ప్రవర్తించినట్టుగానే కమ్యూనిస్టులు తమ పాత్ర నిర్వహించారు. రాజీవ్ అండ్ కో చాలా తెలివైనది. వాళ్ళకు ఒకపక్కన సి. ఐ. ఎ. వున్నది. మరోపక్కన కమ్యూనిస్టులు, కె. జి. బి. వున్నారు. భారతదేశంలో యిది అసాధారణమేమీ కాదు. తనకు అవసరమైనప్పుడు నెహ్రూ కూడా యిద్దరినీ వాడుకున్నాడు. ఇందిరాగాంధీ కూడా వాడుకున్నారు.

ఠక్కర్ నివేదిక నుంచి బైటపడేదేమీ లేదు. అసలు ఏమన్నా జరగాలని వుద్దేశించనూలేదు. అదీ దాని లక్ష్యాన్ని నెరవేర్చింది. వి. పి. సింగ్ మూర్ఖపు పనులు, ప్రమాదకరమైన విదేశీ ఏజన్సీల సాయం కోరడం, నస్లీ వాడియావంటి "విదేశీ" ప్రవాస భారతీయ పారిశ్రామికవేత్తలతో కలిసి పనిచేయడం వంటి పనులుచేసే వ్యక్తిగా చిత్రించబడ్డారు. సింగ్ విదేశీయులతో, ముఖ్యంగా హెర్ష్‌మన్ వంటి సి. ఐ. ఎ. కు సన్నిహితులైనవారితో ఎందుకు సన్నిహితంగా వున్నారు? ఇక్కడే దేశాన్ని అస్థిరంపాలు చెయ్యడ

మనే వ్యవహారం వస్తుంది. అధికారిక వాదన ఎట్లా వుందంటే, సవ్యంగా ఎన్నుకోబడిన ప్రజాస్వామిక ప్రభుత్వ సుస్థిరతను సింగ్ వంటి మనుషులు కుట్రపూరిత కార్యకలాపాల ద్వారా భగ్నంచేయ బోయారట. సింగ్ నిజంగానే చాలా మూర్ఖమైన పనిచేశారు. ఆయన విదేశీ సంస్థలను వాటి పూర్వాప రాలు విచారించకుండా నియమించారు. ప్రభుత్వం చెపుతున్నది, యిది. నా కయితే ఎంతమాత్రం అది అలా చేస్తుందనే అనుమానం లేదుగాని, ప్రభుత్వం ఎప్పుడయినా ఈ కేసును కోర్టుకు తీసుకువెళితే చెప్పబోయేది యిదే. హెర్ష్‌మన్‌ను వాస్తవంగా రాజీవ్ అండ్ కో నియమించారనీ, తనకు సంబంధం లేదనీ చెప్పి సింగ్ నిరూపించలేరు. అట్లాచేస్తే ఆయన యింకా మూర్ఖుడని తేలుతుంది. ఆయన బైటపడలేని ఒక పరిస్థితిలో తేలుకుట్టిన దొంగ స్థితిలో పడిపోయారు.

ఇకముందు ఎక్స్‌ప్రెస్ వ్యవహారం గురించి కూడా మనమేమీ వినలేమని నాకు నమ్మకం కుదిరింది. ఎందుకంటే నే నిదివరకే చెప్పినట్టు అదీ దాని లక్ష్యాన్ని నెరవేర్చింది ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌ను కూడా ప్రభుత్వం ఒక్కసారి కాదు, ఎన్నోసార్లు వినియో గించుకుంది. ఈ విషయం • యజమానులుగాని, సంపాదకులుగాని అంగీకరించకపోవచ్చు. సి. ఐ. ఎ. మనిషయిన హెర్ష్‌మన్‌ను నియమించేటప్పుడు ఎక్స్‌ప్రెస్ వాడుకోబడింది. రాష్ట్రపతి ఎన్నిక

## ఉపమానం

రోదసిలో
విహార్య షికారు
అంతరిక్షమంటే
అమెరికాకు భలే హుషారు
అయితే ఏంటోయ్ గొప్ప?
లక్షలూ కోట్లూ ఖర్చు తప్ప.
భారతీయులు రోజూ
వెళ్తున్నారుగా నక్షత్ర మండలం
పరుగిడు ధరలు అందుకోటమే
దీనికి నిదర్శనం.

– ఆదిభట్ల రామప్రసాద్

## న్యూఢిల్లీ లేఖ

సమయంలో, సింగ్ – ఠక్కర్ వ్యవహారం సమ యంలో అది వాడుకోబడింది. ఇంకా ఒక నిగూఢ మైన విషయం వుంది రాజీవ్‌గాంధీ ఆశ్రితుడైన సుమన్ దూబే హఠాత్తుగా గోయెంకా దగ్గరచేరారు. హఠాత్తుగానే గోయెంకా దగ్గరి నుంచి వెళ్ళి పోయారు. ఆయన అక్కడ ఎందుకు చేరినట్టు, ఎందుకు వెళ్ళిపోయినట్టు? ఆయన కాలంలోనే రిలయన్స్‌కు వ్యతిరేకంగా గురుమూర్తి రాసిన వ్యాసాలు ఆ పత్రికలో అచ్చయ్యాయి. అంబానీలకు స్నేహితుడైన గోయెంకా హఠాత్తుగా వారికి వ్యతిరేకంగా ఎందుకు మారారనడానికి సంతృప్తికర మైన వివరణ లేదు అంబానీ స్వయంగా తనకు తెలియదంటున్నాడు గోయెంకా ఏమీ మాట్లాడ లేదు. వి. పి. సింగ్ ప్రభుత్వం నుంచి బైటకొచ్చిన సమయంలోనే, తన పని ముగించుకున్న సుమన్ దూబే ఆ పత్రిక నుంచి బైటపడ్డారు ఆయన పనియేమిటి?

విషయాలన్నీ మళ్ళీ మామూలయిపోతున్నాయి. ధీరూభాయి అంబానీ ప్రభ మళ్ళీ యిదివరకటి కంటే ఎక్కువగా వెలుగుతోంది. సూయిజి కాలు వకు యివతలి పక్కన అతి పెద్దదైన పెట్రో కాంప్లెక్స్‌కు ఆయన తుదిమెరుగులు దిద్దు తున్నాడు. హెర్ష్‌మన్ వర్జీనియాలో వున్నాడు. ఆయన స్విస్ ఖాతాలో ఖచ్చితంగా కొన్ని లక్షల డాలర్లు చేరి యింకా ధనవంతుడయ్యేవుంటాడు నస్లీ వాడియా ఇంగ్లండ్‌లో వున్నాడు ఆయన బొంబే డైయింగ్ పురోగమిస్తూనేవుంది గోయెంకా భవనం త్వరలోనే తిరిగి ఆయన చేతికివస్తుంది. ఆయన పత్రిక యిదివరకటికంటే ఎక్కువ లాభాలు చేసుకుంటోంది బలిఅయిపోయినది ఒకే ఒక వ్యక్తి – విశ్వనాథ ప్రతాప్ సింగ్. ఆయనకు పదవిలేదు. పార్టీ లేదు త్వరలోనే 'సహజ' మిత్రులూ లేకుండా పోతారు. ఆయన మోసానికి గురయ్యారు దయనీయమైన విషయమే మంటే ఆయనకు ఆ సంగతి తెలియదు. ■





# భారతరత్న బాద్షాఖాన్ అస్తమయం

'సరిహద్దు గాంధీ'గా, 'బాద్షాఖాన్'గా సుప్రసిద్ధులైన స్వాతంత్ర్య సమర యోధుడు, వృద్ధ సాహసి ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ జనవరి 20న పెషావర్‌లో మరణించారు. 1934లో జాతీయ కాంగ్రెసుకు అధ్యక్ష పదవిని అలంకరించమని కోరినప్పుడు 'నేను సైనికుడిని, సైనికుడిగానే మరణిస్తాను' అన్న బాద్షాఖాన్ 98 సంవత్సరాల వయసు వరకు సైనికుడిగానే పోరాడి, సైనికుడిగానే మరణించారు. ఏడు దశాబ్దాలకు పైగా స్వాతంత్ర్య సమరంలో, నియంతృత్వానికి వ్యతిరేకంగా జరిపిన సమరంలో ఆయన సైనికుడిగా పనిచేశారు.

గఫార్‌ఖాన్ పెషావర్‌లోని ఉత్‌మాంజై అనే కుగ్రామంలో 1890లో జన్మించారు. చదువు కోసం అలీఘర్ వచ్చిన గఫార్‌ఖాన్ మౌలానా అబ్దుల్ కలామ్ ఆజాద్ ప్రభావంతో స్వాతంత్ర్యోద్యమంలోకి వచ్చారు. 1920 నాగపూర్ కాంగ్రెసు సమావేశంలో కాంగ్రెస్‌లో ప్రవేశించిన ఖాన్ ఖిలాఫత్ ఉద్యమంలో అగ్రభాగాన నిలిచారు. మూడు సంవత్సరాలపాటు జైలు శిక్ష అనుభవించారు. తర్వాత కాంగ్రెస్‌తో పెరిగిన అనుబంధం, సహాయ నిరాకరణోద్యమంలో చురుకైన భాగస్వామ్యంతో ఆయన మళ్ళీ జైలుకు వెళ్ళవలసి వచ్చింది.

రెండో జైలుశిక్ష ముగిసిన తర్వాత ఆయన వార్ధా ఆశ్రమంలో గాంధీమహాత్ముణ్ణి కలుసుకున్నారు. ఈ ఇద్దరు మహా నాయకుల పరిచయం 1930లోనే జరిగినా అది ఖాన్ జీవితంపై చెరగని ముద్ర వేసింది. 1929లో తాను ప్రారంభించిన ఖుదాయి ఖిద్మత్‌గార్ అనే ఉద్యమాన్ని కూడా ఖాన్ సంఘ సంస్కరణ లక్ష్యం నుంచి గాంధేయవాద ప్రభావంతో జాతీయోద్యమంలో భాగం చేశారు.

1934లో కాంగ్రెస్ అధ్యక్ష పదవిని తిరస్కరించిన ఖాన్, 1937లో వివిధ రాష్ట్రాలలో మొదటిసారిగా కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏర్పడినప్పుడు కూడ అన్ని రకాల పదవులను తిరస్కరించారు. ప్రజా సేవే తన లక్ష్యమని చాటారు.

క్విట్ ఇండియా ఉద్యమంలో మళ్ళీ జైలుకు వెళ్ళిన ఖాన్ మూడు సంవత్సరాలపాటు జైలు జీవితం గడిపారు. ఆయన ఉపఖండం విభజన పట్ల తీవ్రమైన అభ్యంతరం తెలిపారు. దేశ విభజన ఆలోచనకు కాంగ్రెస్ కూడా అంగీకరించినప్పుడు ఆయన మహాత్మునిపై కోపం ప్రకటించారు.

విభజనకు ముందు నుంచే అఫ్ఘనిస్తాన్‌లోని ప్రశాంత వాతావరణంపై అభిమానాన్ని పెంచుకున్న ఖాన్ విభజన తర్వాత ఎక్కువ కాలం అఫ్ఘనిస్తాన్‌లో ప్రవాసంలో గడిపారు.

పౌరసత్వం ప్రకారం పాకిస్తానీయుడైన ఖాన్ పాకిస్తాన్‌లోని నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా గళమెత్తి 15 సంవత్సరాలపాటు స్వతంత్ర పాకిస్తాన్‌లో కూడా జైలు జీవితాన్ని అనుభవించారు.

విభజననే వ్యతిరేకించిన ఖాన్ తొలి నుంచీ భారతదేశం పట్ల ప్రేమ పెంచుకున్నారు. మొత్తం మీద 1947 తర్వాత ఐదుసార్లు ఆయన భారతదేశాన్ని సందర్శించారు. అనారోగ్య కారణాలరీత్యా మూడుసార్లు ఆయన మనదేశం వచ్చారు. ఆయనకు భారతదేశం పట్లగల ప్రేమకు భారత ప్రజలు కూడా సముచితంగానే ప్రతిస్పందించారు. 1969లో ఆయనకు నెహ్రూ శాంతి బహుమతిని అందజేశారు. 1985లో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ శతజయంత్యుత్సవాలకు ఆయనను ప్రత్యేక అతిథిగా ఆహ్వానించారు. 1986లో ఆయన భారత పౌరుడు కాడనే వివాదాన్ని కూడా లెక్క చేయకుండా ప్రతిష్ఠాత్మకమైన భారతరత్న బిరుదు ఇచ్చారు.



బాద్షాఖాన్ భౌతికకాయానికి శ్రద్ధాంజలి ఘటిస్తున్న ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ, శ్రీ పి. వి. నరసింహారావు గార్లని చిత్రంలో చూడవచ్చు.

రాలిపోయిన భారత రత్నాన్ని, ఉపఖండపు సరిహద్దులో మరొక గాంధీగా స్వాతంత్ర్య సమరం నడిపిన యోధుణ్ణి భారతదేశం వినమ్రంగా, సజల నయనాలతో సంస్మరించుకుంటున్నది.

(ఒ. వి.)



సీరియల్

# ఈతరం యువతి

వడ్లమన్నాటి కుటుంబరావు

(గత సంచిక తరువాయి)

స్కూటర్ డ్రయివ్ చేసుకుంటూ ఇంటికి వస్తోంది మృదుల.

ఆమె మనసు నిండా ఎన్నో రకాల ఆలోచనలు... ఈగల్లా ముసురుకుంటున్నాయి..

చివరికిదంతా ఏం కాబోతోందో... ఏమిటో?

తను అనుకున్నట్టు జరుగుతుందా? లేక తనకు ఘోర పరాజయం ఎదురవుతుందా?

ఈ చిక్కులు అధిగమించటం... ఈ ముళ్ళు విప్పటంలో తను కృతకృత్యురాలు అవుతుందా?

ఏమో?

అంతా అయోమయంగా ఉంది.

విజయావకాశాలు చాలా తక్కువగానే కనిపిస్తున్నాయి.

ఒకవేళ ఓడిపోతే....

అమ్మో?

ఇంకేమైనా ఉందా?

ఏం...?

హాయిగా మృత్యుదేవత ఒళ్ళో రెస్టు తీసుకోవచ్చు!

విషాదంగా అనుకుని సన్నగా నవ్వుకుంది మృదుల.. వేదాంతిలా

'నో... ఐ కాంట్‌బి' మనసులోని మరో భాగం ఎదురు తిరిగింది.

ఇంటికి రాగానే... స్కూటర్ షెడ్‌లో పెట్టి... బజార్లో తెచ్చిన ఆర్టికల్స్‌తో లోపలకు అడుగు పెడుతున్న మృదుల....

ఆ దృశ్యం చూసి అదిరిపోయింది.

"మృదులా!!" అన్న గట్టి కేక విని కొయ్యబారిపోయింది.

"నేను నీకేమి చెప్పాను?"

"......"

"నువ్వు నాకేమి చెప్పావు అడిగినప్పుడల్లా"

". ........"

"ఆడపిల్లవుగదా అని గారాబం చేస్తే... అల్లారు ముద్దుగా చూస్తే... ఇంత పచ్చి అబద్ధం ఆడతావా?"

"...."

"ఒకటి రెండు సార్లు.. అదీ తప్పనిసరి అయివెళ్ళి పలకరించానని నాతో చెప్పి... ఇప్పటికి బోలెడన్నిసార్లు వాడింటికి వెళ్ళొచ్చావా?"

"......"

"మనకీ వాళ్ళకీ కుదరదు అని చిలక్కి చెప్పినట్టు చెప్పిన నా పలుకుల్ని గడ్డిపోచలా తీసిపారేసి... వాడికి చేరువయ్యావా నువ్వు... ఏమే? ఇంకా నువ్వు నా గారాబపట్టివే ననుకుంటున్నానే.... ఇంత పెద్ద దానివయ్యావన్న మాట!"

కుంగిపోతున్న నవనాడుల్నీ ఎలాగో కూడదీసుకుని కొంచెం కొంచెంగా కళ్ళెత్తి తేరిపార జూసింది మృదుల.

సోఫాలో కూర్చున్న తండ్రి మధుసూదనంగారి కళ్ళల్లో ఎన్నడూ చూడని అరుణిమ.

సుదర్శనం అన్నయ్య కళ్ళలో ఎరుపు జీరలు. రాజేంద్రన్నయ్య కళ్ళలో కనిపిస్తున్న క్రోధం.

వదిన లక్ష్మిరాణి కళ్ళలో నిరసన.

మునలమ్మ కళ్ళల్లో కనిపిస్తున్న జుగుప్స. నిలదీసి అడుగుతున్న తల్లి రుక్మిణమ్మ కళ్ళల్లో అగ్ని గోళాలు!

ఏం జరిగింది?

అసలేం జరిగింది?

తను రవికాంత్ దగ్గరకు చాలా తరచుగా వెళ్ళి వస్తున్నదన్న విషయం వీళ్ళందరికెలా తెలిసింది?

రవికాంత్‌ని ఈ విషయం రహస్యంగానే ఉంచమని చెప్పింది కదా!

సందేహంతో నిండిపోయింది మృదుల మనస్సు. రుక్మిణమ్మే బయట పెట్టేసింది అసలు విషయాన్ని "మీ డాడీ- అన్నయ్యలు- వాళ్ళింటికి వెళ్ళివచ్చి తెలుసుకుని.. నాకు చెప్పారు గాబట్టి తెలిసింది. లేకపోతే నాకు మాత్రమెలా తెలుస్తుంది? ఇంతకీ అసలు విషయం నీకు తెలుసా? చెపితే కళ్ళు తిరిగి పడిపోతావే పిచ్చిపిల్లా!"

"ఏమిటది మమ్మీ?" మెల్ల మెల్లగా అడిగింది భయం భయంగా.

"ఆఁ ఇంకేమిటి? ఎవడంటే నువ్వు ఇంతగా అభిమానిస్తున్నావో... వాడేట నీ మీద ఇంత ఘోరమయిన నిందవేసి కరపత్రం ప్రింటు చేయించి పంపిణీ చేసినవాడు."

"ఏమిటీ? రవికాంత్ ఇంత నీచానికి ఒడిగట్టాడా?" గట్టిగా అంది మృదుల.

"ఎందుకలా ఆశ్చర్యపోతావ్ సిస్టర్! వాడే ఆ బాస్టర్డ్ నీ మీద మత్తు మందు జల్లాడు. సమాజం మీదకి కరపత్రాలు వెదజల్లాడు. అందుకు వాడికి తగిన

**జరిగిన కథ-13 :** మృదుల, రవికాంత్‌లు తమ ప్రేమ వెల్లడించుకుంటారు. మృదులకు వచ్చిన సంబంధాలన్నీ దుష్ప్రచారంవల్ల చెడిపోతుంటాయి. ఆ దుష్ప్రచారం చేసేది రవికాంతేనని ఎవరో మధుసూదనంగారికి ఫోన్లో చెపుతారు. మధుసూదనం, ఇద్దరు కొడుకులు కలిసి రవికాంత్‌ను చితకకొట్టి ఇంట్లో వదిలేస్తారు.

శాస్తి చెయ్యకుండా వదిలిపెట్టామనుకున్నావా?" అన్నాడు రాజేంద్ర.. తమాషాగా నవ్వుతూ.

"ఏం చేశారు?" ఆతృతగా అంది మృదుల.

"ఇంకేం చెయ్యాలి సిస్టర్ నేనూ... అన్నయ్య... డాడీలు కలిసి కొంకీలు విరిగేట్టు.... చితకతన్నాం వాడిని"

"రవికాంత్" అంటూ గట్టిగా అరిచింది మృదుల. అతన్ని చితకతన్నారు అన్న భావనకి ఆమె తట్టుకోలేక పోయింది. తన స్నేహితుడు... హితుడు... ప్రియుడు... తన మనసులో 'అన్నీ తానే అయిన రవికాంత్‌ని అన్యాయంగా తన్నారా? తన డాడీ అన్నయ్యలు కలిసి! ఆ కరపత్రంలో రవికాంత్‌కేం సంబంధం. అయితే ఎవరు చేశారీపని?

"ఏం చెల్లాయ్... అరిచి మరీ ఆలోచనల్లో పడిపోయావ్? ఇక నీ సంగతేమిటో డాడీ చెపుతారు విను" అన్నాడు సుదర్శనం.

మధుసూదనంగారి కేసి చూసింది మృదుల బెరుకు బెరుకుగా.

"బేబీ!" గంభీరంగా ఉందాయన గొంతు. "బేబీ! మేమంతా నీ కిచ్చిన చనువునీ, చూపించిన గారాబాన్ని నువ్వు పూర్తిగా దుర్వినియోగ పరుచుకున్నావ్. గొర్రె కసాయివాణ్ణే నమ్ముతుందన్నట్టుగా... నువ్వు... ఆ దుర్మార్గుడు 'గ్రిప్'లోకి వెళ్ళిపోయావ్. ఈ క్షణం నుంచీ నువ్వు వాడి ముఖం చూడటానికి కూడా వీల్లేదు. కాదని వెళ్ళావో... నీ పట్ల చాలా కఠినంగా వ్యవహరించాల్సి ఉంటుంది. బి. కేర్‌ఫుల్"

కొన్ని క్షణాలు ప్రాన్పడి పోయింది మృదుల.

నిస్తేజంగా అలానే నిలబడిపోయింది.

ఆ తరువాత "మమ్మీ... డాడీ" అంది బాధగా.

ఆమె మాటల్లో పశ్చాత్తాపం ధ్వనిస్తోంది.

"నన్ను క్షమించండి. రవికాంత్ ఇంత దుర్మార్గుడనీ మేకవన్నె పులి అనీ నాకు ముందుగా తెలియనే తెలియదు. అందుకనే.. నా యాక్సిడెంటుకి గురయ్యాడన్న సానుభూతితో... వాళ్ల యింటికి కొన్నిసార్లు వెళ్ళిన మాట నిజమే! అతని చెల్లెళ్ళు కూడా బాగా స్నేహమయినందువల్ల.. వెళ్ళి కబుర్లు చెప్పుకు వచ్చేదాన్ని. అతను నా మీద కనీసం కృతజ్ఞత కూడా లేకుండా ఇంత పని చేశాక... ఇక అక్కడికెందుకు వెడతాను? పొరపాటుగా కూడా వెళ్లను! ఇప్పుడు మీరు



చితక బాదారన్నారే చాలా మంచి పని చేశారు! అతనికాశాస్తి కావలసిందే కనీసం పరామర్శించటానికి కూడా వెళ్లను ఇవాల్టి నుంచీ అతను నాకు పరమ శత్రువు!''

కూతురిలో కలిగిన మార్పుకు మధుసూదనంగారు రుక్మిణమ్మలు చాలా సంతోషించారు. అన్నయ్యలు వదిన ముసలమ్మలు కూడా తమ సంతృప్తిని వ్యక్త పరిచారు.

''ఇప్పుడు నా కూతురి వనిపించావే మృదులా'' ప్రశంసగా చూసింది రుక్మిణమ్మ.

''గుడ్ బేబీ! కీపిటప్'' మధుసూదనంగారి ముఖంలో చిరునవ్వులు చిందులేశాయి

''నాదో రిక్వెస్టు'' ఊపిరి పీల్చుకుంటూ అంది మృదుల

''ఇంత జరిగాక . మనకీ వాళ్ల కుటుంబానికీ కూడా స్నేహ సంబంధాలు కట్! మీ రెవ్వరూ వాళ్లింటికి వెళ్లటానికి వీలులేదు అలా జరిగితే నా మీద ఒట్టే ఆ రాఘవయ్యగారి కుటుంబ సభ్యు లెవరైనా మన ఇంటికి వస్తే . తిరస్కారంగా చూడాలి. తరిమికొట్టాలి రవికాంత్ నా మీద ఇంత దుష్ప్రచారానికి తలపడితే వీళ్లేం చేస్తున్నారు? కళ్లు మూసుకుని కూర్చున్నారా?'' ఆవేశంతో ఊగిపోయింది మృదుల

''వెల్సెడ్ బేబీ! వెల్సెడ్! నీ మాటే మా మాట అందరి తరఫున నేను నీకు ప్రామిస్ చేస్తున్నాను'' ఆనందంగా అన్నారు మధుసూదనంగారు.

అంతా అంగీకార సూచకంగా తలలూపారు

''థాంక్స్'' అంటూ మృదుల తనగదిలోకి వెళ్లిపోయింది వడివడిగా నడుచుకుంటూ.

''అబ్బ! ఇప్పుడెంత రిలీఫ్‌గా ఉందండీ. ఇది మాట వినదేమో? వాడి దగ్గరకే వెడతానని మొండి పట్టు పడుతుందేమో... ఏం చెయ్యాలా అని ఇందాకటి నుంచీ వర్రీ అయి ఛస్తున్నాను '' అంది రుక్మిణమ్మ

''నేనూ అదే అనుకుంటున్నాను. బేబీని ఎలా ప్రీవెంట్ చెయ్యాలా. అని ప్లాన్ చేస్తున్నాను మనసులో''

మధుసూదనంగారు కూడా ఎంతో రిలీఫ్ ఫీలయ్యారు

''ప్రాబ్లెమ్ సాల్వ్ అయింది. లేకపోతే ఎలా ఉండేదో పరిస్థితి?'' అన్నాడు సుదర్శనం.

''ఊరుకుంటావేమిటి బ్రదర్? చీకటి కొట్లో పడేసి రెండు రోజులు తిండి పెట్టకుండా ఉంటే అదే దారికొస్తుంది'' అన్నాడు రాజేంద్ర.. రఫ్‌గా

లక్ష్మిరాణి. . ముసలమ్మలు కూడా సమస్య తీరిందన్నట్టుగా గుండెమీద చెయ్యివేసుకున్నారు.

* * * * * *




రాఘవయ్యగారింట్లో పరుచుకున్న విషాదచ్ఛాయలు నాలుగయిదు రోజులకుగానీ సమసిపోలేదు. అప్పటికి రవికాంత్‌కి తగిలిన దెబ్బలు. దాదాపు తగ్గుముఖం పట్టాయి. దగ్గరలో ఉన్న ఒక స్నేహితుడి ద్వారా కాలేజీకి లీవ్‌లెటర్ పంపిస్తూ. దానిలో తనకు ఒంట్లో బాగుండనందువల్ల .. కాలేజీకి రాలేకపోతున్నానని.. అందువల్ల శెలవు మంజూరు చెయ్యమని ప్రిన్సిపాల్‌ని అభ్యర్థించాడు. తమమీద ఎలాంటి పోలీస్ కంప్లెయింట్ ఇవ్వనందుకు మధుసూదనంగారు, సుదర్శనం. . రాజేంద్రలు .. సగర్వంగా మీసాలు మెలేసుకున్నారు అదంతా తమ ప్రయోజకత్వమేనని మురుసుకుంటూ

తను కాలేజి నుంచి బయటికివచ్చి రింగ్ రోడ్‌లో స్నేహితులతో కబుర్లు చెప్పుకుంటూ నిల్చుంటే . రెండు రౌడీమూకలు కొట్లాటకు దిగినాయనీ... తాను తప్పుకుని పారిపోయేలోపుగానే. విచక్షణా రహితంగా తనని కొట్టారని తల్లిదండ్రులతో చెప్పి సర్దేసుకున్నాడు రవికాంత్

జరిగిన దురదృష్టకర సంఘటనకి.. బాధ వెలిబుచ్చుతూ . మళ్లీ తనని . మధుసూదనంగారే ఆదుకోవటాన్ని అదృష్టంగా ప్రకటించారు రాఘవయ్యగారు 'అవును' అన్నాడు ముక్తసరిగా రవికాంత్ కానీ అప్రయత్నంగా అతని పిడికెళ్లు బిగుసుకున్నాయి కసిగా.

అతని మనసునిండా ఎన్నో ఆలోచనలు గజిబిజిగా.

మృదుల తనని పలకరించటానికి రాకపోవటం మరింత బాధ కలిగించింది రవికాంత్‌కి మళ్లీ వెంటనే తన మనసును సమాధాన పరచుకున్నాడు ఆమెకు ఇంట్లో ఎలాంటి ఇబ్బందులెదురయినాయో? తండ్రి అన్నయ్యలవల్ల అని

ఈ లోపుగా అతను ఊహించని సంఘటన ఒకటి జరిగింది

వాకిట్లో లూనా ఆగింది

''లెక్చరర్ రవికాంత్‌గారిల్లు ఇదేనా?'' అని అడుగుతోంది ఒక అమ్మాయి

''అవునండీ మీ రెవరు?'' అంటోంది తన చెల్లెలు పద్మిని.

''నా పేరు నిర్మల మృదుల స్నేహితురాలినని చెప్పండి మీ అన్నయ్యగారితో అందా అమ్మాయి

పద్మిని అలాగే చేసింది

వెంటనే లోపలికి రమ్మనమని చెప్పాడు రవికాంత్

నిర్మల లోపలికి వచ్చింది 'నమస్తే రవికాంత్‌గారూ!'' అంటూ

''నమస్తే! రండి! కూర్చోండి మీరు మృదులగారి ఫ్రెండ్‌కదూ. ఆ రోజున చూశాను '' కుర్చీ చూపించాడు రవికాంత్.

''ఎలా ఉంది మీ కిప్పుడు?'' అంది కూర్చుంటూ

''ప్రస్తుతానికి ఫరవాలేదులెండి'' అన్నాడు.

నిర్మల రావటం చాలా ఆశ్చర్యంగా ఉందతనికి ఈ విషయం ఈమెకెలా తెలిసిందో గూడా అంతుబట్టటం లేదతనికి

పద్మిని లోపలకు వెళ్లి చెప్పింది గాబోలు.. సీతమ్మ కాఫీగ్లాసు తీసుకొచ్చింది

నమస్కారం చేసింది నిర్మల . తరవాత కాఫీగ్లాసు పుచ్చుకొంది

మృదుల స్నేహితురాలని పరిచయం చేశాడు– రవికాంత్.

''ఏమిటో తల్లీ! మా వాడికేదో శనిపట్టినట్టుగా ఉంది. ఆ మధ్యన మీ స్నేహితురాలు స్కూటరు యాక్సిడెంట్ చేసిందా? అవి తగ్గి ఫరవాలేదనుకునేంతలో ఇదొకటి! ఆ రౌడీ మూకలు కొట్టుకుంటూ అక్కడ మాట్లాడుకుంటున్న మావాడిని కుళ్ల బొడిచేశారమ్మా చూడు! ఈ లోకంలో న్యాయమే లేదసలు. అన్నట్టు మీ స్నేహితురాలు రానేలేదేమిటి ఇన్నాళ్లకయినా?''

''ఊళ్లో లేదు అంటీ ఆ విషయం నన్ను చెప్పి రమ్మని పంపించింది. ఏమీ అనుకోవద్దంది అంది నిర్మల

రాఘవయ్యగారు మార్కెట్టు కెళ్లినట్టున్నారు

వసంత బామ్మగారలు లోపల ఏదో పనితో సతమత మవుతున్నట్టున్నారు.

## విజ్ఞానం – వినోదం

బాబ్‌బ్రౌన్

### సమస్య

కాఫీ ఒలుకుట

### అవసరం

పై అంచుల వరకు నీరు పోసిన ఒక కప్పు, ఒక చిన్న లోహపు మూత, ఒక పెద్ద చక్కెర గడ్డ.

### ఇలా చేయండి

మూతను నీటిపై తేల్చండి. కొద్ది నీరు చిందిన కప్పు అంచులపైనుంచి ఒలుకుతుంది. మూతను తీసేసి, మళ్ళీ కప్పును నీటితో నింపి చక్కెర గడ్డను నీటిలో వేయండి. నీరు బహుశ ఒలకదు.

### ఇలా ఎందుకు జరుగుతుంది?

మూతను నీటిలో వేయడం వల్ల నీటిలో కొంత ఆవరణ పదార్థం చేరుతుంది కప్పులోని మొత్తం పెరిగి నీటి మట్టాన్ని పెంచుతుంది. అదే చక్కెర అయితే నీటిలో కరిగి పోయి కొద్ది మాత్రపు ఘన పరిమాణం పెరుగుతుంది. ఏది ఏమైనప్పటికి నీటిలో చక్కెర గడ్డలను ఎక్కువ వేస్తే మాత్రం నీరు ఒలికిపోవడం ఖాయం.

---

కుశల ప్రశ్నలు వేసి కాఫీగ్లాసు తీసుకెళ్ళింది సీతమ్మ

"ఏమిటి విశేషాలు? మృదుల ఎలా ఉంది?" అనడిగాడు రవికాంత్

"ఆ ఇడియట్ గురించి మాట్లాడటానికే మీ దగ్గరకు పరుగెత్తుకొచ్చింది."

"ఏమిటి నిర్మలగారూ! ఏమిటి మీ రనేది నా మృదులగురించి మీరేమన్నా అంటే సహించేదిలేదు స్టూపిడ్" ఆశ్చర్యపోయిన రవికాంత్ ఆవేశంగా అన్నాడు.

"నా మృదులు అని మీరనుకుంటే చాలదండీ నా రవికాంత్ అని ఆ యూస్‌లెస్ ఫెలో కూడా అనుకోవాలి గదా?"

"అలా అనుకోవటం లేదని మీకెలా తెలుసు?"

"నాకు తెలుసు!" దృఢంగా అంది

"ఎలా"

"ఇంత వరకూ మీ దగ్గరకు వచ్చి కనీసం చూసయినా వెళ్ళలేదుగదా దానికి కారణం ఊహించగలరా?"

"ఊహూ" తెలియదన్నట్టు తలపంకించాడు

"అదేం చేసిందో తెలుసా?"

"చెప్పండి"

"ఇక నుంచీ మీ ముఖం చూడనని తన తల్లిదండ్రుల దగ్గర ప్రతిజ్ఞ చేసింది"

"ఎందుకని?" నివ్వెరపోయాడు రవికాంత్

"అది ఆడది కాదనీ... వైవాహిక జీవితానికి పనికిరాదనీ మీరు ప్రచారం చేయించారటగా?

"నో ... ఆ పని నేను చెయ్యలేదు" గట్టిగా అన్నాడు.

"ఆ విషయం రుజువు చేసుకునేంత వరకూ మీ ముఖమే చూడదట"

"అలాగా?" నమ్మలేనట్టుగా చూశాడు

"అవును, అంతేకాదు. అగ్నివాయువు తోడైనట్టుగా మీ మీద మరో బ్రహ్మాండమైన అపవాదు పడింది!"

"ఏమిటది?" గాభరాగా అడిగాడు.

"ఛీ! చెప్పాలంటేనే, సిగ్గుగా ఉంది నాకు"

"చెప్పండి నిర్మలా.. ఈ టెన్షన్ నేను భరించలేను." ప్రాధేయ పూర్వకంగా అడిగాడు

దానికి జవాబుగా తన హాండ్‌బాగ్‌లోంచి.. ఒక కాగితం తీసి చేతిలో పెట్టేసింది నిర్మల.

చిన్నన దాన్ని లాక్కుని... గుండె బిక్కబట్టుకుని లోలోపల చదవసాగాడు రవికాంత్ అందులో ...

హాయ్ మృదులాదేవీ!

గుడ్‌మార్నింగ్ టుయు!

ఈ ఉత్తరం ఎవరు రాశారు... అన్నది నీకు అప్రస్తుతం ఏం రాస్తున్నారు అనేది చాలా అవసరం.

నీ స్కూటరీ మధ్య తరచుగా రవికాంత్ ఇంటి ముందు ఆగడం.... ఎవరికంటా పడిందో లేదో గానీ నా కంట మాత్రం అనేకసార్లు పడింది.

మిస మిసలాడే వయసులో ఉన్న మీరు... గుస గుసలే ఆడుకున్నారో... ధ్యాయిమ్మ్ పాడుకున్నారో నాకనవసరం.

కా నీ ఒక్క మాట

నీ వతన్ని ప్రేమిస్తున్నావటగా?

అతనంటే పడి చచ్చిపోతావటగా? అతన్ని పెళ్ళి చేసుకుందామని అతనితో తియ్యటి అనుభూతులు పంచుకుందామని అనుకుంటున్నావటగా

పిచ్చి మృదులా?

నీ అమాయకత్వాన్నేమనాలో నాకు తెలియటంలేదు.

ఇన్నేళ్ళ నుంచి అతనికి సంబంధాలు ఎందుకు రావటంలేదో నీకు తెలుసా? అతని పేరు చెపితేనే ఆడపిల్లల తండ్రులు ఎందుకు గుండె దడపాలవుతున్నారో తెలుసా?

నీకు తెలియదుబేబీ!

తెల్లనివన్నీ పాలు నల్లనివన్నీ నీళ్ళనుకునే వయసు నీది.

అసలు రహస్యం చెపుతున్నా నీ గుండె ఆగిపోకుండా వినుకో

అతను 'మగ' తనంలేని మహారాజా.' అర్థమయిందా బేబీ.

ఇంకా నువ్వతన్నే పట్టుకు వాకులాడుతానంటే నీ అంత మూర్ఖురాలెవరూ ఉండరు.

ఇప్పటికయినా సరే! రవికాంత్ స్నేహానికి ఫుల్‌స్టాప్ పెట్టేసుకో బేబీ. లేకపోతే నీ జీవితం.

అంధకార బంధురం

ఇట్లు,
నీ
అభ్యున్నతి కోరే
బభ్రువాహన

అని ఉంది

దాన్ని చదవటంతోటే ఉగ్రావుడైపోయాడు రవికాంత్

'బుల్‌షిట్!' అంటూ ఆ కాగితాన్ని నేలకేసి కసి తీరా విసిరి కొట్టాడు

వంగుని ఆ కాగితాన్ని తీసి మళ్ళీ తన హాండ్‌బాగ్‌లో వేసుకుంటూ అంది నిర్మల

"కాగితాన్ని కిందేసి కొట్టినంత తేలికకాదగదా, నిందని పోగొట్టుకోవటం రవికాంత్‌గారూ"

చెల్లెళ్ళ పెళ్ళిళ్ళకోసం .. తండ్రికిచ్చిన మాట నిలుపుకోవటం కోసం. తను వివాహం చేసుకోకుండా వేచి ఉండటాన్ని.. తనని నపుంసకుడిగా చిత్రీకరించిందన్న మాట ఈ కుళ్ళు సంఘం

అతని మనసు మూగగా ఆక్రోశించింది 'నాన్నా!' మీ కిచ్చిన మాట నా మీద

ఎలాంటి నిందకు కారణమయిందో చూడండి? ఇందువల్లనే కాబోలు! ఈ మధ్య పెళ్ళి సంబంధాలే రావటంలేదు.

ఏం చెపుతారు నాన్నా దీనికి మీ సమాధానం?

"ఆ బ్నడీ ఫెలో మృదుల ఇంకా ఏమందో తెలుసా రవికాంత్‌గారూ?"

"ఏమంది?"

"తను బృహన్నల అయిఉండీ .. నా మీద మాసకమ్మ అని నిందవేసే అతనేం మగవాడే? గాజులు తొడిగించుకు కూర్చోమని చెప్పు ఇక నుంచీ నేనతని దగ్గరకు రావటంగానీ చూడటంగానీ జరగదని చెప్పమని పంపించింది రవికాంత్‌గారూ? అయామ్ వెరీసారీ" అంది నిర్మల బాధగా.

"నిర్మలగారూ!" నీరసంగా అన్నాడు రవికాంత్

కళ్ళతో నే ప్రశ్నించింది

"మీరు నాకో సాయం చెయ్యగలరా?"

"చెప్పండి"

"ఎలాగయినాసరే మృదులనో సారిక్కడకు తీసుకు రండి.

"రాదండీ బాబూ? అది మహా మొండి"

"ఆరు నూరయినా నూరు ఆరయినా నాకు మృదుల కావాలి"

"అంటే"

"నాకు జీవిత భాగస్వామిని కావాలి"

"అదీ మీ యిష్టమేనా?"

"ఆమె ఇష్టం కూడా అదే! ఆ మాట నాతో ఎన్నోసార్లు అంది"

"మీది అత్యాశేమో?"

"నాకు తెలియదు ఇందాకా వచ్చిం తరువాత నేను వెనక్కి తిరగ దల్చుకోలేదు"

"ఏం చెయ్యగలరు మీరు? వాళ్ళు ధనవంతులు. తిమ్మని బొమ్మిని చెయ్యగలరు. ఇప్పటికే మిమ్మల్ని చితకదన్ని నోరు మెదపకుండా చెయ్యగలిగారు గదా!"

"ఈ విషయం మీ కెలా తెలుసు?"

"నా పేరు నిర్మల... రవికాంత్‌గారూ! మృదులకి చాలా కావలసినదాన్ని. దాని విషయంలో నాకు తెలియనిదంటూ ఏమీ ఉండదు."

"గుడ్!! అయితే మీరు నాకు సలహా ఇవ్వక తప్పదు. మృదులని నా లైఫ్ పార్ట్నర్‌గా చేసుకోవాలంటే ఏం చెయ్యాలి?

"బాగా రికవర్ అయిన తరువాత.. తయారు అవాలి" నవ్వేసింది నిర్మల.

"తేలిగ్గా తీసుకోకండి నిర్మలా! మృదులని నేను సాధించలేక పోతే. ఆత్మాహుతికైనా సిద్ధమే"

"సారీ! రవికాంత్‌గారూ! మృదులపట్ల మీ సిన్సియారిటీకి హేట్సాఫ్! సరే సలహా అడిగారు ఇమ్మంటారా?"

"వెంటనే..."

"దానికి బుద్ధి చెప్పి.. మీ చేత బుద్ధిగా మూడుముళ్ళు వేయించుకునేట్టు చెయ్యాలంటే ఒక కిటుకు ఉంది. చెయ్యగలరా మరి"

"తప్పకుండా"

"ఏ మాత్రం వెనుదిరగకూడదు"

"నో"

అదేమిటో వివరంగా చెప్పి "బెస్ట్ ఆఫ్ లక్" అంది నిర్మల.

"థాంక్యూ" అన్నాడు రవికాంత్.

అందరి దగ్గర శెలవు తీసుకుని వెళ్ళిపోయింది నిర్మల. "వట్టి వాగుడుకాయనుకుంటాన్రా అబ్బాయ్" అంది సీతమ్మ

యదాలాపంగా తల ఊపాడు రవికాంత్

(ఇంకా ఉంది)

# కోహినూర్

సుతిమెత్తని నీ చిరునవ్వుల వెల్గులు
సుగమం చేస్తాయి నా భవితవ్యాన్ని
జీవిత సోపానాల అధిరోహణలో
నేను ఒంటిగాదు జంటగా నీ బాహుబంధం
అనురాగం చిందే నీ హృదయం నాకు వేయి విధాల విదితం

**KOHINOOR®**

గులాబీరంగు
సుఖదాయకమైన లూబ్రికేటెడ్
కాండోమ్ ఎలెక్ట్రానిక్
ఉపకరణాలతో పరీక్ష
చేయబడినది



ఇప్పుడు
ఖర్చు ఆదా చేసే
విధంగా ఒకే
ప్యాక్‌లో పది

ttk తయారీ

MAA (S) LRC 4 A TEL 86

# షేర్ మార్కెట్‌లలో పెట్టుబడులు



–యన్. రామ్‌జీ, న్యూఢిల్లీ

చాలా మంది పాఠకులు నన్ను ప్రశ్నించేది ఒకేలాగ వుంది. అది ఏమిటంటే మీరు ఎం. ఎ. (ఎకనామిక్స్) చదివారా లేక సి. ఏ. చదివారా అని, ఇవి అన్ని ఎక్కడ నుంచి కాపీ కొడుతున్నారు అని. నేను ఇచ్చే సమాధానం ఏమిటంటే నేను మీరంతా ప్రశ్నించే విధంగా ఏ ఆర్థికశాస్త్రాన్ని చదవలేదు. మరిఐతే మీకు బొద్దింకలాగ పద్నాల్గు గుండెలు వున్నాయా ఏమిటి? ఈ సబ్జెక్ట్‌ని డీల్ చేయటానికి అంటున్నారా?? అవునండి!! నాకు బొద్దింకలాగ 14 గుండెలు వుండే వుంటాయి. నేను ఎప్పుడూ ఎక్సరే తీయించలేదు మరి. పాఠకులకు ఈ పాటికి అర్థమయ్యి వుంటుంది నేను జువాలజీ స్టూడెంట్‌నని నేను బ్యాచలర్ డిగ్రీ మాత్రం కల్గివున్నాను. అది కూడా విజయవాడ ప్రభుత్వ కళాశాలలో (60 రూపాయిల టరమ్‌ఫీజుతో మాత్రమే) ఇంక రెండవ ప్రశ్న నేను ఎక్కువగా బొంబే స్టాక్ ఎక్స్ ఛేంజి ఫూన్స్యువల్స్ మరియు ఫార్చ్యూన్ ఇండియా, కాపిటల్ మార్కెట్, అప్‌డేట్ అంతే కాక ఇక్కడ అమెరికన్ లైబ్రరీలో దొరుకు పుస్తకాలు నాకు ఆధారాలు. దీనిలోని జోక్స్ నాకు గుర్తున్నవి. లేక పాత కొత్త పుస్తకాలలోనివి సందర్భోచితంగా వాడుతూ వుంటాను. అంతే కాని ఇవి ఏవి నా సొంతం కావు. అని పబ్లిక్‌గా మీ అందరికి మనవి చేస్తున్నాను. ఇంక ట్రాన్స్‌ఫర్ డీడ్‌లు మంచి చెడ్డలు పరిశీలిద్దామా!

(1) టి. డిలు స్టాక్ ఎక్సేంజి ముద్రించి సీలు వేసినవి మాత్రమే గుర్తింప బడతాయి. టైపు చేసినవి కాని ఫోటో స్టాట్ చేసినవికాని చెల్లుబాటు కాదు.

(2) టి. డిల మీద కొట్టివేతలు వుండకూడదు. ఒకవేళ వున్నట్లు అయితే అమ్మిన వారి సంతకం ఆ కొట్టివేతపై భాగంలో వుండాలి.

(3) టి. డి.లు రెండు కాని అంతకు మించికాని చిరుగులున్న చెల్లవు.

(4) టి. డి.ల మీద బాల్ పాయింట్‌తో చేసిన సంతకము చెల్లుతుంది.

(5) టి డిల మీద సంతకం ఇంగ్లీషు, హిందీ లేక అస్సామీ, బెంగాలీ, గుజరాతి, కన్నడ, కాశ్మీర, మలయాళం, మరాఠీ, ఒరియా పంజాబి, సంస్కృతం, అరవం, తెలుగు, ఉర్దూలలో వుండవచ్చు. ఇవి అన్ని కూడా ఆర్టికల్ 344 (ఐ) మరియు 451 ప్రకారం గుర్తింపు పొంది వున్నాయి. అంతే కాక వేలి ముద్రలు కూడా చెల్లుబాటు అవుతాయి.

(6) సాక్షి సంతకం మాత్రం బయటివారై వుండాలి.




ఒకే ఇంటిలోని వారు కాని లేదా రక్త బంధువులు కాని సాక్షులుగా ఉండటానికి అర్హులు కారు.

(7) మైనర్ పేరు మీద వున్న షేర్లకు గార్డియన్ సంతకం చెల్లుబాటు అవుతుంది.

(8) జాయింట్‌గా కల్గివున్న షేర్లలోని ఏదైనా కారణాలవల్ల ఒకరు మృతి చెందితే రెండవవారు సంతకం చేసి, దానితోపాటు డెత్ సర్టిఫికెట్ (మరణించిన వారిది) జతపరిస్తే చెల్లుబాటు అవుతుంది.

(9) దివాళా తీసిన వారి పేరు మీద ఉన్న షేర్లు చెల్లవు. వారి సంతకము సాక్షి సంతకంగా కూడా వుపయోగించటానికి వీలులేదు.

(10) సర్టిఫికేట్ మీద వున్న పేరుకు సంతకంలోని వర్ణక్రమము (స్పెల్లింగ్)లో తేడా వున్నా చెల్లుబాటు అవుతుంది.

ఇవి కాక ఒక ఎక్స్ అనే కంపెనీ యొక్క బుక్ క్లోసర్ తేదీలు 12–15 డిసెంబరు 87 వరకు వుంది అనుకోండి. ఆ కంపెని యొక్క షేర్లు ఆ తరువాత తేదీలలో కొన్నవి 15 డిసెంబరు 87 తరువాతవి మాత్రమే వుండాలి. లేకుంటే చెల్లవు.

బుక్ క్లోసర్ అంటే ప్రతి కంపెనీ సంవత్సరానికి కనీసం ఒక్కసారి అయినా తన కంపెనీలోని వాటాదార్ల లిస్ట్ 3–4 రోజులు మూసివేసి, అంత వరకు ఆమోదం అయిన వారికి మాత్రమే వారు ఇచ్చు బోనస్‌గాని, రైట్స్‌గాని లేక డివిడెండ్‌లకుగానీ అర్హులు. కాబట్టి షేర్ కొన్న వెంటనే మనము కంపెనీకి ట్రాన్స్‌ఫర్ కోసం పంపాలి. లేకుంటే వారు ఇచ్చేవి మనకు చేరక, మనకన్నా ముందుకాని వారి పేరున రిజిస్టర్ చేసుకొన్నవారికి వెళ్తాయి. వారు మనకు, వారికి చెందని బోనస్, రైట్, డివిడెండ్‌లు చక్కగా పొందుతారు. ఇంకా వివరాలు కావాలంటే సదరన్ కన్సల్టెన్సి సర్వీసెస్, సీతమ్మధార బ్రాంచికి వ్రాసి వుచితంగా స్టాక్ ఎక్స్‌ఛేంజి వారు నిర్దేశించిన గుడ్ బాడ్ ట్రాన్స్‌ఫర్ డీడ్‌ల వివరాలు పొందండి. వచ్చే వారం డిబెంచర్‌ల గూర్చి తెలుసుకుందాము.

చాలా మంది కుప్పకూలిపోతున్న ప్రపంచ స్టాక్ మార్కెట్‌ల గూర్చి అడుగుతున్నారు. వారి కోరిక త్వరలో తీర్చగలను. ఇంక శెలవా... □

## రు. 100/– బహుమతి

ఈ వారం బహుమతిలో మార్పు! అది ఏమిటంటే మీ వద్ద పాఠకులందరికి వుపయోగపడే సబ్జక్ట్ అంటే స్టాక్ మార్కెట్‌లు, దానికి సంబంధించిన విశేషాలు పంపి (అంటే షేర్‌షా పేరు లాంటివి) సదరన్ కన్సల్టెన్సీ సర్వీసస్, సీతమ్మధార బ్రాంచి, విశాఖపట్నం–13 వారు ప్రకటిస్తున్న రు. 100 బహుమతిని పొందండి. కార్డుమీద వ్రాస్తే చాలు, కవరులు ఇతరత్రా వాటి అనవసర వ్యయానికి మీరు దోహదకారులు కావద్దు.

యన్. రామ్‌జీ



# ఈకాలం పిల్లలు....

కె.నాగేశ్వరి

చెడి బ్రతకడం కంటే బ్రతికి చెడటం కష్టం. అందులోనూ ఆ గత వైభవం కొందరికి మరీ మరీ తలచుకోడం అలవాటు. ఆడవాళ్ళయితే తీరికగా కూర్చుని వంటా పని అయ్యాక ఆ కబుర్లు పోగేసుకుంటారు. మయసొచ్చే ఆడపిల్లలు అవి విని ఒకవిధమైన గర్వం, పొగరు నరనరాన జీర్ణించుకుంటారు. అటువంటి ఇంట పెరిగిన ఆడపిల్లలకు వయసు పదమూడు దాటినా ఎన్నాళ్ళో జీవితంలో కష్ట నిష్ఠూరాలు పడిన పెద్దల్ని కూడా ఎంతమాటపడితే అంతమాట అనేస్తారు. ఉదాహరణకు ఇంట్లో తండ్రి సైబాపతు అయితే తల్లికి పిల్లల ఎదిరింపులు, తిరగబడడం భరింపరానివిగా ఉంటాయి. తల్లికే గొప్పలుంటే ఆ పిల్లలు టీనేజ్ దాటాక చాలా కష్టాలుపడాల్సొస్తుంది.

చదువుకుంటూంటే తోటి కాలేజీ పిల్లలకు వీరిగొప్పలు అమృతాంజనం సీసాను వెతుక్కునేట్లు చేస్తాయి. వీరు కనుపించగానే ఆమడదూరం పరుగెడతారు. "అబ్బ గర్వం, గొప్పలు, పొగరు నరనరాన జీర్ణించుకున్నాయి. ఆ అమ్మాయిని మనం స్నేహంచేసి భరించలేం. వద్దుబాబూ ఆమెతో మాట్లాడితే కొరివితో తల గోక్కున్నట్లే అనుకుంటారు. మంచి స్వభావం, సాత్వికగుణాలూ ఉన్నవారు కొంచెం వీరితో మసలితే కొంత పొగరు దిగుతుంది. అంత సంస్కారం ఉన్నవారు ఈ రోజులలో కూడా వున్నారు. అయితే ఆ వయసులో అవతలివారికి కూడా అంత ఇంగితజ్ఞానం వుండదు. వీరికి అలవాటు వారికీ అవొచ్చు. ఆరునెల్లు సావాసంచేస్తే వారు వీరవుతారన్నట్లు తయారయితే అవతలివారి పెద్దలే రంగంలోకి దిగుతారు. అప్పుడు ఇటువంటివారితో స్నేహం చేసిన నేరానికి వారు ఇంట్లో ముందు చీవాట్లు తింటారు. అయితే ఈ జాఢ్యం అంత తొందరగా వదలదు. అలాఅలా ఫాల్సుప్రెస్టేజి, సుపీరియారిటీకాంప్లెక్సు అలవాటు చేసుకుంటారు. అయితే అన్నిటికీ విరుగుడు నేటి వివాహ వ్యవస్థ. పెళ్ళిళ్ళ మార్కెట్లో వీరిగొప్పలు ఎగిరిపోతాయి. వీరి గొప్పలకి, అవి చాటుకోడానికి తగిన వరుణ్ణి తేలేని పెద్దలు వున్నంతలో ఏదో ఒక సంబంధంచేస్తారు. ఎంతటివారైనా అత్తింట సాగవు ఈ గొప్పలు. అప్పుడు తగ్గించుకుంటారు. లేనివారు జీవితంలో ఇంకపైకి లేవరు.

మగపిల్లలైతే చదువును బాగా నిర్లక్ష్యం చేస్తారు. వీరికి పుస్తకం తీసేంత ఏకాగ్రత ఎంతమాత్రం వుండదు. తీసినా అది కేవలం గొప్పతనం చాటుకోన మన్నట్లుంటుంది. ఇంటికెవరువచ్చినా, వారితో వీరు తమ తెలివితేటలను శతవిధాల చాటుకుంటారు. అలాఅలా ఎందుకూ కొరగానివారు అయ్యేప్రమాదం వుంది. చాలామంది మగపిల్లలు ఆఖరికి గాలికితిరిగితిరిగి చిన్నచిన్న పనులకుకూడా పనికిరాకుండా తయారవడం నిత్యం చూస్తుంటాం. వీరిగొప్పలు మనకేదో తెలివిగా




కనిపించి వారిని ప్రోత్సహించడమే మనం చేసే పెద్ద పొరపాటు. కొందరు తల్లితండ్రులు విపరీతమైన కట్టుబాటులో పెంచినా యిలా తయారవవచ్చు. అందుకే అతి సర్వత్రవర్జయేత్ అన్నారు. పిల్లలు ఆడే ముదినాపసాని కబుర్లు యింత పనిచేస్తే అంతగా చెప్పుకోడం, ఓసారి మంచి మార్కులొస్తే ఆకాశాని కెత్తేయడం మొదలైనవి. తల్లితండ్రులు చేసే మూర్ఖపుపనులు లేదా ఏడిశావులే నువ్వు చదివిందే మిటి? ఏదో గుడ్డి గుర్రం తాపులా మార్కులు వేసేసారు." అనడం ఊరుకో! నీ ముఖం నీ కేంతెలును? అని ఈసడించడం రెండూ ఒక రక మైన హాని చేస్తాయి.

ఫ్రెండ్సు సర్కిలులో ఓ ప్రత్యేకత సంపాదించాలని ఆరాటంకూడా ఈ గొప్పలకి యింకొక మూల కారణం. ప్రత్యేకత అన్నది పుట్టుకతో ప్రతీమనిషికి ఏదో ఒకదాన్లో వుంటుంది. ఆదివారికే తెలియదు. దానిని స్నేహితులు, గురువులు, తల్లి తండ్రులు గుర్తించి మెరుగుపెడితే రాణిస్తుంది. నిజంగా ప్రత్యేకమైన ప్రతిభ వున్నవారు సహజంగా నిరాడంబరులుగా వుంటారు. వీరికి గర్వం గొప్పలు చాతకావు. ఇతరుల దృష్టిలో వీరు సాదాగా సీదాగా అనుతారు. వారిని కొన్నిసంవత్సరాలు ఎరిగినవారు కూడా గుర్తించలేనంత నిర్వికారంగా వుంటారు. ఈ గొప్పలు చెప్పేవారు, చేసే అట్టహాసాలు ఏమీ వీరికుండవు.

చెయ్యిదాటిపోతే ఎవరూ ఏదీ చెయ్యలేరు. సమాజానికిమాత్రం ఈ గొప్పలు చెప్పేవారు అంటే కోతల రాయుళ్ళు అతిహానికరం. వీరికి ఇది బాగా అలవాటుపడిపోతే కష్టపడడానికి బాగా దూరమవుతారు. చివరకి మాయమాటలు చెప్పేవారుగా, మోసకారులుగా మారతారు. జీవితంలో ఏదో ఒక్క రోజున అధఃపాతాళానికి క్రుంగిపోతారు.

అందుకే టీనేజ్ పిల్లలు గొప్పలు తమ భవిష్యత్తుకే గొడ్డలిపెట్టని భావించాలి. మన మేమిటి? మన పరిస్థితులేమిటి. మనం ఏం సాధించాలి? ఎలా నిలద్రొక్కుకోవాలి అనే నేలమీద నిలిచే ఆలోచనలుచేయాలి. ఆ ఆలోచన, అవగాహన అలవర్చుకుంటే దేశంలో కొందరైనా మేధావులు, శక్తివంతులు, ధైర్యస్థులు తయారవుతారు. జాతి నిర్వీర్యమవదు. ఒకప్పుడు ఎవరో ఒకరుంటే "కోతల రాయుడు" అని నిక్‌నేమ్ పెట్టేవారు. ఈరోజు ఎక్కువైందిగనుక చర్చనీయాంశమైంది.





జట్కా బండి శిథిలావస్థలో ఉన్న ఆ ఇంటి ముందు ఆగింది. లలితాంబ బండి దిగి వరండాలోకి అడుగు పెట్టింది.

అరుగంతా అంగుళం మందాన దుమ్ము పేరుకుపోయి వుంది. ఇంటి పై కప్పులోని పెంకులు చెదరినచోట్ల సూర్యరశ్మి లోపలికి పడుతోంది.

తుప్పుపట్టిన తాళం ఒక పట్టాన ఊడి రాలేదు. తలుపు తీయగానే పెద్ద మండువా లోగిలి -గుప్పుమని గబ్బిలాల కంపు ఒక్కసారిగా ఆమెను చుట్టుముట్టింది.

ముందురోజే వర్షం పడినట్లు గుర్తులు ఇంట్లోని అణువణువూ ఋజువు చేస్తున్నాయి.

చెమ్మగిల్లిన గోడలు చిత్తడి కంపు కొడుతున్నాయి.

పైకప్పు ఒకపక్కకు గజం మేర జరిగిపోయి వుంది. అందులోంచి విచ్చలవిడిగా వరుణుడు చేసిన వీర విహారంతో గదుల్లోగల గచ్చుమీద అక్కడక్కడ నీటి మడుగులు.

దట్టంగా పట్టిన బూజు ఏదో భూత గృహాన్ని తలపిస్తోంది.

లలితాంబకు ఇల్లంతా చూసేసరికి బావురుమని దుఃఖం ముంచు కొచ్చింది. తను కోరుకున్నదేమిటి జరిగిందేమిటి?

నిత్య కల్యాణం పచ్చతోరణంగా ఉండే ఇల్లు ఎలా అయిపోయింది?

ముగ్గురు కొడుకులకీ ఉద్యోగాలు వచ్చాక ఈవిడ పెంకుటిల్లు పెద్ద భవంతిగా మార్చి ఇన్నాళ్లూ తను బ్రతుకుతెరువు కుపయోగపడిన సంగీతాన్ని సంగీతం కోసం - తన జీవిత సార్థకత కోసం భగవదారాధనకు వినియోగించుకోవాలనుకుంది. కాని కొడుకు లంది వచ్చాక కూడ ఎందుకో - చాల కాలం తనూ ఆయనా ఇక్కడే ఉండిపోవలసి వచ్చింది.

ఒకడిది అర్నెల్లు కేంపుల్లోనే తిరిగే ఉద్యోగం -

రెండోవాడు చాలీచాలని జీతంతో ఇరుకు అద్దె కొంపల్లో వాడి కుటుంబానికే సరిపోక అవస్థపడేవాడు.

మూడోవాడు డాక్టర్, వచ్చేపోయే పేషంట్లతో, చుట్టాలు పక్కాలతో ఇల్లు గలగలలాడేది.

'లలితా!'- సుందర్రామయ్యగారి పిలుపు లలితాంబను ఈ లోకంలోకి తెచ్చింది.

"బండివాడికి బాడుగ ఇచ్చేసారా?"

"ఇచ్చేసాను గాని నువ్వేమిటి అలా కూలబడిపోయావు? పాపం కన్నతల్లివి ఎంత బాధను గుండెల్లో దాచుకోవాలో? శకుంతలను అత్తారింటికి పంపుతూ కణ్వుడంతటి మహర్షి కన్నీళ్లు పెట్టుకున్నాడట. కాళిదాసు ఆడపిల్లను అత్తారింటికి పంపే ఘట్టాన్ని ఏం వర్ణించాడని? మనమనగా ఎంత చెప్పు లలితా? అయినా శుభమా అని మన బంగారు తల్లి భ్రమరను అత్తారింటికి పంపి ఇల ఏడుస్తూ కూర్చుంటావా? ఆడపిల్ల వెళ్లిపోయిన ఇల్లు ఎంత బావురుమని కళావిహీనంగా ఉందో చూసావా? సర్లే- కాని నాలుగు మెతుకులు ఉడకెయ్యి. ఎప్పుడో వియ్యాల వారింట్లో తిన్న భోజనం. నాకు ఆకలి మండిపోతోంది.

సుందర్రామయ్య వాగ్ధాటి గంగా ప్రవాహంలా సాగిపోయింది.

భగవంతుడా? నా కెంతటి ఖర్మ రాసిపెట్టావురా. మతిభ్రమలోనైనా ఈయన సుఖపడుతున్నాడని ఆనందించాలో - ఈ ధోరణికి తను పడుతున్న అవస్థలకి దుఃఖించాలో?'- లలితాంబకు కళ్లలో నీళ్లూరాయి.

సుందర్రామయ్య దంపతులకు ముగ్గురు కొడుకులు - లేక లేక అపురూపంగా ఆడపిల్ల కలిగింది. కూతురంటే సుందర్రామయ్యకు పంచ ప్రాణాలు.

'భ్రమరా భ్రమరా' అంటూ ఐదేళ్ల పల్లవి ఒక్క క్షణం కిందకి దింపేవారుకాదు. కాని ఒకసారి

కుమారి
ఏ.వి.
శేషారత్నం

వేసవి శెలవులకి సుందర్రామయ్య అన్నగారింటికి వెళ్ళినపుడు, భ్రమర పెద నాన్నగారి పిల్లలతో ఆటల్లో పడిపోయి తండ్రిని నిర్లక్ష్యం చేసింది. కాని

భ్రమర ఎంత ఆటల్లో మునిగిపోయినా ఆ పిల్ల సంతోషాన్ని కాదనడం ఇష్టంలేక అదినంతసేపు ఆగి వచ్చేదాక సుందర్రామయ్య భోజనం చేసే వాడుకాదు.

'ఏమిట్రా సుందరం! మరీ అంత గారాబం ఆ పిల్లకీ పనికిరాదు, అంత ఆత్మీయత నీకూ మంచిది కాదు. రేప్పొద్దుట అది అత్తారింటికి వెళ్ళిపోయినా కూడా తిరిగి వచ్చేదాకా పచ్చి మంచినీళ్ళు ముట్టేలాలేవు. ఆడపిల్ల పరాయి సొమ్ము ముద్దూ ముచ్చటా చూసుకోవలసిందేకాని అతి పనికిరాదు సుమా? ఏమమ్మా లలితా! నువ్వైనా వాడిని మందలిస్తావా? లేక వాడికి తందానతాన అంటున్నావా?'

వెంకట్రావు - సుందర్రామయ్య వేలు విడిచిన అన్నగారు. లలితాంబను కేకలేసారు

'ఏం చెయ్యను బావగారూ! మీ తమ్ముడి ధోరణి చూస్తున్నారుగా. పెద్దాడు కాలేజీలో కొచ్చాడు. వాడి గురించే పట్టించుకోరు. ఇక మిగిలిన పిల్లలు రేపో మాపో హైస్కూలు దాటి కాలేజీ చదువు కొస్తారు. ఈయన కెంతసేపూ గారాల కూతురు ధ్యాస తప్ప మరొకటి తోచదు.

ఆడదాన్ని ఎంతకని వేగను? మీరేమన్నా కాస్త కూకలేస్తారనే అసలిక్కడికి ప్రయాణం కట్టినాను అత్తయ్యగారే కూతురి రూపంలో పుట్టి ఋణం తీర్చుకుంటున్నారు అంటా రాయన అందుకే భ్రమరాంబ అని ఆవిడ పేరే పెట్టారు పిల్లమీద ఈగ వాలనివ్వరు అదెంత రణపెంకిలా తయారయిందో చూసారా! ఒకసారి దానికి ఒళ్ళు వెచ్చబడితే జ్వరం ఉన్న పదిరోజులూ ఈయనా లంఖణాలు చేసి ప్రాణంమీదికి తెచ్చుకున్నారు ' కళ్ళు తుడుచుకుని చెప్పింది లలితాంబ.

'అన్నట్టు లలితా! మ్యూజియానికి వెళ్ళిన పిల్లలు తిరిగొచ్చారా? అసలే వర్షాకాలం ఏమిటో పిల్లకాయలు చెప్పిన మాట వినరు. 'చెల్లాయిని తీసుకెళ్తా చిన్నాన్నా' అని నా ప్రాణం తీసారు. సరిగ్గా ఇంటికి చేరేదాక భయమే '

సుందర్రామయ్య మాటలకు లలితాంబ గాఢంగా నిట్టూర్చింది.

'మీదంతా చాదస్తం వెళ్ళిన వాళ్ళంతా కూడ పిల్లలే. మీ కూతురొక్కతేకాదు ఏం భయపడ కండి.'

లలితాంబ నోట్లో మాట నోట్లో ఉండగానే బావగారి పిల్లలంతా ఘొల్లుమంటూ వచ్చారు.

సుందర్రామయ్యగారి గుండె లవిసిపోయాయి. వచ్చిన పిల్లల్లో భ్రమర లేదు

వెంకట్రావుగారు కూడ కంగారు పడ్డారు

'నాన్నా! మరేం భ్రమర చెల్లాయి మేము మ్యూజియం నుంచి వస్తొంటే .

'ఏమయింది? పిల్లేదీ'- గావు కేక పెట్టారు సుందర్రామయ్యగారు

'ఇందాక వర్షం పడిందికదా! మెయిన్ రోడ్డంతా నీరే మేమంతా చేతులు పట్టుకుని వస్తూంటే భ్రమర చెల్లాయి లోపలికి కూరుకు పోయింది మేమెంత లాగినా రాలేదు. కొట్టుకుపోయింది -ఘొల్లుమని ఏడుపులు-

'అమ్మో నా బిడ్డ'- విరుచుకు పడిపోయారు సుందర్రామయ్యగారు.

మునిసిపాలిటీవాళ్ళు ఏదో రిపేరుకని తెరిచి మూయ్యడం మరిచిపోయిన డ్రైనేజిలో పడి కొట్టుకు పోయి మరో నాలుగ్గంటలకి ఎంతో ప్రయత్నంమీద ఎక్కడో దొరికింది భ్రమర

ఆయన్ని రానీయకుండా ఎంత ప్రయత్నించినా సుందర్రామయ్యగారు ఉబ్బి వికృతంగా కనుగుడ్లు పొడుచుకొచ్చిన కూతురి శవాన్ని పదేపదే ముద్దు



పెట్టుకుంటూ గుండెలు బాదుకున్నారు. అప్పట్నుంచే ఆయన మతి భ్రమించింది. అన్ని పనులూ మామూలుగానే చేసేవారు. ఒక్క కూతురి మరణాన్ని మాత్రం నమ్మేవాడు కాదు. భ్రమర పెద్దదవుతున్నట్టు దానికి ఓణీలు కొని తేవడం, పిల్లకి పెళ్లి సంబంధాలు చూడాలంటూ ఊళ్ళు తిరిగి డబ్బు తగలేయడం, సంబంధం కుదిరిందంటూ కట్నం కోసం లలితాంబను పీడించడం, పిల్ల పెళ్లి ఖర్చు అంటూ అట్టహాసం చెయ్యడం నిత్యకృత్యాలైపోయాయి.

ఆ వూళ్లో అంతా ఆయన ధోరణికి అలవాటు పడిపోయారు. ఎవరైనా 'నీ కూతురెక్కడుంది? చచ్చిపోయిందిగా' అని పొరబాటున అన్నా వాళ్ల మీదపడి రక్కేసి బీభత్సం సృష్టించేవారు.

'అమ్మమ్మా! అత్త మీకీ పాలు. పెరుగు ఇచ్చి రమ్మంది'-కరణంగారి మనుమరాలు రెండు గిన్నెలు అలమారాలో పెట్టింది.

'టీచర్! అమ్మ మిమ్మల్నీపూటకి కూరలేం చెయ్యొద్దంది. సాయంత్రం నేను వేడి వేడిగా తెచ్చి పెడతానులెండి'- శిష్యురాలు సుధ పరిగెత్తుకొచ్చింది.

'అత్తమ్మా! కాఫీ!'- ఎదురింటి పంకజం కూతురు సీత రెండు ఇత్తడి గ్లాసులలో పొగలు కక్కుతున్న కాఫీని తెచ్చి లలితాంబకీ. సుందర్రామయ్యకీ ఇచ్చింది.

'ఏమ్మా సీతా నీ కొడుకు బాగున్నాడా? స్కూల్లో వేసావా?' ఆప్యాయంగా లలితాంబ పలకరించింది.

'వేసానత్తమ్మా! అమ్మ ఈసారి మిమ్మల్ని ఈ ఊర్నించి కదలనివ్వనంటోంది. నా కూతురికి కూడా మీరే సంగీతం చెప్పాలిట. ఆయన కీ వూరు ట్రాన్స్ఫరయింది'- సీత నవ్వింది.

లలితాంబ గాఢంగా నిట్టూర్చింది. ఈ పిల్లలు ఈ వూరు, ఇల్లు ఆయనకి మతి స్థిమితం తప్పినప్పట్నుంచి ఎంతగా ఆదుకోకపోతే తన బిడ్డలను

## ఆటలు - అద్భుతాలు




మొట్టమొదటి అంతర్జాతీయ బెలూన్ పందాలు 1906లో పారిస్‌లో జరిగాయి. ఏడు దేశాల నుంచి 15 మంది అభ్యర్థులు పాల్గొన్నారు. 22 గంటల 28 నిమిషాల పాటు గాలిలో తేలియాడి 395 మైళ్ళ దూరం ప్రయాణించి, ఇంగ్లండ్‌లోని యార్క్‌షైర్‌లో నేల మీదికి దిగిన ఒక అమెరికన్ ఈ పందెంలొ గెలుపొందారు.

DIST. BY ASIA FEATURES

## మేఘరంజని

ప్రయోజకులను చెయ్యగల్గింది? ముఖ్యంగా ఈ పెంకుటిల్లు తమ వంశానికి రక్షణగా తలనీడ దాచుకోనివ్వడమే కాదు ఎన్నో ఆర్థిక ఇబ్బందులను అధిగమింపచేసింది.

పెద్దాడికి జబ్బు చేస్తే ఆయనకి ఎక్కడా డబ్బు దొరకనపుడు ఈ ఇంటిని తనఖా పెట్టారు. నెమ్మదిగా జీతంలో అప్పు తీర్చేవారు.

మూడో వాడికి మెడిసిన్‌లో సీటొచ్చినపుడు వాడు తనని చేర్పించకపోతే చచ్చిపోతానని గోల పెడితే ఒంటి రెక్కయినా తను ధైర్యంగా ఈ పెంకుటింటిమీదే అప్పు తెచ్చింది.

నలభయ్యేళ్లక్రితం తన అత్తగారు ఇంటి బాధ్యతను కొత్త కోడలుగా ఈ గడపలో అడుగుపెట్టినపుడే తనకి ధారాదత్తం చేస్తూ-' అమ్మడూ లలితా! ఇది తర తరాలనుంచి వస్తున్న పెంకుటిల్లు. మన అందరి జీవితాలూ ఇందులో వెళ్లిపోవల్సిందే. ఎన్నో కష్ట సుఖాల్లో కన్న తల్లిలా ఆదుకున్న ఈ ఇంటిని పెంకుటిల్లని చిన్న చూపు చూడకు. ఎలాంటి పరిస్థితుల్లోనూ దీన్ని అమ్మకండి. వాడొక వెర్రిబాగులవాడు. ఇంటి మహలక్ష్మిని నువ్వే నిగ్రహించుకు రావాలి.' అందావిడ.

కూతుళ్ల ఇళ్లలో ఇంతకాలం ఉన్నా చచ్చిపోయే టైము ఎలా తెలిసిందో ఆ సమయానికి ఈ గడపచేరి ఇక్కడే ప్రాణం విడిచింది. అపుడు అత్తగారి శ్రాద్ధ కర్మలకి మళ్లీ ఈ ఇల్లే ఆదుకుంది. లేకపోతే అంతంతమాత్రం జీతంతో వేలకి వేలు ఖర్చు పెట్టి ఘనంగా ఆవిడ అంతిమ యాత్ర చేయించడం తమ తరమా?

ఇంటి యజమానికి మతి స్థిమితం తప్పినపుడు తనని కన్న తల్లిలా ఆదుకుంది. ఈ ఇల్లే తగ్గుతుందనే వెర్రి నమ్మకంతో ఆయన్ని తీసుకుని ఎన్నో ఆసుపత్రులు చుట్టూ, డాక్టర్ల చుట్టూ తిరిగింది. డబ్బంతా అయిపోయాక మళ్లీ ఇక్కడికే చేరింది.

తన చిన్నతనంలో మొదలుపెట్టి నేర్చుకున్న సంగీతం జీవనాధారమయింది. పదిమంది పిల్లలకి సంగీత పాఠాలు చెప్పుకుంటూ బిడ్డల్ని చదివించింది. రెండేళ్లకి పెద్దాడు అందొచ్చాడు. మరో ఏడాదికి రెండో వాడు. మొన్న రెండేళ్లక్రితం









విన్నాడూ స్థిరపడ్డాడు. కోడళ్ళు ఎంత నాగరీకులయినా మొదట ఈ గడపలో తొలిసారిగా పాదం పెట్టాల్సిందేననే తనమాట నెవరూ కాదనలేరు. ప్రతి నిత్యం ఈ ఇంట్లోని అణువణువూ సప్త స్వరాలతో మారుమ్రోగుతుండేవి. ఒకసారి తను మేఘరంజని రాగాలాపన చేస్తుంటే ఈ ఊరి స్కూలు తనిఖీ చెయ్యడానికొచ్చిన స్కూళ్ల ఇన్‌స్పెక్టర్ గుమ్మంముందే ఆగిపోయాడట తన్మయంగా- ఆయన సంగీత ప్రియుడే కాక ఎన్నో సంగీత సభలకి మెంబరు కూడ.

'అమ్మా! మీరేమీ అనుకోకపోతే ఒక్కమాట. ఇంత చక్కని గాత్రాన్ని ఈ పల్లెటూరికి మాత్రమే పరిమితం చేస్తే ఎలా? మీరు తీర్చిదిద్దుతున్న పిల్లలు మాణిక్యాల్లా బయట ప్రపంచంలో ఎన్నో బహుమతులు పొందుతున్నారని విన్నాను. మీ రంగీకరిస్తే మా త్యాగరాజసభలో మీ మొదటి కచేరీ ఏర్పాటు చేస్తాను. పక్క వాద్యాల ఏర్పాటు నేనే చూసుకుంటాను. మా పట్టణ ప్రజలు సంగీత ప్రియులు. మీలాంటి గాన సరస్వతిని కళ్లారా చూసి, తనివితీరా మీ సంగీతాన్ని ఆస్వాదించే భాగ్యం కలిగించండి'- అన్నాడాయన రెండు చేతులూ జోడించి.

తన జీవితం మలుపు తిరిగింది. తర్వాత ఎన్నో కచేరీలు చేసింది. ప్రశంశల నందుకుంది. కచేరీలమీద వచ్చే డబ్బుతోనే ముగ్గురి బిడ్డలనూ ప్రయోజకులను చేసి వాళ్లనొక ఇంటి వాళ్లను చేసింది. అయినా ఈ పెంకుటిల్లు మాత్రం వదలలేదు. ఎంత డబ్బు వచ్చినా ఏవో అవసరాలు శాపంలా తన్నుకుపోయేవితప్ప దీని మరమ్మత్తుకి మాత్రం ఉపకరించలేదు.

బిడ్డలు పెద్దవాళ్లయారుకదా వాళ్ళే తాతలనాటి ఈ ఇల్లు బాగు చేయిస్తారు అనుకుంది. కాని ప్రతివాడికీ ఏదో ఖర్చు.

తను కూడ కచేరీలు మానేసి ఐదేళ్లయింది. ఒంట్లో ఓపిక తగ్గిపోయింది. గొంతు అలసట భరించలేనని మొరాయిస్తోంది. అందుకే చిన్న చిన్న పాఠాలు చెప్పుకుంటూ ఇక్కడే ఉండేది కొన్నాళ్ళు-

కాని ఊరి పెద్దలంతా మందలించారు.

'అమ్మా మీ కీ ఊళ్లో ఉండడం మాకు సంతోషమే. అదృష్టం కూడా. కాని కొడుకులు ఎదిగొచ్చాక ఇంకా ఎందుకు మీ కీ తాపత్రయం? సుందర్రామయ్య గారూ, మీరూ మీ కిష్టమైన కొడుకు దగ్గర హాయిగా ఉండండి. ఆయనకీ పెద్ద వయసు. కొడుకుల దగ్గరుంటే మంచిదికదా!'

వారి భావం తన కర్థమయింది. వాళ్ళు చెప్పినట్లే - కొడుకులు కోరినట్లే ఈ ఇంటికి తాళం వేసి వారి దగ్గరకు వెళ్లారు. కాని అంతా మంచివాళ్లే. కాని తనకేఎందుకో నప్పలేదు.

కొడుకులు బయట తిరిగి తిరిగి ఇంటికి చేరుకుంటారు. వారి మనసు కష్టపెట్టడం తన కిష్టం ఉండేదికాదు. కాని సంగీత సరస్వతి పట్ల ఏమాత్రం అభిమానం లేకపోగా హేళన, తిరస్కారం ఉన్న ఇంటిని తనెలా భరించగలదు?

గట్టిగా గొంతెత్తి తన కిష్టమైన రాగం ఏ సాయంకాలమో తెల్లారుజామునో పాడుతోంటే-

'ఇదెక్కడి దరిద్రం బాబూ! ఇది గానా బజానాలు చేసే కొంపలా! పగలంతా చాకిరీతో ఛస్తే ఏ తెల్లారుజామునో నిద్ర పడుతుంది. ఇంతలో ఇదో గోల'- కొడుకు ఆఫీసుకి వెళ్ళిపోయాక పెద్ద కోడలు సూటీ పోటీగా అనేది.

'ఎంత చక్కని కంఠం లలితాంబగారూ మీది? మా అరవవాళ్లమయితే మిమ్మల్ని పీఠంమీద కూర్చోబెట్టి పూజించేవాళ్లం'- పక్కింటి అరవ అమ్మాళమ్మగారు తన కోడలి సాధింపు విని బాధ పడుతూ వచ్చీరాని తెలుగులో గొణిగేది. తనచేత ఏ కీర్తనో పాడించుకుని వినాలని ఆవిడ తాపత్రయం.

రెండో కొడుకుది అద్దె కొంప. ఆలోగిలిలోనే పది కాపురా లుంటాయి. తనకే బిడియంగా ఉండేది గొంతెత్తి పాడాలంటే. కాని అలవాటయిన నోరు ఊరుకోలేక, పాడలేక నరకయాతన ననుభవించేది.

ఎలాంటి సంగీతమైనా, సాహిత్యమైనా చక్కని శ్రోతలుంటేనే ఉత్సాహంతో పరవళ్ళు తొక్కుతూ గోదావరి ఝరిలా సాగిపోతుంది. కాని కొన్నాళ్లకి తనే సంగీతం మర్చిపోయేలా ఉండేది అక్కడి వాతావరణం-

చాలీ చాలని జీతం, వెచ్చాలు, పిల్లల జబ్బులు - స్కూలు ఫీజు రెండో కోడలి మంచితనానికి నోరు తెచ్చాయి.

ఇక మూడోవాడి ఇల్లు తన సంగీతానికి చాల అనువుగా ఉండేది- అందరికీ తలో గదీ. సత్యం కూడ రోజూ తల్లినీ దండ్రినీ మనసారా పలకరించిగాని హాస్పటల్‌కి వెళ్లవాడు కాదు. కాని వాడిది క్షణం తీరికలేని వృత్తి. ఏ అర్ధరాత్రో ఇల్లు చేరేవాడు. వాడితో మాట్లాడాలని ఎంతో తపించిపోయిన తమకి ఆ అవకాశం దొరికేదికాదు. పైగా నాగరీకురాలయిన, లక్షాధికారిణి అయిన కోడలికి మామగారి పొడ అస్సలు కిట్టేది కాదు. ఇంటినిండా పుట్టింటి జనం

# మేఘరంజని

ఉండేవారు. తాము కూడ ఏదో సత్రంలో తలదాచుకోడాని కొచ్చిన కాందిశీకుల్లా అనిపించేది తప్ప 'తమ కొడుకు ఇల్లు' అనే భావం ఏ కోశానా కలిగేదికాదు. అటువంటి వాతావరణంలో తన గొంతు చిత్రంగా మూసుకుపోయేది.

'పిచ్చిమేళంతో వేగలేకపోతున్నాంరా తమ్ముడూ! ఎపుడో పదేనేళ్ళక్రితం చచ్చిపోయిన కూతురి పెళ్ళి అంటూ ముసలాడు ఆయన్ని సతాయించి మరీ డబ్బు దండుతున్నాడు. ఎక్కడ నిలవ చేస్తున్నాడో- ఇదంతా మా అత్తగారు ఆడిస్తున్న నాటకమేమో అని కూడ అనుమానంగా వుంది."- చిన్న కోడలి మాటలు తనలో ఏవో తంత్రుల్ని తెంపేసాయి.

తనకి కావాలంటే- ఇన్ని కచ్చేరీలు చేసిన తను- డబ్బు నిలవ చేయలేకపోయేదా?' 'చెట్టంత కొడుకులే తమ ధనం' అనుకుంది వెర్రి తల్లిలా-

కాని-

ఎందుకో కొడుకూ కోడళ్ళమీద కోపం రాలేదు. లోకం పోకడే అంత అనుకుంది. మనిషికి 'తనవి' అని స్వంతం లేని బ్రతుకు ఎంత నికృష్టమో తెలిసింది. కాని- తనకి బాధ కలిగించిన విషయం ఒక్కటే-

కొడుకులందరికీ తల్లీ దండ్రీ అంటే ఆపేక్షే. కాని వాళ్ళ పరిస్థితులే వాళ్ళకి ఆటంకాలు. కాని అందరూ ఒక్క విషయంలో మాత్రం ఏకమైపోయారు. తన ఆకాంక్షనొక్కరూ అర్థం చేసుకున్నారు కాదు-

'ఆ పాత ఇంటినేం పట్టుకు వేలాడతారమ్మా! అమ్మి పారేసి తలా కాస్త పంచుకుంటాం. మీకు ఎక్కడ ఇష్టమైతే అక్కడ నాలుగేసి నెలలు హాయిగా ఉండొచ్చు.'

'నిజమేరా అన్నయ్యా! వచ్చిన డబ్బును సేవింగ్స్‌లో వేసి నా కూతురి పెళ్ళికి దాస్తాను' అని రెండోవాడు శీను-

'నర్సింగ్‌హోం కట్టాలనుకుంటున్నాంగా వేణ్ణీళ్ళకి చన్నీళ్ళు' అన్న చిన్న కోడలు-

'ఓ చిన్న ఫ్లాటుకి అడ్వాన్సు కట్టొచ్చు' అని పెద్ద కొడుకు

ఒక్కటే మాట- కాని ఒక్కటే బాణంలా తగిలింది తనకి.

'భలేవారేనర్రా! భ్రమర పురుడూ పుణ్యానికీ వస్తే ఎక్కడుంచుతాం'- ఆయన మాటల్ని వాళ్ళు ఖాతరు చెయ్యనేలేదు.

'ఆ పాత ఇల్లు అమ్మడం దేనికిరా రంగా! ఎంత వస్తుం?'-తను పెద్ద కొడుకుని ప్రాధేయ పూర్వకంగా అడిగింది సంశయిస్తూనే.

'భలేదానివమ్మా! ఇదివరకంటే అది పల్లెటూరు గాని ఇప్పుడా వూళ్ళో సినిమా హాలు, హైస్కూలు, ఆస్పత్రి వచ్చేయి. అది ఏ బిజినెస్ వాళ్ళయినా కొనుక్కుంటే పెద్ద బిల్డింగ్ కట్టుకుంటారు. మొన్నెవరికో చూపిస్తే లక్షదాకా ఇస్తామన్నారు. నాన్న, నువ్వూ వెళ్ళి పాత సామానంతా తెగ నమ్మండి. నేను....'

తన గుండె లవిసిపోయాయి. పండగ వెళ్ళిన మర్నాడే ఆయన్ని తీసుకుని వచ్చేసింది. ఎందుకంటే మధ్యను కెలికినకొద్దీ దాని ఆయువు పెరుగుతుంది.

'టీచర్! ఇపుడు చూసుకోండి మీ యిల్లు!'- పల్లవి మాటల్తో ఈ లోకంలోకి వచ్చింది లలితాంబ. ఆప్యాయంగా ప్రతి గోడనూ తడిమి చూసుకుంది. ఒకనాటి తన శిష్యులంతా కలిసి ఇంట్లోని బూజులన్నీ దులిపేసారు. చక్కగా కడిగి ముగ్గులు పెట్టారు. పెరట్లో తులసికోట దగ్గర అలికి ముగ్గులు పెట్టి ప్రమిదలో నూనె పోసి వత్తి వేసి రడీగా ఉంచారు. తన అలవాట్లన్నీ వాళ్ళకెంత గుర్తున్నాయి?

కడుపు కట్టుకుని రెక్కలు ముక్కలు చేసుకుని పెంచిన బిడ్డలకి తన సెంటిమెంటు, సాంప్రదాయం

## అల

పరుగు పరుగున వచ్చినా-
పెదవైనా విప్పని
బదులైనా చెప్పని
ఎద కరగని
"శిలా" ప్రియుని గుండెల్లో
పగిలిన అల
సహస్ర శకలాలై
కడలిలో నే కలిసింది
ప్రేమకు ప్రతీకలా!

—రుషి

అక్కర్లేకపోయాయి.

'టీచర్! మిమ్మల్నీసారి పోనీయం. మా స్కూలు పిల్లలంతా సాయంత్రం మీ దగ్గరే నేర్చుకుంటారుట'-లక్ష్మి ఉత్సాహంగా అంది.

'మీరు లేని ఈ ఏడు మాకేం బాగులేదు టీచర్! బాబుగారూ మీరు మమ్మల్నొదిలి వెళ్ళకండి. మీకేం కావల్సినా మేం చూస్తాంగా! అంతగా చూడాలంటే మీ వాళ్ళనే ఇక్కడికి రమ్మనండి'- తొమ్మిదేళ్ళ తన ప్రియ శిష్యురాలు నీల, లలితాంబ చెయ్యి పట్టుకుంది ప్రేమగా-

'అలాగేనమ్మా'- నీల తల నిమిరింది లలితాంబ.

'లలితా! నువ్వు మేఘరంజని పాడి ఎన్నో ఏళ్ళయినట్టుందే! అది పాడితే మన భ్రమర నాట్యం చేస్తున్న నెమలిలా నా కళ్ళముందు కనిపిస్తుంది- వాలు కుర్చీలో తన్మయంగా కళ్ళు మూసుకుని పడుకున్న సుందర్రామయ్య అన్నారు.

తులసికోటముందు- గొంతెత్తి తీయగా- గంభీరంగా- మేఘరంజని పాడుతుంటే ఆ ఇంటి గోడలు, పెంకులు, తలుపులు, పెరట్లోని చెట్టూ చేమ- సుందర్రామయ్యతో బాటు తన్మయంగా విన్నాయి. మర్నాడే కొడుకులకి ఉత్తరం రాసి పడేసి తృప్తిగా నిట్టూర్చింది లలితాంబ- 'ఇల్లు అమ్మదలుచుకోలేదు'- అని.

ఎందుకంటే-

కాలం కదిలినా కొండలు కదలవు.

ఆ కొండమీదనుంచి ఎన్నో మేఘాలు కదలిపోతాయి.

కాని కొండతో తోడుగా ఉండిపోవు.

నల్లని బరువైన మేఘం కొండని తాకి వర్షించేలా ఒక్క కన్నీటి బొట్టు విడవాలన్నదే ఇప్పటి ఆమె ఆకాంక్ష-

జీవధారలా మేఘరంజని సాగిపోతూనే వుంది నిరాఘాటంగా

లలితాంబ పండు తమలపాకువంటి చెక్కిళ్ళపై అవిరళంగా ప్రవహిస్తున్న కన్నీటి ధారల్లా. □





# సంపూర్ణమైన పెరుగుదల కోసం రుచికరమైన ఫారెక్స్® మార్గం.

| మీ పాపాయి పొడవు, బరువు తనిఖీ చేసుకోండి* | మగ పిల్లలు | | ఆడ పిల్లలు | |
|---|---|---|---|---|
| | బరువు | పొడవు | బరువు | పొడవు |
| ***3*** నెలలు | **5.2** కిలోలు | 59.1 సెం.మీ. | **4.9** కిలోలు | 58.4 సెం.మీ. |
| ***6*** నెలలు | **6.7** కిలోలు | 64.7 సెం.మీ. | **6.1** కిలోలు | 63.7 సెం.మీ. |
| ***9*** నెలలు | **7.3** కిలోలు | 68.2 సెం.మీ. | **6.9** కిలోలు | 67.0 సెం.మీ. |
| ***12*** నెలలు | **8.4** కిలోలు | 73.9 సెం.మీ. | **7.8** కిలోలు | 72.5 సెం.మీ. |

* ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిసెర్చ్ ద్వారా విడుదల చేయబడినది.

ఇవి భారతీయపిల్లల కోసం సగటు బరువు, పొడవులు మాత్రమే. వీటితో సరిపోలకపోయినా, మీ పాపాయి పెరుగుదల మీ డాక్టరుకు సంతృప్తికరంగా వుంటే ఆందోళనపడే అవసరం లేదు.

పిల్లల పెంపకం సంబంధంగా తీసుకోవలసిన శ్రద్ధను గూర్చి తెలిపే చిన్న రంగుల పుస్తకపు ఉచిత ప్రతి కోసం వీరికి వ్రాయండి:
గ్లిండియా లిమిటెడ్, (FPD/57),
డా. ఆనీ బెసెంట్ రోడ్,
వర్లీ, బొంబాయి-400 025.




సంపూర్ణమైన వికాసం మరియు పెరుగుదల కోసం మీ పాపాయికి ఇవ్వండి

**ఫారెక్స్®**

పెరుగుదల కోసం రుచికరమైన విధానం

# ప్రశ్నావళి — కె. రామలక్ష్మి



**కె. వి. ఆర్., రాయగడ.**

★ మనుషుల్లో జాతి మత బేధాలు లేవు అంటారు కదా- మరి ఒక బ్రాహ్మణ యువతిని ప్రేమిస్తే తప్పని ప్రేమ అంగీకరించకపోవడానికి కారణం?

● ప్రేమించడం అంటే ఏమిటని మీ ఉద్దేశ్యం?! ఒకరి నొకరు ప్రేమించుకోవాలి... ఒకరు ప్రేమించేస్తే చాలదు!

**పి. ఎం. యు. కె. ఎమ్, వైజాగ్.**

★ గోరింటాకుపై రంగనాయకమ్మగారు విజయం సాధించారు మీకేమనిపిస్తుంది?

● ఎందుకే నీకింత తొందరా?!

**ఎల్. వి. ఎస్., గూడూరు.**

★ కె రా. గారూ మీ మీద దావా ఏభై వేలు వేసిందని




రంగనాయకమ్మ- విన్నాము. పొరపాటు ఎవరిదో తెలపండి. మీరంటే చాలా గౌరవం. ఇలాంటి అభాండం వేయడం మాకు బాధగా వుంది.

● మీ అభిమానానికి కృతజ్ఞత. అభాండాలు వేసినా ఫరవాలేదు నాకో భజన కూటం లేదు వుంటే నేనూ కాఫీలు పోయించి- ఓ మనిషినిచ్చి పత్రికల వెంట పంపేదాన్ని నేను చాలా విషయాల్లో ఓర్పుగా వుంటాను కేసన్నాక దానికో అఫీలు వుంటుందని మరచిపోతే ఎలా?

**జి. వి. ఆర్., కాకినాడ.**

★ ఏభై వేలే? ఇస్తారా?

● ఎందుకు? హాయిగా పోయి జైల్లో విశ్రాంతి తీసుకోవాలని అనుకుంటున్నాను

**వి. ఎస్. ఎమ్., అమలాపురం.**

★ హుందాగా ఉండవలసిన హిందువులలో ఇసుక తక్కెడగా తయారైందన్న విషయం చాలా వరకు సమ్మతంగా వుంది కాని ఇతర మతాల్లోలాగా హిందువులకు ప్రవక్త ఎవరు? ఆధారమైన పవిత్ర గ్రంథం ఏది? చార్వాకుడు వగైరా నాస్తిక మునులు కూడా హిందువులే కద వీరిది అసలు ఒక మతం మాత్రమేనా లేక ఈ భూమితో ముడివడి తరతరాలుగా వస్తున్న జీవన విధానమా?

● ఒకే దేవుడు- ఒకే గ్రంథం వుండి వుంటే గొడవే లేదు. హిందూ మతంతో వచ్చిన చిక్కే యిది- సర్వే సర్వత్రా భగవంతుని ఉనికిని గుర్తించకలది- అందుకే ఏ ఒక్కటి ఇదీ- అని చెప్పలేనిది హిందూమతం. నేతి నేతి అని అన్నారేగాని- ఇదే ఇదే అనలేదే! ఇదికాదు అంటూ భగవంతుడ్ని వెతుక్కుంటూ ఎవరి బాటన వారు సాగడానికి దోహదం చేసేదే హిందూమతం. మనిషి మానసిక ఎదుగుదలను పట్టి అతని నమ్మకాలు మారడం సహజం. ఆ స్వేచ్ఛను మన మతం ఒక్కటే యిస్తుంది. అది మనం దుర్వినియోగం చేసుకోవడం మన దౌర్భాగ్యం.

**ఎం. టి. ఎమ్., విజయవాడ.**

★ నాకు పురితాడు బిగిసి ఒక సంవత్సరం అయింది నా వయస్సు 17 ఉరితాడు వయస్సు 34 ఏ అర్హతలూ లేని అతనితో యీ ఉరి తాడునే పసుపు తాడుగా భావించి కాపురం చెయ్యాలా?

● ఏడాది క్రిందట యీ సంగతి గురించి నీ తల్లి తండ్రులతో ఎందుకు వాదించలేకపోయావు? పెళ్ళి- కలిసి బ్రతకడానికి చేస్తారు చేసుకుంటారు అదో జీవిత ఖైదు ఉరిశిక్ష అనుకుంటూ ఎన్నాళ్ళు? ఎన్నేళ్ళు గడపకలరు? అయినా 17 ఏళ్ళకి పెళ్ళిలా చేశారు మీ పెద్దలు? ఆడపిల్లకేనా సరే- చదువు, ఉద్యోగం, లేక సంపాదించడానికి అర్హత కల్గాకనే పెళ్ళి తల పెట్టాలని నేను నమ్ముతాను. సారీ, ఈ సమస్య మీ పెద్దల ముందు నిర్భయంగా వుంచు అదొక్కటే నేను సూచించకల్గిన మార్గం-

**రఫీ, కాశీబుగ్గ.**

★ కె.రా.గారూ స్త్రీ పురుషుని బానిసగా, చేసేదెప్పుడు?

● స్త్రీకి పురుషుడు ఎప్పుడూ బానిసే- పైకి ఒప్పుకోడు అంతే! (లేకుంటే యీ చేతకాని పౌరుష ప్రదర్శనలు, వేపుకు తినడాలు ఇవన్నీ ఏమిటి? దేనికి!?)

★ టి. వి. లేని ఇల్లు స్వర్గం అంటారు. మీరో?

● అప్పుడప్పుడు... అంటాను-

**వై. బి. జి., తిరుపతి.**

★ కె. రా. గారూ, మల్లాది సుబ్బమ్మ, ముప్పాళ రంగనాయకమ్మ మాదిరెడ్డి సులోచన వంటి రచయిత్రులు రేపటి తరానికి కూడా అవసరం అనుకుంటున్నారా?

● ఎందుకు కాకూడదు?! రేపటి తరపు అభిరుచి ఎలా వుంటుందో మీరు గ్యారంటీగా చెప్పకలరా?

★ మీకు ఎలాంటి రచనలు చేయాలంటే యిష్టం?

● కాస్త వాస్తవికతకి కాస్త కల్పన జత చేసి- సృష్టించిన పాత్రల చుట్టూ కథ నడిపించడం నాకు యిష్టం. ఊహలకి వాస్తవికత ప్రాణం పోస్తుంది వాస్తవికత వూహకి పునాదిరాళ్ళు నిలచేలా చేస్తుందని నా నమ్మకం. అందుకనేమో- నేను అభూత కల్పనా సాహిత్యం సృష్టించలేకపోవడం ఫొటో కాపీలాగా వాస్తవికతా దించేయలేకపోవడం.

**జి. కె. ఆర్., దాదితోట.**

★ కె. రా.గారూ మీ సమాధానాలు చదివి కనీసం కొంత మందైనా మారారా?

● ఎలా చెప్పగలను?!

★ అర్ధ నగ్న దుస్తులతో మగవారిని ఆకర్షించేలా దుస్తులు వేసుకు తిరిగే ఆడవారిని ఎందుకలా వెనకేసుకు వస్తారు?

● మీలాంటి సంకుచిత స్వభావం కలవారి సంఖ్యే ఎక్కువ వున్నంత కాలం- అర్ధ నగ్నమే కాదు పూర్తిగా దుస్తులు ధరించిన స్త్రీలకు సహితం- ఎవరిదైనా దన్నుకావాలని తోచడం లేదా మీకు?!

**కె. ఎస్. జి. పి., పొందూరు.**

★ మీ పేరు గిన్నిస్ బుక్‌లోకి ఎక్కాలంటే యింకా మీరు ఎన్ని ప్రశ్నలకు జవాబివ్వాలి?

● చేసిన ప్రతి పనీ లెక్క రాస్తూ కూర్చోడం నాకలవాటు లేదు... ఎన్ని సంవత్సరాల నుంచి రాస్తున్నానో కూడా జ్ఞాపకం లేదు నాకు ◘

సీరియల్

# ఆడపిల్లలు-అనుభవాలు

హరికిషన్

(గత సంచిక తరువాయి)

## ప్రేమ చేజిక్కింది:-

ఆ రోజు ఆదివారం. సత్యభామ కాలేజి పాఠాలు చదువుకుంటూ కూర్చున్నది. సావిత్రి వచ్చింది. ఆ ముఖంలో విచారం ద్యోతక మైంది సత్యభామకు అర్థం కాలేదు

"అట్లా ఉన్నావేమే, వంట్లో బావుండ లేదా, మనస్సుకు సుస్తీ చేసిందా, కూర్చో" అన్నది సత్యభామ సావిత్రి కూర్చున్నది మనసులోని బాధ ముఖంలో స్పష్టంగా కనిపిస్తున్నది.

"ఆ రోజున జగదీష్ వచ్చి పెళ్ళి విషయం మాట్లాడి వెళ్ళినప్పట్నుంచి, ఇంట్లోవాళ్ళ పోరు ఎక్కువగా ఉన్నది అబ్బాయి ఏదో మంచి సంబంధం చెపితే కాదంటావేమే అని అమ్మా, నాన్నా నన్ను బ్రతక నివ్వడం లేదు పెనం మీది రొట్టె పొయ్యిలో పడ్డట్లయింది నా పని" అన్నది సావిత్రి సత్యభామకు కోపం వచ్చింది.

"చూడూ, అసలు నువ్వు పెళ్లి కోసం తొందర పడుతున్నావు, నీకు పెళ్లి అంత అవసరంగా ఉన్నదా"

"లేదు, నేను పెళ్లికి తొందర పడటంలేదు, పెళ్లికి తొందర పడవలసినంత అవసరంగాని, వయస్సుగాని నాకు లేదు. కాని ఇంట్లోవాళ్ళు నా మనస్సుని విరగ్గొడుతున్నారు జగదీష్ వచ్చి అనవసరమైన అర్థంలేని వాతావరణాన్ని సృష్టించాడు."

"మిస్ ఇడియట్, పోస్ట్‌గ్రాడ్యుయేషన్ అయ్యేవరకూ పెళ్లి చేసుకోను అని చెప్పెయ్యి. ఎమ్మెస్సీ డిగ్రీ వచ్చాక కట్నం లేకుండా, చక్కని వరునిచేత తాళి కట్టించుకుని వంద రూపాయల కర్చుతో దివ్యంగా పెళ్లి చేసుకుంటానని నచ్చచెప్పు ఒసేయ్ పిచ్చీ, ఆడపిల్ల ఓణీ సర్దుకుంటుంటేనే, ఆ పిల్లకు పెళ్లి చెయ్యమని తల్లి దండ్రులకు అంతర్వాణి ఆదేశిస్తుంటే, వాళ్లు తొందర పడ్తారని, మనం ఖంగారుపడితే ప్రయోజనంలేదు, సమయస్ఫూర్తి కావాలిగాని, సరిపెట్టుకునే మనస్తత్వం పనికిరాదు" అన్నది సత్యభామ.

సావిత్రి మనస్సు కాస్త కుదుటపడింది. "చూడూ, ఆడపిల్ల కేర్‌ఫ్రీ వయస్సుకు ఎదగడం, మగపిల్లాడికి మీసకట్టు రావటం, పెళ్లి కావడం, పిల్లలు ఇదంతా రొటీన్‌గా జరిగేవే కాకపోతే సెలక్షన్. ఎం. పి. సీకి, బై. పి కీ ఉన్న డిమాండ్ మిగతా గ్రూప్స్‌కి లేదుకదా? కూరల మార్కెట్‌లో కిలో రెండు రూపాయలకి ఇచ్చే వంకాయలే ఏరిచూసి కొంటాము, జీవితాంతం కాపురం చెయ్యవలసిన వరుని సెలక్షన్‌కు ఎంత ఆలోచించాలి. అమ్మా, నాన్న అన్నారని మనస్సుకు బ్లడ్ ప్రెషర్ తెచ్చుకోకు, టేకి ఇట్ ఈజీ" అన్నది మళ్లీ

జరిగిన కథ 4 : అభిలాష్ తమలో ఎవరినో ఒకరిని చేసుకుంటానని అవమానించాడని సత్యభామ, సావిత్రి కోపం తెచ్చుకుంటారు. అభిలాష్‌కు, జగదీష్‌కు మధ్య మనస్పర్థ ఏర్పడుతుంది జగదీష్ సత్యభామ, సావిత్రిల దగ్గరికి రాయబారం వెళతాడు సత్యభామ జగదీష్ పైన ఇష్టం కలిగిందని చెపుతుంది. సావిత్రి అభిలాష్‌ను నిరాకరిస్తుంది మనస్పర్థ కారణం కనుక్కోవడానికి వచ్చిన జగదీష్ చెల్లెలు శ్రీవిద్యను అభిలాష్ అవమానిస్తాడు. చదువుమానేస్తా నంటాడు.

"అభిలాష్‌ని గురించి నీ అభిప్రాయం" అన్నది సావిత్రి

"భారతదేశపు జనాభాలో అతనొకడు, చూట్టానికి సూపర్‌స్టార్ హీరోలా ఉంటాడు, సకల దుర్గుణ ప్రియుడు, సంస్కారవంతుడయిన యువకుడుగా నేనతన్ని ఆమోదించను."

"అంటే ఉమెన్, వైన్ అలవాటు ఉన్నవాడా"

తలవంచుకుని కళ్లెత్తి చూసింది సత్యభామ.

"భార్యా భర్తలయినా తలుపులు తీసుకుని కాపరం చెయ్యరు; చూసింది నిజం, చూడనిది అబద్ధం అనుకోడం కూడా ఆత్మవంచన, నీ కతను అభిమాన యువకుడు కావచ్చు, నేనతన్ని గౌరవ ప్రదమైన వ్యక్తిగా, మనిషిగా ఆమోదించను ఐ హేట్ హిమ్, ఐ డిస్ లైక్‌హిం" స్పష్టంగా అన్నది.

సావిత్రి కాస్త వెనక్కు తగ్గింది.

"కారణాలు తెల్సుకోకుండా అంతటి స్పష్టమైన దురభిప్రాయానికి రావటం మంచిది కాదేమో"

ఇంట్లోకి వెళ్లింది సత్యభామ. ఒక ఉత్తరం తెచ్చి సావిత్రిని చదవమన్నది, సావిత్రి చదివింది

డియర్ మిస్,

దురభిప్రాయంతో కూడిన కోరిక నీ మీద నాకు లేదు. సదభిప్రాయంతో నే ఈ ఉత్తరం రాస్తున్నాను. నేను మిమ్మల్ని దురుద్దేశ్యంతో ఆశించటంలేదు. సదుద్దేశ్యంతో భార్యగా స్వీకరించాలనేదే నా కోరిక. సమంజసమైన నాఈ కోరికను మీరెందుకు కాదన్నారో నాకు తెలీటంలేదు

ఆశను పెంచుకున్న మనిషి హతాశుడైతే అతని మనస్సు క్షోభిల్లుతుంది ఈ సంక్షోభానికి కారణం తను ప్రేమించిన వ్యక్తే అయినప్పుడు ప్రేమ కాలిపోయి మసి మాత్రమే మిగిలినప్పుడు, ఆ బూడిదను నీళ్లల్లో కలిపి తాగినప్పుడే ఆ వ్యక్తికి సంతృప్తి కలుగుతుందేమో!

శెలవు, నమస్తే

అభిలాష్

ఉత్తరం చదివినిర్విణ్ణురాలయింది సావిత్రి "పరిస్థితులు విషమిస్తున్నయ్యి, నువ్వు చాలా జాగ్రత్తగా ఉండాలి ఏదయినా అఘాయిత్యం చేస్తాడేమో" భయంతో అన్నది సావిత్రి.

పేలవంగా నవ్వింది సత్యభామ. పెదవులు బిగబట్టి ముక్కు ఎగబీల్చి, మనస్సు విదిల్చినట్లు చూసింది. భారంగా, బాధపడుతూ నిట్టూర్చింది.

"చూడూ అతనిది రాక్షసప్రేమ, అభిమానం ముదిరితే వెర్రితలలు వేసినట్లు ప్రేమ ముదిరితే ఇటువంటి వాళ్లల్లో రాక్షసత్వం వచ్చేస్తుంది. ఆల్‌రైట్ చూద్దాం" అన్నది సత్యభామ.

జగదీష్ వచ్చాడు. చిరునవ్వుతో ఆహ్వానించారు. ముగ్గురూ కూర్చున్నారు. సావిత్రి కూడా ఇక్కడే ఉంటుందని అతను అనుకోలేదు కాని ఉండటం కూడా మంచిదే అనుకున్నాడు.

"మీకు గుడ్‌మార్నింగ్ చెపుదామని వచ్చాను. అదీ ఏం తోచక. బైది బై, మీరు మరొకరికి నేస్తం, ఒకరు మరొకరికి నెచ్చెలి" అన్నాడు.

"కాఫీ, టీ, కూల్‌డ్రింక్స్ ఏం తీసుకుంటారు" అన్నది సత్యభామ.

"బ్రాందీ, విస్కీ, రమ్, జిన్, " అర్థోక్తితో ఆగిపోయాడు.

"బీర్, కాక్‌టైల్, కట్‌లెట్స్, జాయింట్స్, చికెన్ బిర్యానీ, మోడల్ గరల్, మోడరన్ బ్రెడ్, ఇట్లాంటి పేర్లు నాకూ తెలుసు నిజంగా తాగేవాళ్లు ఇంత హంగామా చెయ్యరు. వాటిని తల్చుకుని మానసిక వ్యభిచారం చెయ్యడం ఒక హాబీ" అన్నది సత్యభామ సరళంగా మాట్లాడుతూ, ఫిశితంగా చూస్తూ, ముక్కులు స్టైలిష్‌గా ఎగబీలుస్తూ



నోరు తెరుచుకుని విన్నాడు జగదీష్

"భావకవి కవిత్వం చెప్తాడు, బావకవి బాధపడతాడు, మానసిక వ్యభిచారం అన్నారు, ప్రేమ, వ్యభిచారం, సెక్స్ ఇవన్నీ ఐ డోంట్ లైక్‌దెమ్ సరళంగా సాగిపోయే జీవితానికి ఇవన్నీ అవరోధాలు" అన్నాడు జగదీష్.

ఇద్దరూ నవ్వేశారు

"మీ ఫ్రెండ్ అభిలాష్ ఉత్తరం రాశారు" అని ఆ ఉత్తరాన్ని ఇచ్చింది సత్యభామ. చదువుకున్నాడు. అసంతృప్తిగాఫీలయ్యాడు.

"చూశారా, ప్రేమ అనే రెండక్షరాల్లో ఎంత దివ్యత్వం ఉన్నదో అంతపైత్యం ఉన్నది. ప్రేమను కాల్చి బూడిదను నీళ్లల్లో వేసుకుని డ్రింక్‌లా తాగేస్తాడట" అన్నది సావిత్రి

క్షణంసేపు మౌనం. నుదురు రాచుకున్నాడు జగదీష్.

"సావిత్రిగారూ, జీవితాలు ఎప్పుడూ సినిమా స్క్రీల్లో ఉండవు మనం జీవిస్తూ, జీవిత గమనాన్ని మన అభిరుచికి అనుగుణంగా దిద్దుకునేందుకు ప్రయత్నించాలి. ఈ తీర్చి దిద్దుకోటంలో ఆడపిల్ల బాధ్యత కత్తి మీద సాములాగే ఉంటుంది హీరో ఎప్పుడూ సిల్వర్‌స్క్రీన్ మీద విరాజిల్లు

తున్నట్లుగా సకల సద్గుణ సంపన్నుడుగా ఉండడు, హీరోయిన్‌ని మెప్పించ టానికి. యాంటీ హీరోగా ఉన్నప్పుడే ఆ యువకుడు రాణిస్తాడు" అన్నాడు జగదీష్.

"ప్రేమకు అర్థం తెలీని ఉద్వేగపు ఉన్మత్తతతో ఉత్తరం రాసి ఆడపిల్ల మనస్సు తగల బెట్టి, ఆ బూడిదను నీళ్ళల్లో కలిపి తాగుతానంటే, దాన్ని హర్షించి, యాంటీ హీరోయిజమ్‌గా భావించి నీరాజనాలు అర్పించాలన్న మాట! మిస్టర్ జగదీష్! ఆర్థిక సహాయం చేసినంత మాత్రాన, మంచీ మానవత్వం లేని ఒక పొగరు బోతుని పెళ్ళి చేసుకోమని సిఫార్స్ చేయటం, ఆత్మవంచనే అవుతుంది, ఇక ఆ చాప్టర్ క్లోజ్ చెయ్యడం ఆరోగ్యకరం" ఉద్విగ్న మనస్కురాలై అన్నది సత్యభామ

అప్రమత్తుడై విన్నాడు జగదీష్ ఇక తర్కించి ప్రయోజనం లేదు అసలు తను వచ్చింది మరోసారి నచ్చ చెప్పటానికి కాని ఈ సమస్య తనను అపహాస్యం పాలు చేసేదిగా మారి పోయింది అయినా చూద్దాం అనుకున్నాడు

"మీ అభిప్రాయం సావిత్రిగారూ!" అన్నాడు సావిత్రి వైపు చూస్తూ

"ఈ రోజుల్లో కొన్ని పరీక్షలు ఆబ్జక్టివ్ టైప్‌లో ఉంటయ్యి శ్రీరాముని భార్య- దమయంతి, మండోదరి, సావిత్రి, సీత దమయంతి భర్త- రాముడు, హరిశ్చంద్రుడు, నలుడు, భీముడు చంద్రమతి కొడుకు- ప్రహ్లాదుడు, అభిమన్యుడు, లోహితాస్యుడు, ధృవుడు




వీటిల్లో ఒక ఆన్సర్ టిక్కు పెట్టాలి అట్లాగే మీ ఉద్దేశ్యంలో అభిలాష్ భార్య- సావిత్రి, సత్యభామ, సుశీల, సూర్పణఖ

వీరిలో ఒకర్ని టిక్ పెడదా మనుకున్నారా? అన్నది సావిత్రి

ఆశ్చర్య పోయాడు జగదీష్ ఇట్లా మాట్లాడు తుందని అతను ఏమాత్రం అనుకోలేదు

'మరువలేని మార్వెలస్‌గా చెప్పేరు, మీ ఉపమానం అద్భుతం కాని మగవాడు బ్రహ్మచారిగా మనుగడ సాగించ వచ్చు, ఆడపిల్ల బ్రహ్మచారిణిగా ఉండలేదు హాస్యంగా ఉందామనుకున్నా అపహాస్యం, అపనిందల పాలవుతుంది దయచేసి మరోసారి ఆలోచించండి, నమస్తే, మళ్ళీ మళ్ళీ కలుస్తాను ఈ రోజుకు శలవు' అని ఇద్దరికీ నమస్కరించి వెళ్ళేడు జగదీష్.

'వాటే ఫూల్" అన్నది సత్యభామ.

'నాటే ఫూల్, వాటే జంటిల్‌మన్" అన్నది సావిత్రి

ఇద్దరూ ఒకరి నొకరు ఎగతాళిగా చూసుకున్నారు. ఇద్దరి మనస్సులూ ఊహా ప్రపంచంలోని అనంత లోకాలకు వెళ్ళినయ్యి. ఒకరి అనుభూతి మరొకరికి సిగ్గుతో కనిపించింది భావాంబర వీధిలో తిరిగి భవితవ్యాన్ని ఎవరికి వారుగా నిర్ణయించు కున్నారు కాని సాధ్యపడలేదు.

* * * * * * * * *

జగదీష్ ఇంటికి వెళ్ళేసరికి ఇద్దరు పెద్ద మనుష్యులు కూర్చుని మాట్లాడు తున్నారు తల్లి జగదాంబ గుమ్మం దగ్గర నిలబడి ఉన్నది. చెల్లెలు శ్రీవిద్య వాళ్ళకు కాఫీ ఇస్తున్నది. 'అడుగో జగదీష్ కూడా వచ్చాడు, జగదీష్! వారు నీ కోసమే వచ్చింది" అన్నది, వాళ్ళకు పరిచయం చేస్తూ.

"నమస్కారం జగదీష్ బాబూ. నా పేరు సూర్య నారాయణ, రిటైర్డ్ కో-ఆపరేటివ్ సబ్‌రిజిస్ట్రార్, మా బావమరిది సుబ్బారావు వరాన్వేషణతో వచ్చాను, మా అమ్మాయి జానకి బి ఏ. పాసైంది వయస్సు ఇరవై మొన్ననే వెళ్ళింది మ్యూజిక్‌లో డిప్లమో తీసుకుంది ఒక్కర్తే కూతురు, ముగ్గు రబ్బాయిలు. మీ సంబంధం సర్వవిధాలా మంచిదని ఇద్దరు ముగ్గురు చెప్పారు. ఈ విషయం మాట్లాడుదామనే వచ్చాను" అన్నా డాయన

తలవంచుకుని నీళ్ళు నమిలాడు జగదీష్ దగ్గరకు వచ్చి తల ఎత్తింది శ్రీవిద్య

"అన్నయ్యా! పిల్ల అప్సరస కాకపోయినా, నీ సరసన ఉండ తగిందేనని వీరు చెప్పేరు. ముందా అమ్మాయిని చూసొద్దాం, ఈ ఊరే, ప్లీజ్" అన్నది.

"చూడూ, పెళ్ళి అనేది అందరికీ కావాల్సిందే, సార్, ముందు మా చెల్లెలు శ్రీవిద్య పెళ్ళి చెయ్యాలన్నదే నా ఉద్దేశ్యం."

నవ్వేడాయన.

"ప్రతి పెళ్ళి కొడుక్కీ ఒక చెల్లెలూ, ఆ చెల్లెలు పెళ్ళి అయితేనే గాని చేసుకోనని అనటం, ఇదీ ఒక ఫార్మాలిటీనే, విధాయకం కూడా అదే కాని ఓ చిన్న విషయం, మా అమ్మాయి క్కూడా-సంబంధం చూడండి, అన్నగారి పెళ్ళయితే ఆ అన్న, వదినెల చేతిమీదిగానే తన పెళ్ళి జరగాలని మీ శ్రీవిద్య కోరికని మీ అమ్మగారు ఇంతకు ముందే చెప్పారు. అదీ ఆలోచించ వలసిన విషయమే." అన్నారు సూర్యనారాయణ గారు.

"అదీ విషయం, ఇక అన్నయ్య నోటికి ఆలీఘర్ తాళం పడింది. అన్నయ్యా! ఎప్పటికయినా నా కోరిక అదే నేను తండ్రిని పోగొట్టుకున్నా, అన్నను పోగొట్టుకో లేను వాంటిడ్ వదినె" అన్నది సంతోషంగా.

నిజంగానే మాట్లాడలేక పోయాడు జగదీష్. "రేపు విదియ, సోమవారం బాగున్నది, మేం ఉండేది చిన వాల్తేర్‌లో రేపు సాయంత్రం నాలుగ్గంటలకి ఈ మా బావమరిది సుబ్బారావు వస్తాడు అందరూ కలిసి అమ్మాయిని చూట్టానికి రండి, శుభం అన్నాడాయన

"అట్లాగే బాబుగారు అందరం అమ్మాయిని చూట్టానికి వస్తాం, ఏర్పాట్లు చేయించండి అన్నది జగదాంబ

వారిద్దరూ నమస్కారం చేసి, శలవు తీసుకుని వెళ్ళేరు. క్షణం ఆగి గంభీరంగా చూస్తూ తల ఎత్తి అన్నాడు జగదీష్, "ఎమ్ కాం ఫైనల్ కాందే నేను పెళ్ళి చేసుకోనని చెప్పాను కదా, ఇట్లా ఎందుకు చేశావమ్మా, ముందుగా నన్ను అడగక్కర్లేదా, నా పెళ్ళి కూడా నీ ఇష్ట ప్రకారమే జరగాలనే కోరిక మంచిదే కాని నాక్కూడా మనసూ, మంచీ ఉంటయ్యి కదా అయిదు నిమిషాల్లో పెళ్ళి చూపుల వరకూ ఏర్పాట్లు చేశావంటే, నీకు చెప్పకుండానే నేను ఎవర్నయినా పెళ్ళి చేసుకుంటానని భయం వేసిందా, అనుమానం పీక్కు తిన్నదా"

'లేదురా, వయసొచ్చిన కొడుకు ఉన్న ప్రతి తల్లీ కోడలు రావాలనే కోరుకుంటుంది. నచ్చిన కోడలు రావాలని తపిస్తుంది ఆ వచ్చే కోడలు కాస్త ఉన్నవారి కూతురయితే బావుంటుందని మనస్సులో నూటొక్క దేవుళ్ళకు మొక్కు కుంటుంది ఈ వచ్చిన సంబంధం అటు వంటిదే అంచేతనే ఆశ పడ్డాను. నీకు ఇష్టంలేని సంబంధం నేనెప్పుడూ వప్పుకోను కాని కన్న తల్లి మనస్సు బాధ పెట్టటం కొడుకు చేయవలసిందీ కాదు. ఈ రివాజును కాదనకు." అన్నది జగదాంబ.



# దావణగెరె

ఫ్యాషన్ ఫ్యాబ్రిక్స్

చేతికి మెత్తగా తగిలే
ప్రియ మరియు ప్రేమిక,
టెరీన్* చీరలు
వ్యక్తిగత అభిరుచులకు తగినట్టుగా
రకరకాల రమ్యమైన రంగులు,
దివ్యమైన డిజైన్లు గల చీరలు.

ఇంకా ఇవి కూడా లభిస్తాయి.

- సూటింగ్స్ • షర్టింగ్స్
- డ్రెస్ మెటీరియల్స్
- కేంబ్రిక్స్
- టూ X టూ రూబియాలు
- టర్కిష్ టవళ్లు

T/8788/D/TEL

దీ దావణగెరె కాటన్ మిల్స్ లిమిటెడ్
హనుమంతప్ప బిల్డింగ్స్, చిత్రదుర్గ రోడ్. దావణగెరె 577 002.

షో రూములు : కావేరీ భవన్, బెంగుళూరు 560 009.
దాజీబన్ పేట, హుబ్లి 580 020. చిత్ర దుర్గ రోడ్. దావణగెరె 577 002.

*టెరీన్ అన్నది CAFI ట్రేడ్ మార్క్

## ఆడపిల్లలు – అనుభవాలు

జడను ముందుకు తీసుకుని, జడ విప్పుకుని వేసుకుంటూ నిల్చుంది శ్రీవిద్య మూతి వంకరగా తిప్పి పెద్ద ఫోజుగా చూస్తూ అన్నది–

"డియర్ బ్రదర్, నేను అమ్మకు గుండెల మీద కిర్సనాలు స్టవ్ అసలు నేను పుట్టే టప్పుడే ఎదురు కాళ్ళున పుట్టేనుట అమ్మకు మెంటల్ రిలీఫ్ కావాలంటే, నాకు పెళ్ళి కావాలి. నాకు పెళ్ళి కావాలంటే, ఓ బావగార్ని నువ్వు కొనుక్కురావాలి పావుకిలో పచ్చి మిర్చి కొని, డబ్బులు రేపిస్తానంటే, కూరల వాడే వప్పుకోని ఈ రోజుల్లో, కట్నం లేకుండా ఏ మీసకట్టున్న అర్భకుడు మాత్రం ఆడపిల్ల మెళ్ళో అమాంతం తాళి కట్టేసి, భార్యగా అమ్మాయిని డిక్లేర్ చేస్తాడు? అంచేత నువ్వు ప్లస్ వదినె, ఈజీక్వల్‌టు నేను ప్లస్ నా క్కాబో యే భర్త అంటే క్రెడిట్ బాలెన్స్ నీది, డెబిట్ బాలెన్స్ నాది.' అన్నది శ్రీవిద్య

జగదీష్‌కు బుర్ర తిరిగి పోయింది కాసేపటికి తేరుకున్నాడు మనస్సు కుమిలి పోయింది

"చూడమ్మా' నన్ను ఎంతకు అమ్మేశారు, కన్న తల్లి పాట ఎంత? పాటదారు చేత డిపాజిట్ కట్టించు కున్నావా?' కోపంతో అన్నాడు

నువ్విట్లా మాట్లాడావంటే అమ్మకు బ్లడ్ ప్రెషర్ పెరుగు తుంది, నాకు పెళ్ళి కాదు ఆ పాపం నీకు చుట్టుకుంటుంది " కన్నీరు పెట్టుకుని అన్నది శ్రీవిద్య

* * * * * * * * * *

మర్నాడు సూర్యనారాయణ గారి బావమరిది సుబ్బారావు గారు టాక్సీ తీసుకుని నాలుగ్గంటల కల్లా వచ్చారు అందరూ వెళ్ళేరు పెళ్ళి చూపులు ఏర్పాటు చేశారు కాఫీ, ఫలహారాలు అయ్యాక అమ్మాయిని చూపించారు అయిష్టంగా చూసేడు జగదీష్ ప్రశ్నలు వేసి పర్మీ కొట్టిద్దామనుకున్నాడు

"మీ అభిమాన దైవం ఎవరు?" అతని ప్రశ్న

మా అమ్మ, పతిదేవుడు" జానకి సమాధానం.

తెలివి తేటలకు కొలమానం ఏది?

"తెలివికి ముందు "అతి"ని కలపక పోవటం '

'మీకు జానకి అని పేరు పెట్టారు, ఆ జానకి పడిన కష్టాలు పడాలని ఉద్దేశమా?"

"ఈ రోజుల్లో ఏ భర్తా రాముడు కాదు కదా, అన్ని కష్టాలు పడటానికి."

"వరకట్నం మీద మీ అభిప్రాయం."

"వరకట్నం ఉండి తీరాలి. లేకపోతే ప్రతీ ఆడపిల్లా ఐ. ఎ ఎస్ ఆఫీసర్నో, డాక్టర్నో, ఇంజనీర్నో కోరు కుంటుంది. ఇతర ఉద్యోగాలు చేసే మగవాళ్ళకు పెళ్ళే కాదు అప్పుడు కన్యాశుల్కం కూడా అమల్లోకి రావచ్చు" అన్నది జానకి.

అందరూ ఆశ్చర్య పోయారు ఇంత పెంకెతనంగా సమాధానం చెపుతున్నదేం అని ముక్కుమీద వేలేసుకున్నది జగదాంబ

'ప్రేమించి పెళ్ళి చేసుకోవటం మంచిదా, పెళ్ళి చేసుకుని ప్రేమించడం మంచిదా?" అన్నాడు జగదీష్!

"అసలు పెళ్ళీడు కొచ్చిన యువతీ యువకులకు ఈ భావాలు మనస్సులోకి రానివ్వటం చాలా తప్పు చచ్చి పుట్టటం మంచిదా, పుట్టి చావటం మంచిదా అన్నట్టుగా ఉంటుంది ఈ ప్రశ్న

కుటుంబ నియంత్రణను గురించి మీ అభిప్రాయం?

ఈసారి పర్మీ కొట్టక తప్పదను కున్నాడు

'పకోడీలు వండటానికి ఇంకా పిండి మర పట్టనే లేదు, అప్పుడే రుచి ఎట్లా తెలుస్తుంది " అన్నది

వెరీగుడ్, నేను మీకు నచ్చానా?

మీరు తీసుకో దల్చుకున్న కట్నం మీద ఆధారపడి ఉంటుంది

అందరూ నోరు తెర్చుకుని విన్నారు

"నాకు కట్నం తీసుకోవాలని లేదు" అని నవ్వు ముఖంతో చూశాడు

"మీవి రెండు నాలుకలు" అన్నది జానక

జగదీష్‌కు ఏం మాట్లాడాలో తోచలేదు (ఇంకాఉంది)

# సూత్రధారి

## ఆదూరి వెంకట సీతారామమూర్తి

సాయంకాలం ఆరు గంటల సమయం. కళామందిరం ఆవరణంతా రంగురంగుల దీపాలతో కళకళలాడి పోతోంది. వచ్చే జనంతోనూ వాహనాలతోనూ ఆ ప్రాంగణమంతా సందడిగా వుంది.

ఆరోజు రాఘవయ్య నటించి, దర్శకత్వం వహిస్తున్న 'సూత్రధారి' నాటకం ప్రదర్శింపబడుతోంది!

రాఘవయ్య మహానటుడు- అంతకు మించిన గొప్ప దర్శకుడు - తన తొమ్మిదో ఏటనే ముఖానికి రంగేసుకుని స్టేజెక్కిన రాఘవయ్య విభిన్న పాత్రలను పోషించి మంచి నటుడన్న బిరుదును సంపాదించుకుని, దర్శకత్వం కూడ చేపట్టి అంతకు మించిన ఖ్యాతిని గడించుకున్నాడు. సుమారు నాలుగున్నర దశాబ్దాల పాటు నాటక రంగానికి ఎనలేని సేవ చేసి, రత్నాల వంటి నటుల నందర్నీ తయారు చేసిన ఘనత ఆయనకేదక్కింది-

వెయ్యి ప్రదర్శన లిచ్చిన శుభ సందర్భాన్ని పునస్కరించుకుని ఆయన అభిమానులూ, శిష్యులూ యీ రోజు ఆయనను సత్కరించాలనుకున్నారు- అదే హడావుడి ! ఆంధ్రదేశంలో ఎక్కడెక్కడో వృత్తి రీత్యా స్థిరపడి పోయిన ఆయన శిష్యగణమంతా తరలి వచ్చింది-

హాలంతా కిటకిట లాడిపోతోంది!

అందరి మనస్సుల్లోనూ ఎప్పుడెప్పుడా అన్న ఆతృతే!

సరిగ్గా అదే సమయంలో వెనుక గ్రీన్‌రూంలో వున్న నటీనటులందరి ముఖాల్లోనూ ఆందోళన - కొందరిలో ఆశ్చర్యం. ఏం జరిగింది? అసలేం జరిగింది? అందరిలోనూ అదేప్రశ్న!

ఆనాటి సభకూ, నాటకానికీ సూత్రధారి అయిన రాఘవయ్య యింకా రాలేదు! అది నమ్మశక్యం కాని విషయం!

పంక్చువాలిటీని తప్పని సరిగా పాటించే రాఘవయ్య ఈనాడిలా రాకపోడం అందరికీ ఆశ్చర్యాన్నే కలిగిస్తోంది- ఇలా ఎన్నడూ జరగలేదు- ఉదయమే నటీనటులందర్నీ కలిసి చెప్పవలసిన విషయాలన్నీ చెప్పారాయన -

నటీనటులంతా ఆయన చెప్పిన వేళకే వచ్చి తమ తమ పనులు ముగించుకుని ప్రదర్శనకు సిద్ధంగా వున్నారు. కానీ....

అరగంట క్రితం రాఘవయ్య యింటికి కబురు చేస్తే ఆయన అప్పటికే బయల్దేరినట్టు తెల్సింది- బయల్దేరినాయన మరి ఎక్కడకు వెళ్ళినట్టు? మధ్యలో ఏమైనట్టు?

కార్యకర్తల్లో కూడ ఆందోళన మొదలైంది- ఏది ఏమైనా నాటకం ప్రదర్శించి తీరాల్సిందే అనే నిర్ణయాని కొచ్చారంతా. రాఘవయ్య వెయ్యాల్సిన వేషానికి మరో వ్యక్తిని అప్పటి కప్పుడు సిద్ధం చేశారు. నాటకంలోని ఏ పాత్ర ధారి అయినా కారణాంతరాల వల్ల రాకపోతే మరొకరు ఆ పాత్రను పోషించడానికి సిద్ధపడాలి అనేవారు రాఘవయ్య. ఆ రకమైన తర్ఫీదు తన యూనిట్‌లోని నటీ నటుల కిచ్చారాయన.

ప్రస్తుత నాటకంలో మొదటి యిరవై నిముషాల్లోనూ రాఘవయ్య పాత్ర స్టేజి మీదికి రాదు- ఆ లోగా ఆయన వస్తే సరి. లేదూ నాటకం సజావుగానే సాగిపోతుంది- ఆమేరకు నిర్ణయం తీసుకున్నా రాఘవయ్య కోసం అంతా ఎదురు చూస్తూనే వున్నారు.

కర్టెన్ లాగే కనకారావు దృష్టంతా మెయిన్ ఎంట్రెన్స్ వేపే వుంది. రాఘవయ్య ఏ సమయంలోనైనా రావచ్చనే నమ్మకం అతనికుంది- అతని మనసులో ఒకనాటి అనుభవం తళుక్కున మెరిసింది-

ఓ మారు నాటక పోటీలకు ఒక నాటకాన్ని తీసుకు వెళ్ళేరు రాఘవయ్య - నాటకం సరిగ్గా ఆరున్నరకి ప్రారంభించాల్సి వుంది. కానీ ఆ టైంకి హాలు సగమే నిండింది- న్యాయ నిర్ణేతలు కూడ ఇంకా రాలేదు. అయినా సరిగ్గా ఆరున్నర గంటలకు తెర లేచింది- నాటకం మొదలయ్యింది - దాంతో హాలు బయట పిచ్చాపాటీ వేస్తున్న ప్రేక్షకులు పరుగున లోపలికి వచ్చారు - ఆ హడావుడికి ఎక్కడో కబుర్లు చెప్పుకుంటున్న న్యాయ నిర్ణేతలు కూడ లోపలికి వచ్చారు-

అప్పటికి కొంత నాటకం జరిగింది- జరుగుతున్న నాటకాన్ని అక్కడ ఆపేసి, తెరదించి, న్యాయ నిర్ణేతలు ఆలస్యంగా వచ్చిన కారణంగా వారి కోసం నాటకాన్ని తిరిగి ప్రారంభిస్తున్నట్టు ప్రకటించి ఆ వెంటనే ప్రారంభించాడు రాఘవయ్య.

హాలంతా చప్పట్లతో మార్మోగి పోయింది - న్యాయ నిర్ణేతలనుద్దేశించి ఎవరో 'షేమ్ షేమ్' అని అరిచారు కూడ.

అది న్యాయ నిర్ణేతల పాలిట చెంప దెబ్బే అయింది.

అనుకున్న సమయానికి అనుకున్నట్టు ప్రదర్శనలను ప్రారంభించక పోవడం కూడా నాటకాల పట్ల ప్రజలకు విముఖత ఏర్పడటానికి కారణం కావొచ్చు అనేవారు రాఘవయ్య. అటువంటి ఆయనే పంక్చువాలిటీని పాటించక పోవడం కనకారావుకి ఆశ్చర్యాన్ని కలుగ జేసింది-

ప్రదర్శన ప్రారంభించడానికి మరో పది నిముషాలే వ్యవధి వుంది- రాఘవయ్య కోసం వెళ్ళిన నలుగుర్లోనూ యిద్దరు తిరిగొచ్చారు తమ కెక్కడా ఆయన కన్పించలేదని.

కొందరిలో అప్పుడే నిరాశ ఏర్పడి పోయింది- నాటకంలో ఆయన పాత్రను వేయబోయే సలీమ్ మాత్రం మేకప్ ముగించుకుని పూర్తిగా సన్నద్ధుడయ్యాడు-

అతనిలోని ఆలోచనలు కూడ ఒక్క మారు గతంలోకి తొంగి చూశాయి-

ఓ మారు రాఘవయ్య దర్శకత్వంలోని ఒక నాటకంలో సలీమ్‌కి కూడ ఒక పాత్ర యివ్వడం జరిగింది - అది ఏదో ఒక సంస్థకోసం టిక్కెట్టుపై వేసే నాటకం - రిహార్సల్స్ అన్నీ సక్రమంగానే జరిగాయి- తీరా నాటకం ప్రదర్శించే రోజు మధ్యాహ్నం బాత్రూంలో జారి పడ్డాడు సలీమ్. కుడికాలు ఫ్రాక్చరైంది- ఆ సంగతి సకాలంలో రాఘవయ్యకు అందలేదు-

మరో మనిషి కూడ సమయానికి లేక పోవడంతో అప్పటి కప్పుడు నాటకాన్ని మార్పు చేసి, సలీమ్ వేసే పాత్రనే నాటకంలోంచి తప్పించి వేశాడు రాఘవయ్య - అటువంటి సమయస్ఫూర్తి, ధైర్యం అతని నుండి నేర్చుకోవలసిందే... ఏనటుడైనా!

రాఘవయ్య తన శిష్యులకు నటనతో పాటు చాల విషయాలు నేర్పేవాడు- ఆయన శిష్యుల్లో 'ఉత్తమ నటుడు' బహుమతులందు కున్న వారూ వున్నారు- సినీ నటులైన వారూ వున్నారు - రంగాలంకరణలో ప్రావీణ్యతను సంపాదించుకున్న వారూ వున్నారు - సింప్లిసిటీ, పంక్చువాలిటీ నుండి నటన, డైలాగ్ డెలివరీ, మాడ్యులేషన్ వరకూ

ఎందరో ఆయననే ఆదర్శంగాపెట్టుకున్నారు–

సరిగ్గా ఏడు గంటలకు తెర తొలిగి నాటకం అనుకున్న వేళకి మొదలయ్యింది – అయితే రాఘవయ్య రాలేదన్న సంగతి అప్పుడే కొంత మంది ప్రేక్షకులు పసిగట్టేశారు – తెల్సిన కొద్ది మందీ ఎంతో నిరుత్సాహ పడ్డారు–

అయితే 'సూత్రధారి' నాటకం మలచిన తీరు, అందులోని పాత్రల సహజ ప్రవృత్తి, కథలోనూ కథనంలోనూ నిండుగా తొణికిసలాడే జీవం, అక్కడి ప్రేక్షకుల్ని అతి స్వల్ప కాలంలోనే ఆకట్టుకుని సమ్మోహితుల్ని చేశాయి. అంచేత నాటకంలో లీనమై పోయిన వారికి రాఘవయ్య లేడన్న సంగతి గుర్తు రాకుండా పోయింది–

ఐతే, నాటకం మొదలైన కొంత సేపటికి హాల్లోకి వచ్చి ఓ మూలన కూర్చున్న రాఘవయ్యను ఎవరూ గుర్తించలేదు.

నాటకం చివరి అంకం ప్రదర్శింప బడుతూండగా కార్య కర్తలెవరో ఆయనను చూశారు

అంతే!

వారిలో హడావుడి మొదలైంది–

ఎవరెన్ని ప్రశ్నలు కుప్పించినా నాటకం పూర్తయ్యే వరకూ ఒక్క మాట కూడ మాట్లాడలేదు రాఘవయ్య– అందరికీ కళ్ళతోనే సమాధానం చెప్పేడు.

నాటకం పూర్తయిన మరుక్షణం సన్మాన కార్యక్రమం కోసం రాఘవయ్యని వేదికమీదికి ఆహ్వానించేరు–




' హాల్లో వున్న ప్రేక్షకులు రిధమిక్‌గా చప్పట్లు కొట్టడం మొదలు పెట్టారు – కొందరిలో ఆనందం – మరి కొందరిలో ఆశ్చర్యం?

ఏ భేషజాలూ లేకుండా అతి సాధారణంగా మైకు ముందు కొచ్చారు రాఘవయ్య. ఒక్కమారు హాలంతా కలయజూసి, 'ప్రేక్షక మహాశయులకూ, గౌరవ కార్య కర్తలకూ నా నమస్సుమాంజలులు" అని, ఒక్క క్షణం ఆగేడు–

హాలంతా నిశ్శబ్దమై పోయింది– అందరిదృష్టీ రాఘవయ్య మీదే వుంది–

"ఇంతమంది మిత్రుల్నీ, అభిమానుల్నీ, శ్రేయోభిలాషుల్నీ చూస్తుంటే నా కడుపు నిండిపోతోంది. నా మీద మీకున్న అపారమైన అభిమానం వల్లనైతేనేమి, ప్రేమ వల్లనైతే నేమి నాకీ సన్మాన కార్యక్రమాన్ని తలపెట్టేరు – అందుకు ఎంతో కృతజ్ఞుడిని– అయితే నేనీనాడు యీ సన్మానాన్ని స్వీకరించ లేకపోతున్నాను – అందుకు

మీరు నన్ను క్షమించాలి" అన్నాడు

"ఒప్పుకోం- మీరు సన్మానాన్ని స్వీకరించాల్సిందే!" హాల్లో వెనకెక్కడో అరుపులు విన్పించాయి-

అటు తిరిగి రెండు చేతులూ జోడించాడు రాఘవయ్య.

"నాకు తెల్సు - నా యీ నిర్ణయం నా అభిమానులకి నిరుత్సాహాన్ని కలిగిస్తుందని- కానీ నా కారణాలు నాకున్నాయి. వాటిల్లో కొన్నయినా మీ ముందుంచడానికి ప్రయత్నిస్తాను.

కళపట్ల, నాటక రంగంపట్ల నా కెంత గౌరవ ముందో నాకంటే నన్ను తెల్సినవారికే ఎక్కువ తెల్సు- నటుడికి నిజాయితీ, చిత్తశుద్ధి, దీక్ష అవసరమని నమ్మే వాడిలో నే నొకడిని- వాటిని మించి పంక్చువాలిటీ! నా యూనిట్‌లో పని చేసే వారికి నేను నిరంతరం బోధించే నీతి ప్రబోధాలే అవి-

నాటక మన్నది ఒక జీవకళ -

మనకు తెలిసిన మనుషులే మనముందు మనసమస్యల్లోనూ, ఆలోచనా పరుధుల్లోనూ మనలోని విభిన్న మనస్తత్వాలకూ వ్యక్తిత్వాలకూ ప్రతీకలుగా నిలుస్తూ, నటిస్తూ మన జీవితాల్నే ప్రతిబింబింప జేసే కళయిది-

జీవితాల్ని చూపించడమే కాక జీవితం సక్రమ మార్గంలోకి ఎలా వెళ్ళాలన్నదీ నాటకం బోధించగలగాలి- రచయిత తన మేధాశక్తితో చూపే పరిష్కార మార్గాల్నీ, మార్గదర్శిక సూత్రాల్నీ నటుడు ఏ ఆలోచనలూ ఏ విద్యా లేని అతిసామాన్యుడికి సైతం అందివ్వగలగాలి- అప్పుడే యీ కళకు సార్ధకత్వం.

నాటకంకంటె జీవితాన్ని విస్తృత పరిధిలో చూపించ గలిగే చలన చిత్రాలొచ్చాయి. ఇంతకంటే ఎక్కువ ప్రాచుర్యాన్నీ ప్రజాదరణనీ గడించాయి. అయితే నే చెప్పిన ప్రయోజనం, సార్ధకతల దృష్ట్యా అవి నాటకాల కంటే వెనుకబడి వుంటున్నాయని నా అభిప్రాయం.కొద్ది మంది ప్రముఖ దర్శకులు మాత్రం యీ సినీమాలను ఉత్తమ కళాఖండాలుగా తీర్చి దిద్దడానికి ప్రయత్నిస్తున్నారు- అటువంటివి బహు తక్కువ. ఎక్కువ భాగం పలాయన వాదం, పై పై మెరుగులూ గల కమర్షియల్‌గా డబ్బు చేసుకునే సినీమాలే- అలా అని పేక్షకులలో నాటకాల పట్ల అభిరుచి వున్న వారూ లేకపోలేదు- అటువంటి వారి కోసమైనా కొన్ని నాటక సమాఖ్యలు, సమాజాలూ వుండక తప్పదు-

పోతే... ఈ రోజు నా వెయ్యో నాటక ప్రదర్శనను చూడాలనుకున్న వారికి చాల నిరుత్సాహాన్ని కలిగించాను. నేను ఆలస్యంగా రావటానికి గల కారణా లేమైనా ఒక నటుడిగా నేనలా చేయడం పొరబాటుగానే భావిస్తున్నాను-

పంక్చువాలిటీ విషయంలో ఎవరితో నైనా నిష్కర్షగా ప్రవర్తించే నేను నావట్ల కూడ ఖచ్చితంగానే వ్యవహరించ దల్చుకున్నాను- ఈ రోజు నుండీ నటుడిగా, దర్శకుడిగా నాటకరంగం నుండి విరమించ దల్చు కున్నాను-"

అంతవరకూ చెప్పి ఆగేడు రాఘవయ్య-

సభలో కలకలం మొదలయ్యింది-

"మాకోసమైనా మీరు మీ నిర్ణయాన్ని ఉపసంహరించు కోక తప్పదు" అన్నారో అభిమాని ముందు సీట్లోంచిలేచి-

సభలో పెద్ద పెట్టున గందరగోళం ఏర్పడింది-

వారిని వారిస్తూ రాఘవయ్య యిలా అన్నాడు-

"కేవలం నటుడిగా దర్శకుడిగానే నాటకరంగం నుండి విరమిస్తున్నాననే అన్నాను గాని నాటక రంగానికి దూరమౌతా నని నేననలేదు- ఆ మాట నాలో జీవమున్నంత వరకూ నా నోట రాదు- అంచేత ఆంధ్రదేశానికీ నాటక రంగానికీ మంచి నటుల నందించే ప్రయత్నంలో నా శేష జీవితాన్ని గడప దల్చుకున్నాను"




ఆ మాటలకు సభలో హర్షధ్వానాలు చెలరేగేయి.

మరుక్షణంలో నాలుగైదు కాగితం ముక్కల్ని ఎవరెవరో స్టేజి మీదికి తెచ్చి అతనికందించారు- వాటిపై రాసి పంపిన విషయాన్ని చదివి, ఒక్కక్షణం ఆలోచించి గొంతు సర్దుకున్నాడు రాఘవయ్య.

"నాయీ నిర్ణయం వెనుక నుండే అసలైన కారణాన్ని చెప్పమని నా అభిమానులు కొందరు కోరుతున్నారు- వారికోసం కాకపోయినా అసలు కారణాన్ని ఒక బాధ్యత గల నటుడిగా మీకు తెలియ పరచాలనే అనుకుంటున్నాను- నా మీద అభిమానమున్న ప్రతి ఒక్కరూ నేను చెప్పేది చివరి వరకూ వినాలని కోరుకుంటున్నాను." అంటూ గొంతుస్థాయి తగ్గించి చెప్పడం మొదలు పెట్టేడు రాఘవయ్య.

హాలంతా నిశ్శబ్దంగానే వుంది-

"నా జీవితంలో ఈ రోజుని నేనెన్నటికీ మరచిపోలేను-ఎప్పుడో... యే అభిప్రాయాలూ ఆశయాలూ లేని తొమ్మిదో యేట ముఖానికి రంగు పూసుకొని స్టేజి ఎక్కినప్పటికీ, ఆ తర్వాత పెరిగిన పట్టుదల వల్లనైతేనేమి; గర్వం, కీర్తి కండూతి వల్లనైతేనేమి నటుడిగా జీవితంలో స్థిరపడ్డాను- అయితే నా జీవితానికో మలుపునిచ్చి, నా నట జీవితానికి కలికితురాయి అయిందీ 'సూత్రధారి' నాటకం- ఏ వ్యక్తి కారణంగా నేను నటుడిగా ముందడుగు వేశానో; ఏ నటుడి పతనాన్ని చూసి మనసు చలించి ఆయన జీవిత యితివృత్తాన్ని ఆధారంగా జేసుకుని యీ 'సూత్రధారి' అన్న నాటకాన్ని ఓ గొప్ప రచయిత చేత రాయించుకుని తెలుగుదేశంలోకి ఓ మంచి నాటకాన్ని తెచ్చానో.. ఆ వ్యక్తి... సరిగ్గా పదేళ్ళ తర్వాత అనుకోని విధంగా నాకీ రోజు దర్శన మిచ్చాడు-"

ఒక్క క్షణం ఆగి, ప్రేక్షకుల వంక చూశాడు రాఘవయ్య. అంతా ఆయన వంకే చూస్తూ ఆయన చెప్పే విషయంలో ఆతృతని కనబరుస్తున్నారు.

"మీలో ఎందరికి గుర్తుందో .. సరిగ్గా పాతికేళ్ళ క్రితం గౌరీనాధం అనే ఆయన నాటకాల్లో హీరో వేషాలు వేసేవాడు- అందంగా ఆరడుగుల పొడవుగా వుండి ఏ పాత్రలోనైనా రాణించేవాడు. పాత్రకి సహజత్వాన్ని తెచ్చేవాడు- గౌరీనాధం నాకు మిత్రుడే కాదు నాటకరంగంలో గురువు కూడ. ఎంతటి వారికైనా ఏదో ఒక బలహీనత వుండి తీరుతుందేమో . అటు పౌరాణికాల్లోనూ, యిటు సాంఘిక నాటకాల్లోనూ అవలీలగా నటించగల గౌరీనాధం సినిమా పిచ్చిలో పడిపోయాడు - ఎవరు ఏ రకంగా ఆశ చూపారో .. చేస్తున్న ఉద్యోగానికి తిలోదకాలిచ్చేసి, మద్రాసెళ్ళిపోయాడు- వెళ్ళే ముందు నన్ను కలిస్తే అన్ని విషయాలూ వివరంగానే మాట్లాడాను- అతన్ని ఆపడానికే ప్రయత్నించాను- కానీ అనాడతను అన్న మాటలు

నాకిప్పటికీ గుర్తున్నాయి-

"గొర్రె తోకలాంటి యీ ఉద్యోగాన్నీ, ఎండమావి లాంటి యీ నాటకరంగాన్నీ నమ్ముకుని ఎన్నాళ్ళిలా వుండిపోమంటావ్ రాఘవా... అదృష్టం కలిసొచ్చిందా అక్కడ నిలదొక్కుకుని అటు డబ్బులూ యిటు కీర్తి ప్రతిష్టలూ దండిగా ఆర్జించగలను- మీ వంటివారికి సహాయపడి మార్గం చూపించగలను." అన్నాడు-

భవిష్యత్తులోకి వేసుకున్న మార్గాలు మనమనుకున్నంత సుగమంగా వుండవేమో!

వెళ్ళిన కొద్ది రోజుల్లోనే అక్కడి వారు అతని దగ్గరున్న సొమ్ము కాజేసి అరచేతిలో వైకుంఠాన్ని చూపించేరు. చెంపమీద మచ్చ వుండటం వల్ల హీరోకి పనికిరావన్నారట- సైడు హీరో యిస్తామన్నారట- స్క్రీన్ టెస్టులు చేశారట-

ఆ వివరాలు రాస్తూ ఫోటోలు నాకు పంపేడు గౌరీనాథం. నిజంగా సంతోషించాను- ఆ సంగతే రాశాను.

అంతే! తర్వాత ఉత్తరాలు లేవు. నేను రాసిన ఉత్తరాలకి జవాబులు లేవు. విడుదలైన వాటిల్లో అతను నటించిన సినిమాలు లేవు. వైకుంఠపాళీ లాంటి సినీ ప్రపంచంలో ఏ పామో గౌరీనాథాన్ని మింగేసి వుంటుందని వూహించాను.

ఆ తర్వాత నాలుగేళ్ళకి కాబోలు మద్రాసులో మేమొక నాటకాన్ని ప్రదర్శించాల్సి వచ్చింది- నాటకమయ్యాక గ్రీన్ రూంలో కొచ్చి నన్ను ప్రత్యేకంగా అభినందించిన వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయాను- నోట మాట రాలేదు. గుండెల్లోంచి దుఃఖం పొంగుకొచ్చింది.

అతను గౌరీనాథం! మాసిన బట్టల్తో; పెరిగిన గడ్డంతో, పీక్కుపోయిన ముఖంతో పోల్చుకో లేనంతగా వున్నాడు. సినీమా ప్రపంచం తనను మోసం చేసిందని వాపోయాడు. తిరిగి రావటానికి ముఖం చెల్లక అక్కడే చిన్న పిల్లలకి ట్యూషన్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడట-

ఆ క్షణంలో అతను నాకంటికి మబ్బులు కమ్మేసిన సూర్యుడిలా కన్పించాడు ఆ మాటే అతనితో అన్నాను

"నీకేం తక్కువ గౌరీనాథం- ఇప్పటికైనా మించిపోయిందేం లేదు. మా యూని ట్లో నీకు తగిన స్థానం కల్పిస్తాను. రా. నిజమయిన నటుడిగా నీ ప్రజ్ఞను చాటు!" అన్నాను.

ఆ మాటకు గౌరీనాథం నవ్విన నవ్వునాకిప్పటికీ గుర్తుంది ఆ నవ్వులో విషాదమే వుంది.

'ఇంకెక్కడి నటన రాఘవా- నాలోని నటుడు శాశ్వతంగా చచ్చిపోయాడు' అన్నాడు.

ఆ మర్నాడంతా అతను నా ఆతిథ్యంలోనే వున్నాడు. అంతే! ఆ తర్వాత మళ్ళీనేను గౌరీనాథాన్ని చూడలేదు.



"సంక్రాంతి రథం"

శ్రీమతి ఆర్. సరళాదేవి, అంబాలా కంటోన్మెంట్

నాటికి మళ్ళీ నేడు-

ఇక్కడకు రావడానికి ఆటో స్టాండు వైపు వెళ్తున్నాను-

అక్కడ జనం గుమిగూడి వున్నారు. నలుగు రైదుగురు డబ్బులు దండుతున్నారు-

"అనాథ ప్రేత బాబూ. కలిగింది వెయ్యండి" అంటున్నాడొకడు.

"పాపం... పిచ్చివాడండీ- నవరసాల్నీ పోషిస్తూ అందరికీ వినోదాన్నిచ్చేవాడు. పిచ్చి కళాకారుడి శవదహనానికి తోచిన సాయం చేయండి బాబూ" అంటున్నాడింకొకడు - దారిన పోయే ఒక ముసలాయన ఆశ్చర్యంగా ఆగి,

"ఎవరూ? ఆ సినిమా పిచ్చోడా? పాపం... ఆయువు తీరిపోయింది. ఘడియకో వేషం వేసేవాడు. రాముణ్ణనేవాడు, రావణాసురుడిననే వాడు- హీరోననేవాడు- చెంపమీది మచ్చుని చూపిస్తూ విలన్ని.. కాసుకో అనేవాడు. పాపం .. ఎక్కడ పుట్టి ఎక్కడ పెరిగాడో యిక్కడిలా యీ రోజు దిక్కుమాలిన..."

ఇక ఆపై మాటలు వినలేక అటువైపు నడిచి చూశాను. ఆ క్షణంలో నా శరీరమెందుకో వణికింది. నా చూపులు జనాన్ని తోసుకుంటూ శవం మీదికి వెళ్ళాయి. నా అనుమానం నిజమైంది గుర్తు పట్టలేని విధంగా వున్న ఆ జీవంలేని శరీరం గౌరీనాథానిది!

అతని గుండెల మీద ఓ నీలం రంగు సిల్కు కోటు వుంది. ఆ కోటుకి రెండు రంగు వెలిసిన మెడల్సు తగిలించి ఉన్నాయి. నా మనసు పిండినట్లయింది- అందులో ఒక మెడల్ చరిత్ర నాకు తెల్సు. గౌరీనాథం నటనకు ఆనాటి జిల్లా కలెక్టర్ అతని కోటుకు స్వయంగా తగిల్చినది-"

హాల్లోని ప్రేక్షకులంతా కాలాన్ని కూడ లెక్కజేయకుండా మంత్రముగ్ధుల్లా వింటున్నారు-

రాఘవయ్య గొంతు బొంగురుపోయింది.

"జీవితం కోసం నేను నటనను నేర్చుకున్నాను. అంతమాత్రాన జీవితంలో కూడ నటించేంతటి అధముణ్ణి కాను-

అభిమానపూర్వకంగా జరిగే యీ సన్మానం నా జీవితానికి గొప్పే- కానీ ... కొద్ది గంటల క్రితం నా మనసులో రేగిన ఘర్షణ నన్నొక్క క్షణం ఆలోచించేలా చేసింది- ఆ క్షణంలో నాకు యీ సన్మానం కంటే . నేను గౌరవప్రదంగా భావించుకునే నాటక కళ కంటే ఒక దిక్కులేని ఊగావద్ద నటుడే గొప్పగా కనిపించాడు- మానవత్వమున్న మనిషిగా, సాటి నటుడుగా నా కర్తవ్యం నన్ను ముందుకు నడిపించింది.

ఏ ప్రభుత్వమూ, ఏ పరిశ్రమా, ఏ నాటక సమాజము ఏ నటుడూ చేయని పనిని మానవత్వమున్న కొందరు మనుషులు చేస్తుంటే స్నేహితుడినైన నేను తప్పించుకుని రాలేకపోయాను.

ఒకప్పుడు ఆంధ్రదేశం మెచ్చుకున్న నటుడు, ఒక గొప్ప నాటకం ఆవిర్భవించడానికి కారణభూతమైన వాడూ అయిన గౌరీనాథం అరగంట క్రితం పిడికెడు బూడిదగా మారిపోయాడు.

ఏ నటుడికైతే మాత్రం ఏది శాశ్వతం?

బిరుదులూ సన్మానాలూ ఎన్నాళ్ళు నిలుస్తాయి?

జీవితమనే నాటకరంగం మీద మన ఇచ్ఛలేకుండా కేవలం సూత్రధారి ఆజ్ఞానుసారం నటించే మనమంతా ఎప్పటికైనా కాలమనే అవనిక వెనుక మరుగవక తప్పదు.

కళాకారులూ, ధనవంతులూ, అధికారులూ, సామాన్యులూ- ఈ తేడాలన్నీ అంతవరకే!

ఆ నిజాన్ని తెల్సుకున్ననాడు మానవత్వంకంటే గొప్పదైనది మరొకటి కన్పించదు."

రాఘవయ్య గొంతు ఆర్ద్రమైంది.

అతని కళ్ళ వెంట ధారాపాతంగా నీళ్ళు!

కార్యకర్తలు మంత్రముగ్ధుల్లా నిల్చుండి పోయారు.

ప్రేక్షకుల నయనాల్లోనూ తీలగా నీళ్ళు!

ఒక్క క్షణం మౌనంగా తలొంచి నిల్చుని ఆ తర్వాత వేదిక దిగి, కుర్చీలో కూలబడిపోయాడు రాఘవయ్య! □

ఎడ్ల లాగుడు పోటీ విజేత

# పూర్ణరామచంద్రరావు (బుజ్జి)

ఎడ్ల పరుగు, లాగుడు పోటీలకు ప్రసిద్ధి పొందిన మొవ్వ గ్రామంలో రైతు కుటుంబంలో పుట్టిన బుజ్జిగారు బాల్యం నుండి పశువులంటే ఎక్కువ మక్కువతో పెరిగారు. 1970 నుండి ఎడ్ల లాగుడు పోటీల్లో ప్రవేశించి పన్నెండు సంవత్సరాలు పాల్గొని, అనేక మయిన ప్రథమ బహుమతులు పొంది, తానూ పశు పోషణలో మంచి రైతుగా నిరూపించుకున్నారు.

కృష్ణా జిల్లా, మొవ్వ గ్రామం చౌదరి, మండవ సుబ్బయ్య – సీతమ్మ గార్లకు 1945లో జన్మించేరు బుజ్జిగారు. ఆయన తొలిసారిగా ఎడ్ల లాగుడు పోటిలో అడుగు పెట్టినది 1970లో. గోవాడలో జరిగిన పోటీలో రెండెడ్ల ఇసుక లాగుడు 150 అడుగులు గల కోర్సులో సుమారు ఆరు రౌండ్లు



లాగుడు పోటీ ఎడ్లతో శ్రీ మండవ పూర్ణరామచంద్రరావు (బుజ్జి)

లాగించి మొదటి బహుమతి పొందారు. తెనాలిలో జరిగిన ఒంటెద్దు ఇసుకలాగుడులో 175 అడుగులు కోర్సులో సుమారు నాలుగు బార్లు లాగించి ఫస్టు ప్రైజు పొందారు. అదేకాపులో జోడెడ్ల లాగుడులో 5 బార్లు లాగించి ఫస్టుప్రైజు గెలుచుకున్నారు. రెండెడ్ల అందాల పోటీలో ప్రథమ బహుమతిని అందుకున్నారు.

1971 లో మంత్రి పాలెంలో జరిగిన పోటీలో ఒంటెద్దు ఇసుక లాగుడులో 170 అడుగులు కోర్సులో 5 నిముషాలకు నాలుగున్నర రౌండ్లు లాగి సెకండు ప్రైజు పుచ్చుకున్నారు. జత ఎడ్ల లాగుడులోనూ, రెండెడ్ల పూటీ లాగుడు లోనూ ద్వితీయ బహుమతులునూ. 14 గనపటడుగుల బండ 1200 అడుగులు దూరం లాగించడంలో ప్రథమ బహుమతి పొందారు.

1972 గండి గుంట పోటీలో జోడెడ్ల ఇసుక లాగుడు లో ఫస్టు, బండలాగుడులో 1600 అడుగులు దూరంలాగి ప్రథమ బహుమతి, మరియూ షీల్డు పొందారు. 1973 లో మంత్రిపాలెంలో జరిగిన పోటీలో జోడెడ్ల ఇసుక లాగుడులో ఫస్టు ప్రైజు, మరియూ షీల్డు, అదే కాపులో ఒంటెద్దు లాగుడులో ఫస్టు ప్రైజు, షీల్డు, స్పెషల్ జాక్ పాట్‌లో 170 అడుగులు కోర్సులో 240 అడుగులు లాగించి ఫస్టు ప్రైజు తులం గోల్డు మెడల్ పొందారు. మహానంది బండలాగుడు పోటీలో 323 గజాలు దూరం లాగి రెండవ బహుమతి పొందింది.

గుంటూరు పోటీలో ఒంటెద్దు ఇసుక లాగుడులో ప్రథమ బహుమతి, మరియూ షీల్డు, రెండెడ్ల కావు లాగుడులో ఫస్టు ప్రైజు, స్పెషల్ బండ జాక్ పాట్‌లో ప్రథమ బహుమతి తులం గోల్డు మెడల్ పొందాయి.

గనపవరం పోటీలో నాలుగు రాతి చక్రముల బండి ఇరుసుతో సహా టేకు కర్రతో తయారు చేసినది. దానిని రాతి చక్రముల బండి' అంటారు. ఆ బండిలో 40 క్వింటాల్సు గల బరువును వేసి, దుక్కు మడిలో 10 నిముషాల కాలంలో, సుమారు 4 వందల అడుగులు లాగించి తులం గోల్డు మెడల్సు పొందారు. సూదివారి పాలెంలో నాలుగు రాతి చక్రాల బండి లాగుడులో ఫస్టు ప్రైజు బంగారు పతకాన్ని పొందారు. వేలూరులో జరిగిన నాలుగు రాతి చక్రాల బండిలాగుడులో తులం గోల్డు మెడలు పొందారు.

గోల్డు మెడల్సు పొందిన కర్రి బట్ట ఎద్దుని 'మొవ్వకోడి' అని పిలుస్తుంటారు.

1974లో మహనంది బండలాగుడులో ద్వితీయ బహుమతి పొందాయి. విజయవాడ ఒంటెద్దు బండలాగుడు రెండెడ్ల పూటీ లాగుడులోనూ కావు లాగుడులోనూ మూడు ప్రథమ బహుమతులను పొందారు. తెనాలిలో ఒంటెద్దు ఇసుక లాగుడు లోను, ఒంటెద్దు, రెండెడ్ల బండ లాగుడులోనూ ఫస్టు ప్రైజులూ, షీల్డులూ పొందారు.

వేలూరు, ఇంకొల్లు, అడుసుమిల్లి, గార్లపాడు గ్రామాలలో జరిగిన రాతి చక్రముల బండి లాగుడు పోటీల్లో గోల్డు మెడల్సు, షీల్డులూ, ప్రథమ బహుమతులు పొందింది. ఆ పోటీలో బుజ్జిగారిని తిరుగులేని విజేతని చేశాయి ఎడ్ల జత

1975లో గుంటూరు, పెదపూడిలోనూ జరిగిన ఒంటెద్దు, రెండెడ్ల బండి లాగుడులో ఫస్టు, సెకెండు ప్రైజులు పొందాయి. 1977న కోసూరులో జరిగిన పోటీలో ఒంటెద్దు పూటీ లాగుడులో ఫస్టు ప్రైజు, షీల్డు గెలుపొందారు. 1978న గుళ్లపల్లిలో జరిగిన ఒంటెద్దుతోనూ, జోడెడ్లతోనూ, బండ, పూటీ లాగుళ్లలో ఫస్టు, ఇసుక జాక్‌పాట్‌లో ఫస్టు ప్రైజు, మరియు గోల్డు మెడలు పొందారు పొన్నూరులో జరిగిన ఇసుక, బండ, పూటీ లాగుడులోనూ ఫస్టు ప్రైజులు, మరియు బండి, బండ జాక్‌పాట్ పోటీల్లోనూ ప్రథమ బహుమతులు, రెండు గోల్డు మెడల్సు, టొటల్ షీల్డు పొందారు అడుసుమిల్లి పోటీలో నాలుగు రాతి చక్రాల బండి, బండ లాగుడులోనూ ప్రథమ బహుమతులు, బండీ - బండ జాక్‌పాట్‌లోనూ రెండు గోల్డు మెడల్సు పొందారు.

1979న నాగులపాలెం నాలుగు రాతి చక్రము బండి లాగుడు పోటీలో 1, 2, 3, 4 ఎడ్ల ప్రైజుల్లో నాలుగు ప్రథమ బహుమతులు పొందింది 1980లో కొల్లూరు పోటీలో ఒంటెద్దు, జత ఎద్దు బండ, మరియు బండ జాక్‌పాట్‌లలోను ప్రథమ, ద్వితీయ బహుమతులు గెలుపొందినవి.1981న కొలవెన్నులో జరిగిన ఒంటెద్దు, రెండెడ్ల పూటీ, బండ లాగుడు లోనూ ఫస్టు ప్రైజులు పొంది, బండ జాక్‌పాట్‌లో షీల్డు కూడా పొందాయి.

పొన్నూరు పోటీలో జోడెడ్ల బండ లాగుడు, పూటీ లాగుడు, జాక్‌పాట్ పోటీలోనూ ప్రథమశ్రేణిలో వచ్చాయి. 1982లో పెదపూడి పోటీలో బండ, బండ జాక్‌పాట్ పోటీలలో ప్రథమ, ద్వితీయ, బహుమతులు లభించేయి. తెనాలిలో జరిగిన బండి జాక్‌పాట్, బండ, బండ జాక్‌పాట్ పోటీలలో ప్రథమ బహుమతులు, షీల్డులు, అన్ని ప్రైజుల్లోనూ స్పెషల్ జాక్‌పాట్ పోటీలోనూ గోల్డు మెడల్సు పొందిన బుజ్జిగారు తమ గ్రామానికి ఎడ్ల లాగుడు లోకంలో ఒక ప్రత్యేకతను ఏర్పరుచుకున్నారు.

- బొజ్జా సత్యనారాయణ

బ్రూక్ బాండ్

# 3 రోజెస్ తృప్తి




## క్రొత్త మేలైన 3 రోజెస్ టీ
## అధిక తృప్తి...అదనపు ఖర్చు లేకుండానే!




క్రొత్త 3 రోజెస్ టీ
ఉత్తమ రంగు, ఎక్కువ చిక్కన, చక్కని రుచి
వీటి అపురూప మధుర సంగమం
మీకిస్తుంది 3 రోజెస్ తృప్తి.

**గొప్ప టీ... అత్యధిక తృప్తి**

# పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## 'చిన్నారి' చదువులు

"నోరు మూస్తావా, లేదా? చంపేస్తాను వెధవా! రోజూ నీతో నాకు విసుగు పుడుతోంది" పక్కింటి సుజాత వాళ్ళ ఐదేళ్ళ బాబు కిరణ్‌ను కొడుతూ అంటున్నది.

సుజాతలాంటి తల్లులు చాలామందే వుంటారు. పిల్లవాడు స్కూలుకు వెళ్ళనని మొరాయిస్తుంటే, దానికి కారణమేమిటి, ఎందుకు ఇలా ప్రవర్తిస్తున్నాడు అని ఆలోచించి ఆ చిన్నారి మనస్సులో స్కూలు పట్ల కలిగిన అయిష్టతను తొలగించడానికి ప్రయత్నించకపోగా, వాళ్ళని తిట్టి, కొట్టి, బలవంతంగా స్కూలుకు పంపి వాళ్ళకు చదువంటేనే భయం కలిగేలా చేసారు సుజాతలాంటి తల్లిదండ్రులు నిజానికి పిల్లలు స్కూలు అన్నా, స్కూలు వాతావరణమన్నా క్రొత్తల్లో కొంచెం భయపడినా, తరువాత ఇష్టపడతారు. అలాంటి పిల్లలు స్కూలుకు వెళ్ళనని మొండి కేస్తే అందుకుగల కారణాలను కనుక్కొనడానికి ప్రయత్నించాలి స్కూలులో వారికి ఎదురయ్యే ఇబ్బందులేమిటో, ఎందుకు స్కూలు అంటే భయపడుతున్నాడో, నెమ్మదిగా అడిగి తెలుసుకోవాలి. వీలయినంత వరకు ఆ ఇబ్బందులను తొలగించాలి. పిల్లల మనస్సుల్లోంచి అనవసరపు భయాలను తుడిచేసే ప్రయత్నం చేయాలి. అంతే కాని పిల్లలను చీటికీ మాటికీ కొడుతూ వాళ్ళకు చదువు అంటేనే భయం పుట్టేలా చేయకూడదు. తాము చెప్పిన పని వెంటనే చేయలేదనో, చెప్పిన పాఠం వెంటనే చదువ లేకపోయాడనో, లెక్క తప్పు చేశాడనో పిల్లలను చావబాదుతుంటారు కొందరు తల్లిదండ్రులు. ఉన్నట్టుండి ఎప్పుడో ఒక రోజు తీరిక చూసుకుని పిల్లల చదువుల గురించి పట్టించుకుంటారు వీళ్ళు. ఇక ఆ రోజు వాళ్ళ పిల్లలు చదువులో ఒకేసారి వాళ్ళ స్థాయికి రాలేదన్న కోపంతో, అత్యాశతో వాళ్ళ వీపులు సాపు చేస్తుంటారు వాళ్ళ వయసెంత? వాళ్ళ మానసిక స్థాయి ఏమిటి? అని ఆలోచించరు. వాళ్ళ వయసుకి తగిన జ్ఞానం వాళ్ళకి లేకపోతే రోజూ శ్రద్ధగా వాళ్ళని చదివించి, విజ్ఞానవంతులుగా తీర్చి దిద్దాలి కాని ఏదో ఒక రోజు ఉన్నట్టుండి వాళ్ళని చావబాదితే ఫలితమేముంటుంది? చదువు మీద, తల్లిదండ్రుల మీద ద్వేషంతో, భయంతో ఇంకాస్త మందకొడిగా తయారవడం తప్ప!




అందుకే ప్రతి తల్లి, తండ్రి తమ పిల్లల చదువుల పట్ల, ప్రవర్తన పట్ల జాగరూకులై, వాళ్ళను అనునిత్యం గమనిస్తూ, వాళ్ళకెదురయ్యే ఇబ్బందులను గమనించి, వాటిని తొలగిస్తూ, వాళ్ళలో విజ్ఞాన పిపాసను పెంచాలి. సక్రమమైన పౌరులుగా తీర్చి దిద్దడంలో తమ కర్తవ్యాన్ని విస్మరించక, బాధ్యతాయుతులై ప్రవర్తించాలి.

అప్పుడు మన చిన్నారులు, మన కంటి వెలుగులు, మన ఆశలకు, ఆశయాలకు ప్రతీకలుగా, అత్యుత్తమ పౌరులుగా, గర్వించదగిన బిడ్డలుగా తయారవుతారు. వారిపై పెంచుకున్న కోరికలను, కన్న కలలను నిజం చేసి చూపుతారు.

-ఐ. శారద, ఇలపావులూరు

★ ★ ★

## చిన్నారి బాలల దుస్థితి మారాలంటే?

బడికి వెళ్ళి చదువుకో వలసిన వయసులో ఆటపాటలతో కేరింతలు కొడుతూ, జీవితంలో మరుపురాని బాల్యాన్ని ఆనందకరంగా గడప వలసింది పోయి, తమ చిన్న కడుపు నింపుకోవడం కోసం బజార్నపడి ఎన్నో పనులు చేసే చిన్నారులు ప్రతినిత్యం మనకు తారసపడుతూనే ఉంటారు. పసితనపు ఛాయలు పూర్తిగా వీడని ఆ మొహంలో ఎంతో దీనత్వం. ఆశగా చూసే ఆ కళ్ళ వెనుక అంతులేని దుఃఖం. నిజంగా మనసున్న వారెవరికైనా హృదయ విదారకంగా ఉంటుంది.

ఈ బాలల్లో కొంతమంది కష్టపడి పని చేసి వారి పొట్ట నింపుకొంటే మరి కొంత మంది యాచించి, ఇంకొంత మంది నేరాలు చేస్తూ బ్రతుకు ఈడుస్తున్నారు. బాల నేరాలు సాధారణంగా ఉద్దేశ్య పూర్వకంగా చేసేవి కావు. పరిస్థితుల ప్రభావం వల్ల, చెడు పెంపకం వల్ల సంభవిస్తూ ఉంటాయి. పెద్దవారి అదుపు అంతగా లేక పోవడం వలన, చెడు సావాసాల వలన, చెడు సామాజిక పరిస్థితుల వలన నేడు బాల నేరస్థుల సంఖ్య మితిమీరుతున్నది బాల నేరస్థులను శిక్షించుటకు బదులు మంచి పరిసరాలలో ఉంచే ఆవశ్యకత ఎంతైనా ఉందని, అతడ్ని శిక్షించ కూడదని 1920వ సంవత్సరంలో ఇండియన్ జైల్ రిఫామ్ కమిటీ వ్యక్తం చేసిన అభిప్రాయం ప్రకారం బాలలకు




సంబంధించిన పత్యేక చట్టాలు రూపొందించడం జరిగింది. మన దేశంలో బాల నేరస్థులను ఆదరించుటకు బోర్‌స్టల్ సంస్థలు, సర్టిఫయిడ్ పాఠశాలలు నెలకొల్ప బడ్డాయి

నేటి బాలలే రేపటి పౌరులు. భావి భారత పౌరుల్ని తీర్చి దిద్ద వలసిన బాధ్యత ప్రతి ఒక్కరికీ ఉంది. పిల్లలు చెడు త్రోవ పట్టకుండా చూడాల్సిన అవసరం పెద్దలకుంది. వీధుల్లో అనాథలుగాను, యాచకులు గాను తిరుగుతున్న పిల్లల్ని మానవతా దృక్పథంతో వారికో దారి చూపించాలి. వారిని అనాథ శరణాలయాలలో, బాలలకోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడిన గృహాలలో అప్పగించాలి, తమకు తోచినట్లు పేదబాలలకు విద్యావకాశాలు కలిగించాలి అనాథ శరణాలయాలు విరివిగా స్థాపించ బడేటట్లు కృషి చేయాలి ప్రతి ఒక్కరు తమ పరిధి మేరకు కృషి చేసినప్పుడు బాలలకీ దుస్థితి పట్టదు.

-ఎమ్మెస్సెల్ జోగేశ్వరి, వీరవల్లి □

---

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు : ...........................

పూర్తి చిరునామా : ...........................

...........................

...........................

పిన్ కోడ్

# వ్యక్తిగతం

## ఆకాంక్షకు అంతిమ విజయం

26 సంవత్సరాల క్రితం సోవియెట్ యూనియన్ నుంచి పారిపోయి పారిస్‌లో ఆశ్రయం తీసుకుని



జీవిస్తున్న బ్యాలె నర్తకుడు రుడాల్ఫ్ నురెయెఫ్ తిరిగి సోవియెట్ యూనియన్ సందర్శించడానికి అనుమతి దొరికింది. మాస్కోకు తూర్పున 715 మైళ్ళ దూరంలోని ఉఫా నగరంలో రోగగ్రస్తురాలైన తన తల్లితో ఆయన రెండు రోజులు గడిపాడు. "మనిషి ఆకాంక్షకు అంతిమ విజయం లభిస్తుంది" అని తన మాతృభూమి సందర్శనను అభివర్ణించిన నురెయెఫ్ తన ప్రజల ముందు తన బృందంతో సహా బాలె ప్రదర్శన ఇవ్వాలని ఆశిస్తున్నాడు. జనవరిలో మళ్ళీ మాస్కో వెళ్ళి తన పారిస్ ఒపేరా బాలె బృందానికి అవకాశానికి ప్రయత్నాలు చేస్తానని ఆయనన్నాడు...

## "జగదాచార్య" చంద్రస్వామి!



ఎందరో రాజకీయ నాయకులకు, ఆయుధ వ్యాపారులకు తాంత్రిక గురువుగా ప్రఖ్యాతుడైన చంద్రస్వామి వివాదస్పదం కాని పని ఏదీచెయ్యనని శపథం పూనినట్టున్నాడు. ఈ మధ్యనే ఆయన జరుపుకున్న 39వ పుట్టిన రోజు అందుకు చిహ్నంగా ఉంది. మూడు లక్షల రూపాయలు ఖర్చయిన ఈ పుట్టిన రోజు ఉత్సవంలో 24 గంటల యజ్ఞం, తిలక ప్రదానం, నాలుగు రోజుల మత ప్రవచనాలు జరిగాయి. చంద్రస్వామి ఈ సందర్భంగా "జగదాచార్య" అనే కొత్త బిరుదును స్వీకరించాడు. కాశీ నుంచి వచ్చిన 51 మంది పండితులు, వేలాది మంది సాధువుల సమక్షంలో ఈ ఉత్సవాన్ని నిర్వహించారు...

## అతిశయోక్తిని నిజం చేసిన చిత్రాంగద పెళ్ళి



"ఆకాశమంత పందిరి కింద, భూదేవంత అరుగు మీద" పెళ్ళి జరపడ మనేది ఒక తెలుగు నుడికారం. అతిశయోక్తి అలంకారం కూడా. కాని గ్వాలియర్ మాజీ సంస్థానాధీశుడు మాధవరావు సింధియా కుమార్తె చిత్రాంగద విషయంలో అదే వాస్తవం కూడా అయింది. గ్వాలియర్ రాకుమారికీ, జమ్ము కాశ్మీర్ రాకుమారుడు విక్రమాదిత్యకు జరిగిన వివాహం సందర్భంగా గ్వాలియర్ నగరం మొత్తం పెళ్ళి కళను సంతరించుకుంది. గతించిన కాలపు రాచరికపు ఠీవి, బ్రహ్మాండమైన వజ్రాల ఆభరణాలు, జరీ దుస్తులు, వెండి నగిషీల రథాలు, తళతళలాడే మెర్సిడెస్ కార్లు రంగు రంగుల దీపాలతో స్వర్గ తుల్యంగా అలంకృతమైన గ్వాలియర్ నగరంలో రెండు రోజుల పాటు రాజ్యం చేశాయి. అప్నా ఉత్సవ్ నిర్మాత రాజీవ్ సేఠీ వివాహ మండపాన్ని నిర్మించారు. 35 వేల మంది పెళ్ళి ఊరేగింపును తిలకించారు. వరుడు విక్రమాదిత్య డాక్టర్ కరణ్‌సింగ్ కుమారుడు. లాస్ ఏంజెల్స్‌లోని కాలిఫోర్నియా విశ్వవిద్యాలయ పట్టభద్రుడు. న్యాయస్థానంలో వివాదంలో ఉన్న తమ ఆస్తి (వెయ్యి కోట్ల రూపాయలకు పైగా) తమకు రాక తప్పదని ఆయన అన్నారట....

## ఎనిమిది పదులు నిండిన ఆల్బర్టో మొరేవియా

ప్రపంచ ప్రసిద్ధి పొందిన నవలాకారుడు ఆల్బర్టో మొరేవియాకు ఎనభై సంవత్సరాలు నిండాయి. గడిచిన అరవై సంవత్సరాలలో ఆయన యాభై నవలలు, అనేక కథా సంపుటాలు వెలువరించి మానవ స్వభావ చిత్రణలో తనదైన స్థానాన్ని సంపాదించుకున్నారు. ఆయన మొదటి నవలనే ఫాసిస్టు



ముస్సోలినీ ప్రభుత్వానికి చెందిన ప్రజా సంస్కృతి మంత్రిత్వ శాఖ నిషేధించింది. ఆల్బర్టో మొరేవియా, సూడో అనే మారు పేర్లతో రచనలను వెలువరించిన ఈ రచయిత అసలు పేరు ఆల్బర్టో పింఛెర్లె. ఇటలీలోని రోమ్‌కు చెందిన ఒక వాస్తు శాస్త్రజ్ఞుడి కొడుకయిన మొరేవియా "నా వయసు చాలా మెల్లగా పెరుగుతోంది. నేను కళాకారుణ్ణి కావడమే అందుకు కారణం" అని చెప్పుకున్నాడు. ఆయన గత 30 సంవత్సరాలుగా ఎల్ ఎస్ ప్రెస్సో పత్రికలో సినిమా అనే శీర్షికను వారం వారం నిర్వహిస్తున్నాడు. ఆ శీర్షిక కింద ఆయన ఇప్పటికి రెండు వేల సినిమాలను సమీక్షించాడు!

## ప్రథమ ప్రయత్నంలోనే విజయం సాధించిన డారెన్ మోర్గాన్



బెంగుళూరులో జరిగిన మెకడొవెల్ ప్రపంచ ఔత్సాహిక స్నూకర్ ఛాంపియన్‌షిప్ పోటీల్లో 37 దేశాలకు చెందిన 50 మంది క్రీడాకారులు పాల్గొన్నారు. ఇంత పెద్ద పోటీని ఎదుర్కొని చరిత్రాత్మక విజయం సాధించాడు వేల్సుకు చెందిన 21 సంవత్సరాల డారెన్ మోర్గాన్. ఆయన ఆడిన ఈ మొదటి ప్రపంచ పోటీలోనే ప్రతిష్ఠాత్మకమైన ఎం. ఎం. బిగ్ ట్రోఫీని గెలుపొందాడు. 1987 లో ఆయన బ్రిటన్‌లో జరిగిన పోటీలన్నిటిలోనూ విజయం సాధించి 28,000 పౌండ్లు గెలుపొందాడు.... ■

# సీరియల్



(గతసంచిక తరువాయి)

మర్నాడు ఉదయం వినాయకరావు రేడియోలో లలితసంగీతం వచ్చే టైంక లేచాడు. ఆ రోజు కుమారి శృతి పాటలేం రాలేదు.

"డిజప్పాయింట్ అయ్యావా?" అడిగాడు శాస్త్రి అది గమనించి.

"ఊహు. ఘంటసాల 'తలనిండ పూ దండ' విన్నాను. కాంపెన్సేట్ అయింది" చెప్పాడు వినాయకరావు స్టవ్‌మీద గిన్నెలోని నీళ్ళు వేడెక్కాయో లేదో వేలుతో ముట్టుకుని చూస్తూ.

వినాయకరావు చటుక్కున ఆ వేలిని నోట్లో పెట్టుకోవడం గమనించాడు ఆ గదిలోకి వచ్చిన పక్కింటి పూజారి శతభిషం.

"గుడ్‌మార్నింగ్. వేలుకాలిందా నాయనా?" అడిగాడాయన.

"అబ్బే. లేదండి. శుభోదయం" చెప్పాడు వినాయకరావు.

"నిన్ను కంగ్రాచ్యులేట్ చెయ్యడానికి వచ్చాను. సాయంత్రం మా ఇంటికి మీ ఇద్దరు టీకి రండి."

"దేనికండి కంగ్రాచ్యులేషన్స్?" అడిగాడు శాస్త్రి గడ్డం గీసుకోవడం ఆపి. "మీ లాటరీ టిక్కెట్ నెంబర్స్ మీకు తెలీదుగా!"

"మరణమూర్తితో పోట్లాడి రాత్రి ఈ ఇంటికి వెలుగు తెప్పించినందుకు. ఎంచక్కా ఫేన్ వేసుకుని పడుకున్నాం."

"ఏం చేస్తాం చెప్పండి. నోరున్నవాడిదే రాజ్యం అయిపోయింది" చెప్పాడు శాస్త్రి.

"మొత్తానికి భలే పేరు పెట్టారు రమణమూర్తికి. మొదట క్షరం స్థానభ్రంశం అయి వేరేచోట చేర్చగానే మరణమూర్తి అయిపోయాడా పాపి చిరాయువు."

"గట్టిగా అనకండి. ఆయన వింటే ఏడుస్తారు" చెప్పాడు వినాయకరావు నవ్వి.

"ఆదిలక్ష్మికి పెళ్ళనుకుంటాను" చెప్పాడు పూజారి.

"మీ కెలా తెలుసు?" అడిగాడు శాస్త్రి.

"ఇందాక పురోహితుడు వచ్చి వెళ్తున్నాడు. లగ్నం గురించి పంచాంగం తిరగేస్తున్నారు."

"మరీ మంచిది" చెప్పాడు వినాయకరావు.

"అయితే మనకి పప్పు, పప్పులంతోపాటు గారెల భోజనం త్వరలో వుందన్నమాట" సంతోషంగా చెప్పాడు శాస్త్రి.

"ఈ నెల జీతం ఇవ్వు. మరణమూర్తి అడక్కుండానే" చెప్పాడు శాస్త్రి శతభిషం వెళ్ళగానే.

వినాయకరావు పావుగంటలో తయారయాడు. రమణమూర్తి పోర్షన్‌వైపు వెళ్ళాడు. ముందు గది తలుపు లేసివుంచడంతో తలుపు తట్టబోయి చటుక్కున ఆగాడు. లోపలనించి వినబడుతున్న పాటకి.

కుమారి శృతి పాట!

చేతి గడియారంవంక చూసుకున్నాడు. రేడియోలో లలితసంగీతం వచ్చే టైం కాదది. ఇదివరకెప్పుడూ తను విన్న పాట కూడా కాదది. సరికొత్త పాట.

చెవులు రిక్కించి విన్నాడు.

'గోరింకకు గారమెక్కువ, మా గోరింకకు గారమెక్కువ

**జరిగిన కథ –1 : వినాయకరావు, శాస్త్రి రూంమేట్స్. వినాయకరావు అభిమాన గాయని శృతి. ఆమె ఇంటి ఓనర్ రమణమూర్తి కూతురు ఆదిలక్ష్మి అని వినాయకరావుకు తెలియదు. రమణమూర్తికి, వినాయకరావు, శాస్త్రిలకు మధ్య గొడవలు జరుగుతుంటాయి. ఆదిలక్ష్మి రేడియోలో పాడుతుందని తండ్రికి కూడ తెలియదు.**

# వినాయకరావు పెళ్ళి

చిలుకకి చిరాకెక్కువ. మా చిన్నారి చిలకకీ.....'

స్నానంచేస్తూ, వళ్ళు రుద్దుకుంటూ అలవాటుగా పాట పాడుకుంటోంది ఆదిలక్ష్మి. అది పూర్తయ్యేదాకా తలుపు బయట నిలబడి తన్మయత్వంతో విన్నాడా పాటని వినాయకరావు.

పాట అవగానే తలుపుమీద గట్టిగా కొట్టాడు.



"ఎవరది. వస్తున్నానుండండి" అరిచింది స్నానాల గదిలోంచి ఆదిలక్ష్మి.

గబగబా బట్టలుకట్టుకుంది. మళ్ళీ తలుపుమీద కొట్టాడు వినాయకరావు.

"వస్తున్నాను" అరిచింది ఆదిలక్ష్మి.

మరోసారి తలుపుమీద బాదాడు వినాయకరావు.

"వస్తున్నానంటే" అరిచింది ఆదిలక్ష్మి అసహనంగా, చిరకుచ్చెళ్ళు వెక్కుకుంటూ.

మళ్ళీ తలుపు చప్పుడవుతుండగా గట్టిగా తలుపుతెరిచి, గుమ్మంలో నిలబడ్డ వినాయకరావుని చూసి అడిగింది చిరాగ్గా.

"వస్తున్నానంటే తలుపు బాదేయడమేనా?"

"అయిదు నిముషాలా తలుపు తెరవడానికి? నా కవతల ఆఫీస్ టైమవుతోంది" ఇంట్లోకి చూస్తూ చెప్పాడు.

"ఇంట్లో ఎవరూలేరు. నేను స్నానం చేస్తున్నాను."

"ఇంట్లో ఎవరూలేరా?" అడిగాడు వినాయకరావు ఆశ్చర్యంగా.

"ఏమిటి పొద్దున్నే మీ రాచకార్యం?" అడిగింది ఆదిలక్ష్మి.

"ఇంటద్దె ఇద్దామని."

జేబులోంచి డబ్బు తీసి లెక్కపెట్టి ఇచ్చాడు. ఆదిలక్ష్మి కావాలని ఒకటికి

రెండుసార్లు లెక్కపెట్టింది. అతనిమీద తనకి నమ్మకంలేదని అనుకోవాలని.

"నిజంగా మీ ఇంట్లో ఎవరూ లేరా?"

"లేరు. అయితే ఏమిటి?"

"మరిందాక ఆ పాట.....?"

"ఏ పాట?"

"టేప్‌రికార్డర్ వుందనుకుంటాను మీకు."

"ఉంది. ఏం?"

"ఆ కాసెట్ ఓసారి ఇస్తారా"

"ఏ క్యాసెట్?"

"టేప్‌రికార్డర్‌లో ఇందాక మీరు విన్న కేసెట్."

"అరగంటనించి కరెంటులేదు. నేనే కేసెట్ విన్లేదు. విన్నా మీ కివ్వను." చెప్పింది ఆదిలక్ష్మి.

"మరి ఇందాక ఆ పాట పాడింది....."

వినాయకరావు మాటలకి అడ్డంవస్తూ బయటనించి లోపలికి వస్తున్న ఆదిలక్ష్మి తల్లి కనకమహాలక్ష్మి అడిగింది

"ఏవిటే అమ్మాయ్ పొద్దున్నే గొడవ? మళ్ళీ ఏం గొడవ చెయ్యడానికి వచ్చావు నాయనా?"

"అబ్బే. గొడవేం లేదమ్మా. అద్దె ఇచ్చాడు" చెప్పింది ఆదిలక్ష్మి.

చేతిలో శుభలేఖలతో వచ్చిన రమణమూర్తి చెప్పాడు వినాయకరావుతో, ఆ డబ్బు లెక్కపెట్టుకుని.

"పనయిందిగా. ఇక వెళ్ళచ్చు."

"మీకు అద్దె ఇచ్చినా కోపమే, ఇవ్వకపోయినా కోపమే."

"అన్నట్టు సాయంత్రం నీతో మాట్లాడాలి. ఆఫీసునించి వచ్చాక ఓసారి కనబడు" చెప్పాడాయన.

"సాయంత్రం సినిమాకి వెళ్ళి లేట్‌గా వస్తాను. రేపు వుదయం....."

"అక్కర్లేదు. ఉదయం నీ ముఖం చూడక్కర్లేదు. రేపు సాయంత్రం కనపడు. లేదా ఎల్లుండి సాయంత్రం. ఎప్పుడయినా సరే సాయంత్రాలే కనబడు."

వినాయకరావు ఏదో అనబోతుండగా చెప్పింది కనకమహాలక్ష్మి భర్తతో.

"వాళ్ళతో మనకేంటి? ఇంట్లోకి రండి మీరు."

ముగ్గురూ లోపలకి వెళ్ళిపోవడంతో వినాయకరావు వెనక్కి తిరిగాడు.

సైకిళ్ళ మీద ఆఫీసుకి బయలుదేరారు. దారిలో తను విన్న శృతి పాట గురించి చెప్పాడు వినాయకరావు తనివితీరా శాస్త్రితో.

"ఆ అమ్మాయి రికార్డ్ చేసుకుని వింటుంది. నీ పిచ్చికాని వాళ్ళింటిమీద వాలిన కాకి మన ఇంటిమీద వాలకపోవడం నీవు గమనించి వుండవు. అలాంటిది కేసెట్ ఎలా ఇస్తుందనుకున్నావు?"

"నిజమే. ఇంటాయన ఏం మాట్లాడాలన్నాడు? ఇంటి అద్దె గురించా?"

ఆ చర్చ తర్వాత ఇద్దరూ సాయంత్రం వెళ్ళాల్సిన సినిమా గురించి మాట్లాడుకుంటూ సైకిల్స్ తొక్కసాగారు.

"ప్చ్! ఇవాళ శృతినించి ఉత్తరం రాలేదు" చెప్పాడు వినాయకరావు పదకొండున్నరకి వచ్చిన పోస్ట్ చూసి.

"రేపు తప్పకుండా వస్తుంది" శాస్త్రి ధైర్యం చెప్పాడు.

"రే పొచ్చిందా సరే. లేదా పర్మిషన్ తీసుకుని ఆలిండియా రేడియోకెళ్ళి, ఆ అమ్మాయి చిరునామా కనుక్కుని సరాసరి ఇంటికే రాస్తాను లెటర్" చెప్పాడు వినాయకరావు.

"అమ్మయ్య. ఇప్పటికి సరయిన దారిలో ఆలోచిస్తున్నావు. నీకో సంగతి తెలుసా? బంగారు రోజులని మనచేతివేళ్ళలోంచి జారిపోనివ్వకూడదు. అలా జారిపోబట్టే అవి బంగారురోజులవుతాయి అని తర్వాత గ్రహిస్తాం" చెప్పాడు శాస్త్రి.

* * * *

ఆ రోజు ఉదయం పన్నెండయినా రమణమూర్తి బయటకి వెళ్ళలేదు.






## వినాయకరావు పెళ్ళి

ఒకటింపావుకి రికార్డింగ్ వుంది. ఎలా అమ్మా? నాన్నగారు ఇల్లు వదిలేలాలేరు" బిక్కమొహంతో అడిగింది ఆదిలక్ష్మి తల్లిని

"నిజమే ఆయన ముందు బయటకి వెళితే ఎక్కడికని అడుగుతారు. ఏదో ఓ అబద్ధం చెప్పి బయలుదేరు వాళ్ళని వెయిటింగ్‌లో వుంచడం మంచిదికాదు". చెప్పింది కనకమహాలక్ష్మి

ఆదిలక్ష్మి అయిదు నిమిషాల్లో తయారై తండ్రితో చెప్పింది అనవాయితీగా.

"నేను బయటికి వెళ్ళొస్తా నాన్నగారు '

ఎక్కడికి? '

'ఈ సాయంత్రం నా ఫ్రెండ్‌కి పెళ్ళి చూపులు గోరింటాకు పెట్టడానికి రమ్మన మంది.'

"మేరీనేనా? ' అన్నాడాయన తీక్షణంగా చూస్తూ

"కాదండి. అనసూయ అని మీకు తెలీదు '

' ఎటు వైపు "

"సెక్రటేరియట్ దగ్గర "

'పద. నేనూ అటే వస్తున్నాను అయినా అష్టమి నాడు పెళ్ళి చూపు లేమిటమ్మా?"

ఆ మాటలకి ఆదిలక్ష్మికి పై ప్రాణాలు పైనే పోయాయి. ఆయన వస్తే తన అబద్ధం బయట పడుతుంది. తప్పలేదు తండ్రి స్కూటర్ మీద బయలు దేరింది ఆయన ఎల్ ఐ సి ఆఫీసు పక్కనే స్కూటర్ ఆపి చెప్పాడు.

'ఈ ఆఫీస్‌లో నాకు పనుంది. అది అయాక వెళదాం"

మీ రెందుకు నాన్న గారు పక్కనేగా నడిచి వెళ్తాను "

వద్దమ్మా నేను దింపుతాను పైగా నీ పెళ్ళి ప్రయత్నాలు కూడా చేయాలి ఈ ఏడాది ఆ విషయాలు నీ ఫ్రెండ్ నాన్నతో మాట్లాడాలను కుంటున్నాను "'

"అనసూయకి తండ్రి లేదు నాన్నగారు '

"పోనీ తల్లీ?"

"ఆవిడా లేదు. బాబాయి దగ్గర పెరుగు తోంది ' చెప్పింది ఆదిలక్ష్మి

'బాబాయంటే తండ్రి లాంటివాడేను పద"

ఇద్దరూ నడవ సాగారు ముందు రమణమూర్తి, వెనక ఆదిలక్ష్మి ఆఫీసులోకి వెళ్ళాక ఆదిలక్ష్మి తండ్రి వెనకన రావడం గమనించి పక్కనే వున్న తలుపులోంచి ఓ గదిలోకి వెళ్ళింది అది ఎల్ ఐ. సి ఆఫీసర్ గది.

' ఏం కావాలమ్మా?" అడిగాడాయన

'ఎల్ ఐ సి చెయ్యాలను కుంటున్నానండి." చెప్పింది ఆదిలక్ష్మి

'అలాగా? కూర్చోమ్మా."

ఆదిలక్ష్మి, కూర్చున్నాక అడిగాడాయన

"ఎవరికమ్మా?"

"నాకే"

' నీకా పెళ్ళయిందా!" అడిగా రాయన, ఎగాదిగా చూసి

"ఇంకా లేదండి. కాని అవబోతుంది " అబద్ధం ఆడింది అతని ముఖకవళికలని గమనించి.

"అంటే పెళ్ళయ్యాక మీ వారిచేత చేయిస్తావన్నమాట."

"అన్న మాటే కదండి "

"వెరీ గుడ్! నీ దూరదృష్టికి ఎంతకి చేయిస్తావు?"

"ఓ పది లక్షలకి. సంవత్సరానికి సుమారుగా ఎంతవుతుందో కనుక్కోవాలని వచ్చాను.... ఆయనే కనుక్కో మన్నారు."

"వెరీ వెరీ గుడ్. ఆయన వయసు పాతికనుకుంటే. . ఏడాదికి ప్రీమియం. . ఆ వివరాలు చెప్పాడాయన ఓ పట్టిక చూసి.

'రోజులన్నీ మనవి కాదు. ఏ క్షణాన ఏం జరుగు తుందో ఎవరు చెప్పలేం. పెళ్ళయ్యాక ఇద్దరూ మర్నాడే రండి "

"అలాగే" చాలా థాంక్సండి."

ఆదిలక్ష్మి, లేచి ఓ సారి బయటకి తొంగి చూసింది తన తండ్రి కనబడక పోవడంతో బయటికి నడిచింది ఆదిలక్ష్మి. ఆ గదిలోంచి బయటకి వచ్చిన కొన్ని క్షణాల్లో రమణమూర్తి ఆ గదిలోకి వచ్చాడు. తన చేతిలోని కాగితాలని ఆ ఆఫీసర్ కిచ్చి తనొచ్చిన పని వివరించ సాగాడు.

ఆదిలక్ష్మి రిక్షా టాపు వేయించుకుని ఆలిండియా రేడియోని చేరుకుంది ఉదయం బాత్ రూంలో ప్రాక్టీస్ చేసిన పాట రికార్డింగ్ పది నిమిషాల్లో పూర్తయింది

"మళ్ళీ నీకు ఉత్తరం వచ్చిందమ్మా"

ఆ సెక్షన్ హెడ్ ఆదిలక్ష్మికి చెక్కుతో పాటు ఓ కవరిచ్చాడు దాన్ని తెరవకుండానే, చేతి వ్రాతని బట్టి గుర్తించింది, అది ఎవరినించి వచ్చిందీ

వై. వి రావ్ నించి.

"నీ పాటని, కంఠాన్ని మెచ్చుకుంటూ చాలా వుత్తరా లొచ్చాయమ్మా ఈ సారి రచన, గాయని అని రెండూ చెప్తాం" ప్రోత్సాహ పూర్వకంగాచెప్పాడాయన

"చాలా థాంక్సండి "

"నీవు టి. వి.లో ఎందుకు పాడ కూడదూ?" అడిగాడాయన .

# వినాయకరావు పెళ్ళి

మా నాన్నగారి కిష్టం వుండదండి చెప్పింది ఆదిలక్ష్మి

అర్ధగించాడు నీ లాంటి వాళ్ళు రేడియోకే పరిమిత మవకూడదు నీవు సరేనంటే టి వి నించి నీకు కాంట్రాక్ట్ వచ్చే పూచీ నాది ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని వూళ్ళలో ఇళ్ళలోకి కేవలం పాటతోనే కాక రూపంతో కూడా వెళ్ళ గలుగుతావు నీవు

థాంక్సండి నాన్నగారిని అడిగి చెప్తాను

ఆదిలక్ష్మి బయటకి వచ్చి ఓ చెట్టు కింద కూర్చుని ఆ నీలిరంగు కవరుని చింపింది ఈ సారి ఆ వుత్తరానికి రాసిన సెంట్ మరింత ఘాటుగా వుంది. ఆత్రంగా చదివింది ఆదిలక్ష్మి ఆ ఉత్తరాన్ని

అక్టోబర్ 1987

కుమారి శృతి గారికి

నేను ఇదివరలో మీకు లెటర్ రాసాను అది మీకు చేరిందో లేదో నాకు తెలీదు మళ్ళా దాన్ని రాస్తున్నాను మీ పాటలు రేడియోలో చాలా విన్నాను ఇవాళే వుదయం లలిత సంగీతం కార్యక్రమంలో మీ పాట చిటారి కొమ్మన ఒంటరి కోయిల– నిండు పున్నమి నాటి తుఫాన్ రేయిలా విన్నాను అతిశయోక్తి లేకుండా చెప్పాలంటే అది విన్న నేను పరవశించి పోయాను చిన్నప్పటి నుంచీ నాకు లలిత సంగీతం అంటే ఇష్టం అపకోర్స్ నాకు జనగణమణ తప్ప మరే పాట బాగా పాడటం రాదు

నా గురించి క్రితం వుత్తరంలో రాయనే లేదు నా పేరు కింద వుంది నేను ఎల్ ఐ సి లో డెవలప్‌మెంట్ ఆఫీసర్‌గా పని చేస్తున్నాను ఈ మధ్యే ఈ ఉద్యోగంలో చేరాను మీ పరిచయం కోరి ఈ ఉత్తరం రాస్తున్నాను మా ఆఫీసుకి ఫోన్ చేసి నా పేరు డిజిగ్నేషన్ చెప్తే చాలు టెలిఫోన్ ఆపరేటర్ నా రూమ్మేట్‌లెండి కనెక్షన్ ఇస్తాడు

పున్నమి వెన్నెల కమ్మని కోయిలపాట సముద్రపు అలల వెంట వచ్చే స్వచ్ఛమయిన నురుగు హంపీలోని శిల్పాలు వాన చినుకు పడకుండా నేల మీంచి వేసే వాసన గులాబీల అందం లేత అరటి ఆకు మీది పచ్చదనం మొగలి పూల జడ ఇలాంటి వెన్నో నాకిష్టం ఇంత సింపుల్‌వా అనుకోకండి ఐథింక్ సింపుల్ టు హేవ్ బట్ ఇటీజ్ సో టఫ్ టుబి సింపుల్

బాల మురళీకృష్ణకి ఆయన అమృతగానం చేసిన ఏమి సేతురా లింగా పాట విన్నాక నా పద్యాలుగో ఏట ఇలాంటి అభినందన వుత్తరమే రాసాను ఆ తర్వాత మళ్ళీ రాసేది మీకే మీ చిరునామా తెలియచేయగోరుతాను

మీ స్నేహ సుగంధాన్ని కోరే

మీ

వై వి రావు

నా చిరునామా

వై వి రావ్

పోస్ట్ బాక్స్ నంబర్ 9909

హైదరాబాద్ 500 001

ఆ వుత్తరాన్ని దాదాపు అర డజనుసార్లు చదువుకుంది ఆదిలక్ష్మి ప్రతిసారి ఆమెలో అది ఎన్నో భావా లని కలగ చేసింది ఎందుకో ఎవరూ పక్కన లేకపోయినా సిగ్గుగా అనిపించింది ఆ వుత్తరాన్ని మడచి తన హేండ్ బేగ్‌లో పెట్టుకుంది

తర్వాత నెమ్మదిగా లేచి బయటకి నడిచింది

దగ్గర్లో వున్న పోస్టాఫీస్ దగ్గర ఆగి ఓ ఇన్‌లాండ్ కవర్ తీసి వై వి రావ్‌కి సమాధానం రాసింది ఆదిలక్ష్మి

హైదరాబాద్

శ్రీ వై వి రావు గారికి

అక్టోబర్ 87

మీరు అభిమానంతో రాసిన రెండు వుత్తరాలు అందాయి నా గాత్రం మీకు నచ్చినందుకు కృతజ్ఞురాలిని మీరు మీ వుత్తరంలో వెలిబుచ్చిన అనేక సున్నిత భావాలకి ముగ్ధురా లయ్యాను నా చిరునామా అడిగారు సారీ అండి నా ఇంటి చిరునామా ఇచ్చే పరిస్థితిలో లేను మా నాన్న గారికి ఇలాంటివి నచ్చవు రేడియో స్టేషన్‌కే రాస్తుండండి ఎప్పుడయినా వీలుంటే మీకు ఫోన్ చేస్తాను వచ్చే బుధవారం సాయంత్రం నా పాట బ్రాడ్‌కాస్ట్ అవుతుంది వీలుంటే వినండి

ఫ్రెండ్లీ

శృతి

ఆ వుత్తరాన్ని నాలుగయిదు సార్లు చదువు కొంది ఆదిలక్ష్మి అంతకంటే రాయటానికేం లేదని ఎంచింది చివరలో బాలమురళీ కంఠం అంటే నాకు ఎంతో ఇష్టం ముఖ్యంగా శివుడి మీద ఆయన పాడిన ఏమి సేతురా లింగా అందులో ఆయన ఆలాపన విరుపులు అనితర సాధ్యం అని నా అభిప్రాయం అన్న వాక్యలు మళ్ళీ రాసి చిరునామా రాసి పోస్ట్ చేసింది

ఇంటి కొచ్చేసరికి రమణమూర్తి ఇంటికి రిక్షాలో వచ్చిన సరుకులు లెక్క చూసుకుంటున్నారు

ఏమ్మా? ఏమయ్యావ్? అడిగాడాయన

మీరే కనపడలేదు నాన్నగారు గబగబ నడిచి దూరం అయారు ఎల్ ఐ సి ఆఫీస్ అంతా మీ కోసం తిరిగానంటే నమ్మండి చెప్పింది ఆదిలక్ష్మి

నీది మరీ మట్టి బుర్ర బయట స్కూటర్ దగ్గర వెయిట్ చేయాల్సింది వెంటనే ఆదిలక్ష్మి తల్లి కలిపించుకుని చెప్పింది

బానే వుంది మీరు చెప్పేది వెనక మనిషి వస్తో వుందో లేదో చూసుకోకుండా నడవడమే ఈడొచ్చింది కాబట్టి సరి పోయింది అదే ఏ చిన్న ఏల్లో అయితే ఎంత గాభరాగా వుండేది?

చిన్న పిల్లయితే అసలిలా జరిగేదే కాదు చేతిని పట్టుకుని వెళ్ళేవాణ్ణి

వంట గదిలోకి వెళ్ళాక గొంతు తగించి జరిగింది చెప్పింది ఆదిలక్ష్మి

పోనీ లేమ్మా ఎప్పుడొస్తుందిట పాట? అడిగిం దావిడ తృప్తిగా

వచ్చే బుధవారం సాయంత్రం

ఆ రోజు కరెంటు వుండాలని ఆ దేముడికి మొక్కుకో ఓ కొబ్బరికాయ ఖర్చయితే అయింది చెప్పింది ఆవిడ

తన కొచ్చిన వుత్తరం గురించి తల్లికి చెప్పాలా వద్దా అని కాసేపు సందిగ్ధంలో పడింది ఆదిలక్ష్మి చివరికి చెప్పకూడదని నిర్ణయించు కుంది

(ఇంకా వుంది)

దోసకాయలపల్లిలో కోనసీమ సైన్సు పరిషత్ 43 వ మహాసభ జరిగిన సందర్భంలో పాఠశాలకు ఏర్పాటు చేసిన శాశ్వత విద్యుత్ అలంకరణకు ప్రారంభోత్సవం చేస్తున్న రిటైర్డ్ హెడ్ మాస్టర్ శ్రీ ఎ యస్ సోమయాజులు సైన్సు పరిషత్ అధ్యక్షుడు ఎ వి సర్వేశ్వరశర్మ విద్యాశాఖాధికారులు డా కె శశిధరరావు శ్రీ వై అచ్చయ్య పాఠశాల హెడ్ మాస్టర్ శ్రీ కె వి యస్ యస్ అప్పారావును కూడా చూడవచ్చు.



# శత చిత్ర నటి సుమలత సమాధానాలు



**జె. రహింతుల్లా, వనపర్తి**

ప్ర ఫ్లాష్‌బాక్ పద్ధతి అసలు లేకపోతే మంచి దంటాను. మీరేమంటారు సిస్టర్?

జ : సినిమాల విషయం అటుంచితే – నిజ జీవితంలో అప్పుడప్పుడు ఒకసారి వెనక్కి తిరిగి చూసుకుని, పునశ్చరణ చేసుకోవడం ఎందుకైనా మంచిది కదా!

**వియ్యపు శ్రీనివాసులు, పెనుగొండ**

ప్ర కఠినాత్ముడి కనులు ఎన్నడైనా నీరు నిండేనా?

జ : పక్కింటాయనకు లాటరీలో లక్ష రూపాయలు వచ్చాయని తెలిసినప్పుడు.

**ఎం. గౌస్‌పీరా, మేడపాడు**

ప్ర మన చిత్రాలు ఉన్నత స్థాయిలో ఇలా ఉండాలి – అని ఉపన్యాసాలలో సలహాలు దంచేసే ఏ మంత్రి చేతయినా ఒక పిక్చర్ తీయిస్తే. .?

జ : "ఫలానా ఊరికి వెళ్ళే దారి" అని చూపించే బోర్డు ఎప్పుడూ ఆ ఊరికి వెళ్ళదు.

**బి. సింగరాచార్య, శాయంపేట**

ప్ర · మీరు షూటింగ్‌లకు వెళ్ళేటప్పుడు మీ వెంట వచ్చేదెవరు? సుమగారూ?

జ : నా నీడ.

**వి. ఎల్. పతి, గుంటూరు –2**

ప్ర : శాస్త్ర విజ్ఞానం మృత్యువును జయిస్తే... ?

జ : అప్పుడు క్రిక్కిరిసి పోయిన నరకంలోంచి బయటపడడానికి మానవుడు మరింత యాతన పడతాడు.

**కె. ఎస్. సీతారామిరెడ్డి, మొలగపల్లి**

ప్ర · చమత్కార పూరితంగా మీరిచ్చే సమాధానాలకు ఎంతగానో అచ్చెరువొందు తూంటాను అందుకు బహుమతిగా మీకో గాడిద పిల్లను పంపాలనుకుంటున్నాను. మీరేమంటారు.

జ : మీ అభిమానానికి కృతజ్ఞురాల్ని. మరి దాని రవాణాకు బోల్డు ఖర్చవుతుందే! కవర్‌లో మీ ఫోటో ఒకటి పంపిస్తే చాలు లెండి.

**కంసల సుధారాణి, హిరమండలం**

ప్ర . సదా సత్యం చెప్పేవారు ఈ లోకంలో ఎక్కడైనా ఉన్నారా?

జ : అసలు సదా చెప్పవలసినంత సత్యం ఈ లోకంలో ఉందా అని.

**సజ్జా సోమరాజు, రాజంపేట**

ప్ర · "ఆడదాని మాటలకు అర్థాలు వేరులే" అనే పాట "మిసమ్మ" చిత్రంలో ఉంది ఇది ఎంత వరకు నిజం?

జ : అర్థాలు వేరయినా, తాత్పర్యం ఒకటే.

**ఆర్. వేణయ్య, పర్లాకిమిడి**

ప్ర . మొఘలాయిలు మన దేశాన్ని పాలించకుండా ఉంటే... ?

జ : తాజ్‌మహల్ అవతరించి ఉండేది కాదు.

**ఎల్. నరసింహప్ప, హొస్పేట**

ప్ర ఈ ప్రపంచం ఒక వార పత్రిక అనుకుంటే, అందులో మన జీవితం గేయమా, సీరియల్ నవలా లేక చిన్న కథా?

జ : వారఫలాలు.

**ఐ. నాగరాజారావు, కొడాలి**

ప్ర . మిస్ సుమలతగారూ! 'బాధ' అనగానేమి?

జ : దేవుణ్ని స్ఫురణకు తెచ్చేది.

**టి. వి. నాగలింగశాస్త్రి, సంగం జాగర్లమూడి**

ప్ర · భగవంతుడు సర్వాంతర్యామి. 'ఇందుగల డందు లేడని సందేహము వలదు' అనెదరు కదా? అయినచో మనము దేవాలయమునకు వెళ్ళటం ఎందులకు?

జ : అచ్చట కూడా ఉండునని.

**వి. బంగార్రాజు, భిలాయ్**

ప్ర జీవితం మీద విరక్తి చెందిన వారల్లా గౌతమునిలా తపస్సుకు వెళ్తే....?

జ : గౌతముని లాగే తిరిగొస్తారు. ఏ ఒకరో ఇద్దరో మాత్రమే బుద్ధునిలా తిరిగొస్తారు.

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న.......................................................................

.............................................................................

.............................................................................

పంపినవారి పేరు.........................................................

పూర్తి చిరునామా........................................................

# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## రాముడు-భీముడుగా బాలకృష్ణ

"ద్విపాత్రలు నిర్వహించే బాలకృష్ణ సరసన రాధ, రజని నాయికలు," అన్నారు కె. మురళీమోహనరావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో సత్యం ఎంటర్‌ప్రైసెస్ సి. హెచ్. వి. వి. సత్యనారాయణ నిర్మించే పై చిత్రంలో జగ్గయ్య, సత్యనారాయణ, రావుగోపాలరావు, నూతన్‌ప్రసాద్, వేలు, సుధాకర్, జీవిత, శ్రీలక్ష్మి, శ్రీవిద్య, వై. విజయ తక్కిన తారాగణం. గుహనాథన్ కథకు పరుచూరి సోదరులు సంభాషణలు రాశారు. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. నందమూరి మోహనకృష్ణ ఛాయ, శ్రీనివాసరాజు శిల్పం, రఘు నృత్యాలు, సూపర్ సుబ్బరాయన్ సాహసాలు. ఎన్. శ్రీనివాసరావు సంయుక్త దర్శకత్వం, సత్యం- పట్టాభి ప్రొడక్షన్, కె. వెంకటేశ్వరరావు కూర్పు నిర్వహిస్తున్నారు. జనవరి నుంచి ఏప్రిల్ వరకు ప్రతి నెలా 11-25 తేదీల మధ్య జరిగే నాలుగు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది.

## హీరో నాగార్జున చిత్రావళి

"మురళీ కృష్ణుడు" షూటింగ్ ముగిసింది. "ఆఖరి పోరాటం" తుది ఘట్టంలో ఉంది. జనవరిలో సురేష్ ప్రొడక్షన్స్, ఫిబ్రవరిలో యువచిత్ర, ఏప్రిల్‌లో అన్నపూర్ణా స్టూడియోస్, జూన్‌లో శివప్రసాద్‌రెడ్డి చిత్రం, జూలైలో క్రాంతి కుమార్ చిత్రం, ఆగస్టులో ఎస్. వి. రాజేంద్రసింగ్ దర్శకత్వంలో పవన్ ప్రొడక్షన్స్ చిత్రం ప్రారంభమవుతాయి. సి. హెచ్. నరసారెడ్డి నిర్మించే చిత్రానికి మణిరత్నం దర్శకుడు.

## బాలకృష్ణతో తేజస్వి చిత్రం మూడో షెడ్యూల్

"మూడో షెడ్యూల్ డిసెంబర్ 22 నుంచి నెలాఖరు వరకు హైదరాబాద్‌లో జరిగింది. ఇక రెండు పాటలు చిత్రీకరించవలసి ఉంది. అది జనవరిలో" అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. ఈయన దర్శకత్వంలో ఎన్. హరికృష్ణ నిర్మిస్తున్న తేజస్వి వారి చిత్రంలో బాలకృష్ణ, భానుప్రియ, జగ్గయ్య రావు గోపాలరావు, గిరిబాబు, నూతన్‌ప్రసాద్, రాజేష్, పి. ఎల్. నారాయణ, జీవిత, అనిత, వరలక్ష్మి, నిర్మల నటిస్తున్నారు. పరుచూరి సోదరులు కథ, మాటలు రాశారు. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. నందమూరి మోహనకృష్ణ ఛాయ. శ్రీనివాసరాజు



"అన్నా చెల్లెలు" లో రాధిక

తేజస్వి నిర్మించే తాజా చిత్రంలో బాలకృష్ణ

శిల్పం, సలీం నృత్యాలు, చలసాని రామారావు కనకేశ్వరరావు సంయుక్త దర్శకత్వం, మాధవరావు ప్రొడక్షన్, సుందరరాజా సహకార దర్శకత్వం, వేమూరి రవి కూర్పు నిర్వహిస్తున్నారు.

## శివదుర్గ కంబైన్స్ చిత్రం

"అలనాటి సుప్రసిద్ధ నటి, నిర్మాత కృష్ణవేణిగారి మనుమరాలు శిరీషని పరిచయం చేస్తున్నాం. డైరెక్టర్‌గా కె. ప్రత్యగాత్మ, తాతినేని ప్రకాశరావు, కె. వాసు, తాతినేని ప్రసాద్, కోడి రామకృష్ణగార్ల వద్ద శిష్యరికంచేసిన ఎస్. ఎస్. రెడ్డిని పరిచయం చేస్తున్నాం. మలయాళంలో సూపర్‌హిట్ అయి, తమిళం, హిందీ భాషల్లో కూడా తయారుకానున్న 'నాడోడి కాట్టు' చిత్రం ఆధారంగా ఫిబ్రవరి 1 నుంచి షూటింగ్" అన్నారు కె. సత్యం. ఈయన కూర్పు, సారధ్యంలో జి. గోవిందరాయులు. పి. సత్యం నిర్మించే శివదుర్గ కంబైన్స్ చిత్రంలో భానుచందర్, సుహాసిని, చంద్రమోహన్, శిరీష, నూతన్‌ప్రసాద్, కోట శ్రీనివాసరావు, పద్మనాభం, ప్రతాపరాజు, ఉసిలైమణి, చిడతల అప్పారావు, జుట్టు నరసింహం, కెప్టెన్ రాజు, వై. విజయ, అనిత, డబ్బింగ్ జానకి వగైరా నటవర్గం. పూసల సంభాషణల కర్త. ఆత్రేయ, సి. నారాయణరెడ్డి గీతాలను కృష్ణ – చక్ర స్వరపరిచారు. ఎ. సురేష్ ఛాయ, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు. సాహుల్ సాహసాలు, పైడిబాబు, సుబ్రహ్మణ్యం సహకార దర్శకత్వం, ఎ. మదనమోహనరావు నిర్వహణతో ఆర్. సి. దొరై ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్.

---



సతీ సహగమనం సీనులో సహజంగా నటిద్దామని కాస్త ఒళ్ళు కాల్చుకున్నాను మమ్మీ!!

## నాట్య భారతి శ్రీమతి ఉమాభారతి

కూచిపూడి భరత నాట్యంలో అసమాన ప్రావీణ్యాన్ని సంపాదించి, దేశంలో ఎంతో కీర్తిని సంపాదించి, దక్షిణాఫ్రికా, మారిషస్, మలేసియా మొదలైన దేశాలలో పర్యటించి అమెరికాలో వాషింగ్టన్, హారిస్‌బర్గ్‌లలో నాట్య ప్రదర్శనల ద్వారా హిందూదేవాలయాలకు నిధులను సేకరించిన నాట్య భారతి శ్రీమతి ఉమాభారతికి విదేశాలలో తెలుగు వారి సేవా కేంద్రం, ఓం ఇంటర్నేషనల్ కల్చరల్ సెంటర్, జంటనగరాల సాంస్కృతిక సంఘాలు యిటీవల హైదరాబాదులోని ప్రెస్‌క్లబ్‌లో సన్మానం చేసాయి. సభకు ప్రముఖ సినీ నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు అధ్యక్షత వహించి చి. ఉమాభారతి రూపొందించిన భారతీయ శాస్త్రీయ నృత్యాల కాసెట్‌ను ఆవిష్కరించారు. హైకోర్టు న్యాయ మూర్తి శ్రీమతి కె. అమరేశ్వరి శ్రీమతి ఉమాభారతికి దుశ్శాలువ కప్పి సత్కరించారు. ఉమ యిప్పుడు అమెరికాలోని హూస్టన్‌లో "అర్చన డాన్స్ అకాడమీని" నెలకొల్పి ఎంతో మందికి కూచిపూడి నాట్యంలో శిక్షణ యిస్తున్నారు.



శ్రీమతి ఉమాభారతి నృత్య కాసెట్‌ని ఆవిష్కరిస్తున్న డా. అక్కినేని నాగేశ్వరరావు

సాహస్ సాహసాలు, డి. వెంకటరత్నం కూర్పుతో శరత్ దర్శకుడు.

## చిరంజీవి, కోదండరామిరెడ్డిలతో కె. ఎస్. రామారావు చిత్రం "మరణ మృదంగం"

"ఫిబ్రవరిలో ప్రారంభోత్సవం. ఎక్కువగా ఢిల్లీ జైపూర్, ఉదయపూర్, ఆగ్రా, విశాఖపట్నంలో షూటింగ్ ప్లాన్ చేశాం. మేలో ముగించి, జూన్‌లో విడుదల చేస్తున్నాం" అన్నారు క్రియేటివ్ కమర్షియల్స్ కె. ఎస్. రామారావు. ఈయన గతంలో కోదండరామిరెడ్డి, చిరంజీవి కాంబినేషన్‌లో "అభిలాష, రాక్షసుడు, ఛాలెంజ్" లాంటి యండమూరి నవలలను తెర కెక్కించారు. నాలుగో సూపర్‌హిట్ "మరణ మృదంగం". సినిమా స్కోప్‌లో తయారయ్యే ఈ చిత్రానికి సాయినాథ్ మాటలు, ఇళయరాజా సంగీతం, లోక్‌సింగ్ ఛాయ నిర్వహిస్తారు.

## "ప్రేమకిరీటం"లో వేలు వృత్తాంతం

అభిలాష్ (కల్యాణచక్రవర్తి), రాధిక (ఖుష్బూ), రంజిత (అశ్విని) డైనింగ్‌టేబుల్ ముందు కూర్చున్నారు. ప్రేమమాలిని (శ్రీలక్ష్మి) ఫలహారం వడ్డిస్తోంది. వేలు తన కా పేరు ఎలా వచ్చిందో చెప్పసాగాడు. "నా పేరు వేలు కాబట్టి నేనో అరవ్వాడినని మీరనుకుంటారు. కాని, నా కా పేరు ఎలా వచ్చిందో తమకి చెప్పాలికదండీ?"

ప్రేమమాలిని విసుక్కుంటూ "నిన్నెవరూ అడగ లేదులే. టిఫిన్ తినేటప్పుడు అనవసరంగా సుత్తివెయ్యకు" అంది.

## ఎ. ఎన్. ఆర్., రమేష్‌బాబులతో రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ చిత్రం

"న్యాయాన్ని పరిరక్షించే ఎస్. పి. చంద్రశేఖర్‌గా అక్కినేనిగారు, ముల్లును ముల్లుతోనే తీయాలని నమ్మే రౌడీగా రమేష్‌బాబు విలక్షణమైన పాత్రలు ధరిస్తున్నారు. రమేష్ సరసన తొలిసారి రజని నటిస్తోంది. చాలాకాలం తర్వాత అక్కినేనిగారి సరసన బి. సరోజాదేవి నటించడం మరో విశేషం. డిసెంబర్ 28 నుంచి జనవరి 10 వరకు జరిగిన మూడో షెడ్యూల్‌తో టాకీ భాగం పూర్తయింది. ఫిబ్రవరిలో సాంగ్స్ పిక్చరైజ్ చేసి, మార్చి నెలాఖరుకు రిలీజ్ చేయాలనుకుంటున్నాం" అన్నారు రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ అధినేత మిద్దే రామారావు. ఈయన చిత్రంలో , నూతన్‌ప్రసాద్, కోట శ్రీనివాసరావు, గొల్లపూడి, ప్రదీప్‌శక్తి, వేలు, వీరభద్రరావు, శ్రీలక్ష్మి ఇతర పాత్రధారులు. ఈ సంస్థకు "పండంటి జీవితం, ప్రేమమూర్తులు" జాడీ చిత్రాల అనంతరం భీశెట్టి లక్ష్మణరావు సమకూర్చిన రసవత్తరమైన కథకు సత్యానంద్ సంభాషణలకర్త. చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు. ఎస్. సుధాకరరెడ్డి ఛాయ, శాయికుమార్ శిల్పం, వై. కాశీ

## సినిమా

విశ్వనాథ్ సంయుక్త దర్శకత్వం, సలీం నృత్యాలు, ఎన్. వెంకటేశ్వరరావు- ఉదయ్- బాబ్జీ ప్రొడక్షన్.

"స్వర్ణకమలం"లో వెంకటేష్, భానుప్రియ



# మంజీర నాదం

(గత సంచిక తరువాయి)

అరవింద్ సింగ్ గొంతు పట్టుకుని వదలడంలేదు.

జరిగిందంతా ఇతని మూలానే అన్న విషయం కళ్ళముందు నిల్చి, అరవింద్‌కి పిచ్చి బలాన్నిచ్చింది.

అతని పట్టునించి తప్పించుకోవాలని సింగ్ ప్రయత్నిస్తూనే వున్నాడు.

అలా ఇద్దరి మధ్యా కొంతసేపు పెనుగులాట జరిగింది. ఓపిక నశించిన సింగ్.... "జయా!" అన్నాడు అరిచినట్టు.

పెరట్లో వున్న జయదేవ్ అతని అరుపుకి పరిగెత్తుకొచ్చాడక్కడకి. అక్కడి దృశ్యం చూసి కొయ్యబారి పోయాడు. తేరుకుని గభాల్న అరవింద్ చేతుల్లోంచి సింగ్‌ని తప్పిస్తూ–

"అరవింద్! ఏవిటిది! నీకేమైనా మతిపోయిందా! ఒదులతన్ని" అన్నాడు మందలింపుగా.

అరవింద్ జయదేవ్‌ని చూశాడు.

"ఓ! మీరూ వచ్చారా సర్! కానీ చాలా ఆలస్యంగా వచ్చారు. వీడు... ఈ సింగ్‌గాడు మనకాంతిని ...." అతని గొంతులో దుఃఖం గరగరలాడింది.

"కాంతిని?" అర్థంకానట్టు చూశాడు జయదేవ్.

"వాణ్ణి అడగండి!" మళ్ళీ సింగ్‌గొంతు పట్టుకోబోయాడు అరవింద్. జయదేవ్ బలవంతంగా సింగ్‌ని ఇవతలికి తీసుకొచ్చాడు.

"జయా! ఏ విటిది! ఏవైనా మెంటల్ కేసా?" మెడని చేత్తో రాసుకుంటూ అన్నాడు సింగ్.

> జరిగిన కథ-24 : అరవింద్, కాంతి, భట్టు అడవిలోంచి వెళ్ళిపోవడానికి నిశ్చయించుకుంటారు చివరి క్షణంలో ఏటిలో దిగిన కాంతిని మొసలి పట్టుకుంటుంది. మొసలి నుంచి తప్పించి కొండజాతి వాళ్ళు ఎత్తుకు పోతారు. కాంతిని నిర్బంధించిన వాళ్ళ నాయకుడు తనను పెళ్ళి చేసుకొమ్మని కోరుతాడు. ఆ నాయకుడు సింగేనని అరవింద్ గుర్తిస్తాడు పెళ్ళి సందర్భంగా తప్పించుకునే ప్రయత్నంలో కాంతి లోయలో పడి చనిపోతుంది. భట్టు చనిపోతాడు. అరవింద్ కాలు, చెయ్యి పోగొట్టుకుంటాడు పగ తీర్చుకోవాలని వేచి ఉంటాడు.

"ఛ! ఛ! అదేంకాదు! ఏదో కలగన్నట్టున్నాడు."

"కలాకాదు, పాడూకాదు! ఇతన్ని చూస్తుంటే నాకేదో అనుమానంగా వుంది మనకాంతికి తగ్గ వ్యక్తిలా అనిపించడం లేదు." అన్నాడు సింగ్.

"లేదు ఉదయ్! అరవింద్ చాలా మంచివాడు. తెలివిగలవాడు. కాకపోతే ఇతనికి ఎడ్వంచర్స్ అంటే ఇష్టం. మొన్నామధ్య భాను గుహదగ్గర ట్రైన్ ఆగిపోతే అడవిలో కెళ్ళి కొన్ని ఇన్‌ఫర్మేషన్స్ తీసుకొచ్చాడు. అప్పట్నించీ ఆ అడవి గురించీ, నిధి నిక్షేపాల గురించి ఆలోచిస్తున్నట్టున్నాడు. ఇదిగో ఇప్పుడు బ్రహ్మాండమైన కలలు కనేస్తున్నాడు" నవ్వుతూ అన్నాడు జయదేవ్

"అమ్మయ్య! అంతేకదా! నేను నిజంగానే మెంటల్‌కేసనుకున్నాను." సింగ్ కూడా నవ్వాడు.

"అదిసరే! నువ్వీగదిలో కెందుకొచ్చావ్?" అన్నాడు జయదేవ్.

"బుద్ధిలేక! ఏదో మనకాంతమ్మ తల్లికి సంబంధం కుదిరింది! అతగాడో మన్మధుడు, సూర్యుడు చంద్రుడు అంటూ వూదర కొట్టేశావుగా! అందుకే ఆసుందర విగ్రహాన్ని ఒక్కసారి చూసి తరిద్దామని వచ్చాను!

గాఢనిద్రలో వున్నాడు. కుతూహలంగా చూస్తున్నాను. ఏదో కల వరించినట్టయి కాస్త దగ్గరగా వెళ్ళాను. అంతే! అతగాడి చేతిలో చిక్కాను! నయం! కాస్తుంటే నా పనయి పోయేదే!" అన్నాడు సింగ్ నవ్వుతూనే.

"అయామ్ సారీ ఉదయ్! పొరపాటు జరిగి పోయింది." మెల్లగా అన్నాడు జయదేవ్.

"ఛ! దాందేం వుందిలే!"..

అయోమయంగా చూస్తున్నాడు అరవింద్ అతనింకా వాస్తవంలోకి రాలేదు.

"అదికాదు సర్!ఇతనే మన కాంతిని..... అంటూ ఏదో అనబోయాడు.

"అరవింద్! నీ మనసు బాగాలేదు. కాస్సేపు రెస్ట్ తీసుకో!" అనేసి సింగ్ చెయ్యి పట్టుకుని ఇవతలికి తీసుకొచ్చాడు జయదేవ్.

ఇద్దరూ హాల్లోకొచ్చి కూర్చున్నారు. అరవింద్ ప్రవర్తన వింతగానూ, కొత్తగానూ అనిపించింది జయదేవ్‌కి.

"ఉదయ్ బాధపడుతున్నావా?" అన్నాడు మెల్లగా.

"ఛ! ఛ! ఇందులో బాధపడ్డానికేం వుంది జయా! అయినా నీకోసంగతి

తెలుసా!" నవ్వుతూ అన్నాడు సింగ్.

"ఏమిటి?"

"మీ అల్లుణ్ణి ఇంతకు ముందే చూశాను!"

"నిజమా?..... అయితే మంచిట్రిమ్‌లో చూశ్వదేమో! లేక పోతే కలలుకంటూ మధ్య నీ గొంతు పట్టుకోవడం ఏమిటి?" దిగులుగా అన్నాడు జయదేవ్.

"దానికీ ఓ కారణం వుంది!"

"ఏమిటి?"

"భానుగుహ దగ్గర ట్రైన్ ఆగినప్పుడు ఆ ట్రైన్‌లో అతనున్న కంపార్ట్‌మెంటు లో నే నేనూ వున్నాను.

"ఓ! పోనీ అలా అనుకున్నా నీ మీద అంత కోపం ఎందుకు?" కుతూహలంగా అడిగాడు జయదేవ్

"దానికీ కారణం వుంది!"



"ఏమిటది?"

"ట్రైన్ ఆగినప్పుడు అతన్ని అడివిలోకి వెళ్ళొద్దన్నాను అంతకుముందు కూడా ఒకటి రెండు సార్లు అతని మాటల్ని ఖండించాను. మంచిగానో, చెడుగానో నారూపం అతన్ని బాగా ఆకర్షించినట్టుంది. ఇంకేంవుంది! నా మీద ద్వేషం పెంచుకుని, తనకలలో నన్నో విలన్‌లా చేసేసినట్టున్నాడు". తను వూహించిందంతా చెప్పాడుసింగ్.

'నిజమా?" తెల్లబోయాడు జయదేవ్

తర్వాత వాళ్ళిద్దరూ గొంతు తగ్గించి మాట్లాడుకున్నారు

అరవింద్ అయోమయావస్థలో పడి పోయాడు

# రచయిత్రి జవాబులు



నాగండ్ల వెంకటేశ్వర్రావు, అమ్మాపాలెం

ప్ర 1. రచయిత్రి గారూ! ఉత్తమ సాహిత్యం ఎలా వుండా లంటారు?

2 సామాజిక స్పృహ వున్న నవలలు ఏమైనా రాశారా?

జ 1 సాహిత్యపు విలువలు పడిపోకుండా, చదివేశాక కూడా మరోసారి మనస్ఫూర్తిగా ఆలోచింప చేసేదే ఉత్తమ సాహిత్యం నా వుద్దేశంలో

2 కానుక, పరాధీన, కరిగిన శిల లాంటివి చాలా నవల్స్ వున్నాయి

ఎమ్ ఎన్ అనంతరామన్, బెంగుళూరు

ప్ర నాటక లక్షణాలైన నాంది ప్రస్తావన విష్కంభాదులను, అవసరమైనప్పుడు స్వగతాలను, పోషించడంలోను పాఠకులకు విభావాను భావాలను కలిగించి రసానందాన్ని అందించే ప్రయత్నంలోనూ నవలా రచయిత (తు) లెందరు కృషి చేసి కృత కృత్యులయ్యారు.

జ నాటకం వేరు నవల వేరు.. నాటకాలు రాసేవారు నవలలు రాయలేరేమోగానీ, నవలలు రాసేవారంతా నాటకాలు రాసి మెప్పించలేరు నవలలతో పాటు నాటకాలు రాసి, ప్రేక్షకుల్ని, పాఠకుల్ని మెప్పించిన వాళ్ళెందరో వున్నారు ఒకటి మాత్రం నిజం. నాటక రచనలు చేసేవారిలో పురుషలే ఎక్కువ తమ కలంలోంచి, నాటకాలకి జీవం పోసి చిరస్థాయిగా పాఠకుల, ప్రేక్షకుల మనస్సుల్లో నిల్చిపోయిన, నిల్చిపోతున్న వారెందరో!

కె. లలిత, పరిగి

ప్ర: ప్రతి రచయిత (త్రి) అందమైన వారినే హీరో, హీరోయిన్‌లుగా వ్రాయడంలో కారణం?

జ: సాధారణంగా హీరో హీరోయిన్లంటే అందగాళ్ళు, తెలివి గలవాళ్ళు, మంచివాళ్ళుగా మన కళ్ళముందు మెదులుతారు ఎవరైనా అందంగా వున్న వాళ్ళని చూడగానే

"అబ్బ! హీరోలా వున్నాడు" అనో "ఆమె ఎంత బావుందో! ఇప్పటి హీరోయిన్లంతా బలాదూరే" అనడం మీరు విన్లేదూ?

సి హెచ్ పద్మ, అజ్జమూర్

ప్ర. సువర్ణా పిన్నిగారూ "మంజీరనాదం" వూహించి రాస్తున్నారా, లేక ఏదైనా జరిగిు సంఘటనలు ఆధారంగానే తీసుకుని రాస్తున్నారా?

జ. నూటికి నూరుపాళ్ళు నా వూహే పద్మా! ఈ ప్రశ్నకి ఇప్పటికే చాలాసార్లు జవాబు చెప్పాను. దయచేసి ఇంక ఎవరూ అడగద్దు

శ్రీపాద శ్రీనివాస్, బొబ్బిలి

ప్ర: సమాజానికి పనికొచ్చే నవలలు రాయాలనుకున్న రచయితలకు డబ్బు ఆశ చూపించి, సెక్స్, హారర్ నవలలు రాయించుకుంటున్న పత్రికా సంపాదకులపై మీ అభిప్రాయం నిర్మొహమాటంగా చెప్పగలరా?

జ ఏ ఎండకా గొడుగు పడుతున్నవాళ్ళు అనాలి అయినా అలాంటి రచనలు మీరు చదవకండి అప్పుడు వాళ్ళు కూడా మీకు మంచి నవలలందించడానికి ప్రయత్నిస్తారు

రాయసం వెంకటలక్ష్మి, భీమవరం

ప్ర : మీ రచనల ద్వారా సమాజానికి ఏమి అందివ్వాలనుకుంటున్నారు?

జ మీరు చదివి ఏం అందుకుంటున్నారు?

పక్కి వినులాంబ పాలకంద్యాం

ప్ర. (1) చాలామంది వుత్తమ నవలలు, కన్నీటి గాధలు చదివి కూడా మారడం లేదు. మరి వాళ్ళు చదివి సాధించిందేమిటి? వాళ్ళ చదువు వృధా అంటానక్కా మరి నువ్వేమంటావు?

## మంజీరనాదం

"అరవింద్!" ఓ స్వరం మధురంగా పిల్చింది

తృళ్ళిపడి లేచికూర్చున్నాడతను.

మరోసారి పిల్చిందాస్వరం.

ఆ గొంతు గుర్తించిన అరవింద్ హృదయం ఆనందంతో చిందులు వేసింది

ఆ పిలుపు కాంతి మధురమైన పిలుపు!




"కాంతీ!" అన్నాడతను ఆశ్చర్యంగా

"ఆఁ. ఏవిఁటి హడావిడి చేస్తున్నావ్?" నవ్వుతూ అంది కాంతి.

"కాంతీ! నువ్వు. నువ్వు. " నమ్మలేనట్టు అన్నాడతను

"అయ్యో మహానుభావా! తమరింకా నిద్రావస్థలోనే వున్నారా? నేను నేనే! మీరు మీరే! ముందు లేవండిసర్! మీకోసం బెడ్‌కాఫీ స్వయంగా తెచ్చాను" గోముగా అంది కాంతి

చటుక్కున కాలూ చెయ్యి చూసుకున్నాడతను అవి నిక్షేపంలా వున్నాయి.

ఓసారి కాలూ చెయ్యీ విదిలించాడు.

"అరవింద్! ఏవిఁటది?" కంగారుగా అంది కాంతి

"నా కాలూ చెయ్యి!" ఆనందంగా అన్నాడతను.

"కొంపతీసి అంకులన్నట్టు నీకు పిచ్చిగాని పట్టలేదు కదా!" అతని ప్రవర్తనకి హడిలిపోతూ అంది కాంతి

"అంకులా?" కళ్ళు చిట్లించాడు అరవింద్

"అవును! మా అంకులన్నారు! నీకు మతిపోయిందని"

"అంకులెవరు?"

"అబ్బబ్బ! అంకులంటే ఉదయసింగ్ అంకుల్. ఇందాక నువ్వు ఎంచక్క గొంతు పట్టుకుని ముద్దుగా నులమ బోయావ్ చూడు ఆయన!" అంది కాంతి.

"ఆయన మీ అంకులా?" తెల్లబోయాడతను.

"అవును! ఆయన డేడీకి డియరెస్ట్ ఫ్రెండ్! కసరత్తు చేసిన శరీరం,

(2) రాజా పాంధూళ్ళాంటి తండ్రులు మారితే సంతోషిస్తావా, విచారిస్తావా?

జ: (1) నవలలు చదివినంత మాత్రానే మారిపోతే ఇంక లేందేం వుందమ్మా!... ఈ మధ్య మంచి రచనలు చదివి అవతల పడేసిన, సమాజాన్ని పాడు చేసే రచనల్ని మాత్రం పాఠ్య గ్రంథాల్లా చూసుకుంటున్నారు కొందరు (2) మీ ప్రశ్న చాలా అసూయకంగా వుంది పాంధూలాంటి వారు పూరితే ఆనందిస్తానో విచారిస్తానో నా రచనలు చదివినా అర్థం కాలేదా నీకు?

ఎ. రామారావు, ఖమ్మం

ప్ర: మీ ఇంటికొస్తే మాతో మాట్లాడతారా! లేక మొహం చాటేస్తారా?

జ అలా కనిపిస్తున్నానా మీకు? తప్పకుండా రండి.

షేక్ సుభాని, బాపట్ల

ప్ర 1 నేడు ధనవంతులకీ, బీదలకీ మధ్య పెరిగి పోతున్న అంతరాలను చూస్తే మీకేమనిపిస్తుంది? 2 మీ ప్రియమైన నాయకుడెవరు?

జ 1. పెద్దమనుషులుగా అనుకునేవాళ్ళూ, ఈ రాజకీయనాయకులు సోషలిజం, సోషలిజం అంటూ వేదికలెక్కి అరవడం మాని, నిజమైన సోషలిజానికి బాటవేస్తే బావుండు" అనిపిస్తుంది 2 సుభాష్‌చంద్రబోస్

ఎస్. ఎస్. ఆర్. గిరి, మద్రాస్.

ప్ర సువర్ణాకన్నన్‌గారూ! మీకు జ్ఞానపీఠ అవార్డ్ వస్తే...

జ జ్ఞానపీఠ అవార్డ్ గురించి మీకు పూర్తిగా తెలుసా గిరీ?

## ఉత్తమ ప్రశ్న

**బి. శ్రీనివాసరావు, చినపాలెం**

ప్ర: వరకట్నంమీద చిన్నప్పట్నుంచీ పెంచుకున్న అయిష్టతవల్ల కట్నం తీసుకోనంటే అవతలివారు చులకనగానూ, అనుమానాస్పదంగానూ చూస్తున్నారు. పరిచయస్తులు (రచయితలతో సహా) "కట్నం తీసుకోనడం ఓ గొప్ప" అంటూ తప్పుతోవ పట్టిస్తున్నారు. ఇది ఓ సమస్యగా పరిణమించింది. దీనికి పరిష్కారం?

**జ: మీకు వరకట్నంమీద అయిష్టతవుంటే ఎవరో ఏదో అన్నారని, అంటున్నారని పట్టించుకోవద్దు. తప్పుడుదారంట నడిపిస్తున్నారని తెలిసి ఎందుకు తప్పుడు దారంట నడవాలి? వరకట్నాన్ని మీరు నిజంగానే హేట్‌చేస్తే – మిమ్మల్ని చూసి మరికొందరు యువకులు కూడా మారచ్చు.**

ఆలూరు పరిపూర్ణశర్మ, బొలారంబజార్ (సికింద్రాబాద్)

ప్ర మంజీరనాదం చాలా బావుంది ఇప్పటి కాంతీ పూర్వజన్మలోని చందన అంటారేమో అని కాస్త భయంవేసింది కానీ అలా కాదని తెలిసింది ప్రేమికుల కథ యింకా ముగియలేదని కూడా అనిపించింది నా వూహ నిజమా? కాదా?

జ మంజీరనాదం నచ్చినందుకు థాంక్స్ అడవిలోని ప్రేమికులు (రసన్, చందనలు) చనిపోయారుగా! యింకా వాళ్ళ కథేం వుంటుంది. ఇంక వున్నది మన అరవింద, కాంతిల కథే.

పి శ్రీనివాసులరెడ్డి, రామేశ్వరం.

ప్ర సువర్ణాకన్నన్‌గారూ! కేవలం లాభాపేక్షే కాకుండా "యిది నా కర్తవ్యం దీనిని నేను మనస్ఫూర్తిగా చెయ్యాలి" అని ప్రతి ఒక్కరు అనుకునేరోజు ఒస్తుందంటారా?

జ తప్పకుండా ఒస్తుంది అందరూ అలా అనుకుంటే! ముందుగా మీరు ప్రారంభించండి.

సాగరఘోష్, ద్రాక్షారామం

ప్ర. మంచి రచనలు చేయాలని రచయిత (త్రు)లు, మంచి రచనలు ప్రచురించాలని ఎడిటర్లు, మంచి రచనలు చదవాలని పాఠకులు అనుకుంటారు. కానీ "పుస్తకాలు చదివి పిల్లలు పాడయిపోతున్నారు" అంటున్నారు పెద్దలు. నేటి యువత చదివి పాడయిపోయేటటువంటి రచనలు ప్రచురిత మవడానికి కారకులెవరు?

జ. మీరన్న మంచి రచనల్ని కాపాడే రచయిత (త్రు)లు, ఎడిటర్లు పాఠకులు చాలామంది వున్నారు. అయితే ప్రస్తుత ధోరణి మారింది మంచి సాహిత్యానికి ఆదరణ కాస్త తగ్గింది. ఎలాంటి సినిమాలు బాగాపోతాయో గమనించి సినిమాలు తీస్తున్నట్టే ఎలాంటి రచనలకి ఆదరణ లభిస్తుందో సర్వే చేసి రచనల్లో మార్పు తెస్తున్నాను రచయిత (త్రు)లు ఎడిటర్లు. అంటే పాఠకుల అభిరుచి మేరకు కొంత మారుతున్నారన్న మాట! (ఇలా అన్నానని లోగడ ఓ పాఠకుడు నన్ను కోప్పడ్డారు. మళ్ళీ కోపడతారేమో!)

---

చెయ్యొత్తు మనిషి! .. అన్నింటికీ మించిన దేవిటో తెలుసా? ఆయన పెద్ద పోలీసాఫీసర్!"

"నిజమా?" నిర్ఘాంత పోయాడు అరవింద్

"అవున్నాయనా! ఆయన పూరుకున్నారు కాబట్టి సరిపోయింది లేకపోతే నిన్నో చూపు చూసేవారు కాస్త విసుగ్గా అంది కాంతి.

"అవునుసర్ ఆయనకి ఏవో అర్జంట్ పన్నున్నా వెళ్ళకుండా మీరు నిద్ర లేచే దాకా వున్నారు ఎందుకో తెలుసా? కాంతమ్మగారి కాబోయే వరుడు ఎలా వుంటాడో చూడాలని! లేక పోతే రాత్రె వెళ్ళి పోయేవారు" గడగడా చెప్పాడు భట్టు

"భట్టూ!..." ఆశ్చర్యంగా చూశాడు అరవింద్.

"ఏవిటిసర్?" నవ్వుతూ చూశాడతను

అప్పటికి పూర్తిగా అర్థం అయింది అరవింద్‌కి తెగసిగ్గుపడి పోయాడు

'వస్తానుసర్! పెరట్లో బోలెడు పన్నుండి పోయాయి" అంటూ వెళ్ళిపోయాడు భట్టు

జరిగిందంతా కేవలం కలే అనీ, కాంతీ, భట్టూ హాయిగా వున్నారనీ గ్రహించిన అరవింద్ మనసు మధురాతి మధురంగా అయిపోయింది

లేవబోయిన వాడల్లా అలా మళ్ళీ వాలి పోయాడు

"ఏయ్! మళ్ళీ పడుకున్నావా?. ఈసారి ఏం కలలుకంటావ్?" అల్లరిగా అంది కాంతి

"మధురమైన కలలు" నవ్వాడతను.

సంతోషించాం గానీ ముందులే! అవతల అంకుల్ వాళ్ళు ఎదురు చూస్తున్నారు" అరిచిందికాంతి

అతను లేవలేదు

ఆమె దబాయించింది.



"కాంతి! ఇపు 'ఘ టయిమెంతయింది?" దీపపు కాంతిలో తన కాంతిని ఆరాధనగా చూసుకుంటు అన్నాడు అరవింద్

ఉదయం అయిపోయింది!'

'అది తెలుసులే! టైమెంతయిందో చెప్పు!"

"చేతికి వాచ్ వుందిగా చూసుకో

"నా చేతివాచ్ ఎందుకో ఆగి పోయింది!"

"అయితే విను అయిదు గంటలయింది!" వాచ్ చూసుకుంటూ అంది కాంతి.

"ఏవిఁటి?"

"అయిదు గంటలు!'

"ఆ?"

"చెవుఁడా? అయిదు గంటలయింది!"

"ప్చ్! వినిపించడం లేదు డియర్!"

"ఏయ్!"

"పోనీ నీ చేతి వాచ్ చూపించు"

"అయితే చూడు!" విసురుగా దగ్గరికొచ్చి వాచ్ వున్న చేతిని ముందుకు చాచింది కాంతి

అంతే!

చటుక్కున అతనిమీద పడిపోయింది. అతని చేతులు ఆమెని అల్లుకున్నాయి ఆర్తిగా గుండెకి హత్తుకున్నాయి.

"ఏయ్! ఏవిఁటిది?" అంది లేవబోతూ.

అతని చేష్టలకి ఎక్కళ్ళేని సిగ్గూ ముంచుకొచ్చింది కాంతికి. అయితే అతను ఒదల్లేదు

ఆమె పెదవుల మీద తన పెదవులుంచి తియ్యని ముద్ర వేశాడు.

"ఛ! ఛ! ఏవిఁటిది!" సిగ్గుతో ఆమె చెంపలు కంది పోయాయి. అతను అల్లరిగా నవ్వాడు

"గొప్పే!' మూతి తిప్పింది కాంతి.

అతని చేతులు మరింత అల్లుకుపోయాయి ఆమె చుట్టూ. కంగారుగా చూసిందామె.

"ఒదులు!.... ఎవరైనా వస్తారు" అంది.

"ఎవరైనా రాకపోతే?"

"ఛ! ఛ! సిగ్గులేదు!"

"సిగ్గుని అడివిలో వదిలేసొచ్చాను?"



"అడవిలో నా?"

"ఊఁ! రాత్రి కల్లోలే!. అవునూ. సిగ్గు అంటే నీకు తెలీదనుకుంటా... ఇప్పుడేవిటి?" ఓరగా చూస్తూ అన్నాడతను.

"ఏం చెయ్యను? మునుపు నీకు సిగ్గుండేది. నాకు లేదు ఇప్పుడు నీదగ్గరి సిగ్గు నా దగ్గరి కొచ్చేసింది" సీరియస్‌గా అంది కాంతి.

అతను నవ్వాడు.

ఆమే నవ్వింది.

"కాంతీ!" మెల్లగా అన్నాడు అరవింద్ ఆమెని మరింత హత్తుకుంటూ.

"ఊఁ"! సిగ్గుగా పలికిందామె గొంతు.

"ఎంతో హాయిగా వుందికదూ?"

"ఊఁ!"

"కాలం ఇలాగే నిల్చిపోతే ఎంత బావుండు!"

"అవును!"

"కాంతీ!" మృదువుగా పిల్చాడతను.

"ఏవిఁటరవింద్?" అతని ముంగురులతో ఆడుకుంటూ అంది కాంతి.

అతను ఆమె కళ్ళల్లోకి ఆరాధనగా చూశాడు.

ఆమె కళ్ళు వాలిపోయాయి.

ఆమె చెంపల్లోని గులాబీలని తన్మయత్వంగా చూశాడతను.

"విషయం చెప్పలేదు!" గుర్తు చేసింది కాంతి

"ప్రేమ ఎంతో తియ్యనిది కదూ?"

"అవును మధురాతి మధురమైంది"!

"అన్ని ప్రేమల్లోకి....."

"అమ్మ ప్రేమ గొప్పది!" కాంతి గొంతు ఒణికింది.

కాంతి బాధ అర్థమయిందతనికి.

ఆమె మనసు మరో వైపుకి మళ్ళించాలనుకుని.

"ఉఁహూఁ! నాకు మాత్రం ప్రేమికుల ప్రేమ.... అయ్ మీన్ మన ప్రేమే గొప్పది" అన్నాడు గోముగా.

అతనన్న తీరుకి ఆమె పక్కున నవ్వేసింది.

"మరి ఈ ప్రేమ సామ్రాజ్యానికి రారాజు.. మన్మధుడు మరి అతనికి మనం కృతజ్ఞతలు తెలుపుకోవద్దూ?' అంది.

"కృతజ్ఞతలా. . ఎందుకు?" అమాయకంగా అన్నాడతను.

"ఎందుకా! ఎన్నిసార్లు కవ్వించినా ప్రవరాఖ్యుడిలా ముడుచుకుపోయే ఈ దొరగారు... కోరి నన్ను కౌగిల్లోకి తీసుకుని ప్రేమపాఠాలు ప్రారంభించారంటే అది ఆ మన్మధుడి మహిమకాదూ? అందుకే అతనికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి" చిలిపిగా అంది కాంతి.

అతను పకపక నవ్వేశాడు.

"ఇంతకీ కృతజ్ఞతలు ఎలా చెప్పుకోవాలో అడగలేదు" సీరియస్‌గా అంది కాంతి

"ఎలా?"

"ప్రేమికుల పాలిట వరమైన ఓ మన్మధా! తియ్యని, వెచ్చని,కమ్మని ఈ కౌగిలిలోని మధురిమలు మాకు చవిచూపించినందుకు ఇవే మా కృతజ్ఞతాభి వందనములు!' నాటకీయంగా అంది

"అంతేనా?"

'ఇంకా వుంది"

"త్వరగా చెప్పెయ్యి!"

అతని చెవిని మునిపంటితో పట్టుకుని–

"థాంక్స్" అనాలిలా! అర్థ మయిందా?" అందామె అల్లరిగా

అంతే!

అరవింద్‌లోని చిలిపిదనం విశ్వరూపం దాల్చింది ఆమెని మరింత బలంగా

చుట్టేసి, పెదవులమీద, చెంపలమీద మెడమీదా నుదుటి మీదా ముద్దులతో ముంచెత్తుతూ ఆమెని వుక్కిరి బిక్కిరి చేసేశాడు.

"ష్! ఒదులు ఎవరైనా చూస్తే బావుండదు."వూపిరాడకుండా చేస్తున్న అతని పెదవుల్నించి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తూ అంది కాంతి.

అప్పుడే తలుపు మీద చిన్నగా తట్టారెవరో

తృళ్ళిపడి ఆమెని వదిలేశాడు అరవింద్.

ఆమె సిగ్గుగా దూరం జరిగి నిల్చుంది.

"అమ్మాయిగారూ! కాఫీ!" గుమ్మం బైట్నించే అరిచాడు భట్టు.

"తీసుకురా తాతా!" అన్నాడు అరవింద్.

"ఇదేం పిలుపు బాబూ కొత్తగా?" కాఫీ అందిస్తూ అన్నాడు భట్టు.

"అదీ ఓ కథేలే!... రాత్రికల్లో... ."

"మహానుభావా! నీకల్లో ఇంకా ఏవేఁవి చేశావో వరసగా చెప్పెయ్యి నాయనా!" అంది కాంతి.

"చెప్తాను!.. అదో పెద్ద సినిమా కథలా వుంటుంది" గర్వంగా అన్నాడు అరవింద్.

"అయితే నేనూ వింటానుసర్! అప్పుడే చెప్పకండి. పనంతా అయ్యాక వస్తాను!" హడావిడిగా కాఫీకప్పు అందుకుని వంటింట్లోకెళ్ళి పోయాడు భట్టు

ముసిముసిగా నవ్వుకున్నారు ప్రేమికులు.

* * * * * * * * *

అరవింద్ తన కలంతా విపులంగా చెప్పాడు అతనికల పూర్తిగా విన్న జయదేవ్, సింగ్, భట్టు పగలబడి నవ్వారు

"మరీ అన్యాయం అల్లుడూ!.. ఇంత పెద్ద పోలీసాఫీసర్ని పట్టుకుని మరీ ఘోరమైన సినిమా విలన్లా చేసేశావ్!" అన్నాడు భట్టు. అతను కాంతిని 'అమ్మాయ్' అంటాడు

"సారీసర్!" అన్నాడు అరవింద్.

"పరవాలేదు కలేగా?... కానీ... నిజజీవితంలో మాత్రం నన్నోవిలన్‌గా చూడకూ?" నవ్వుతూ అన్నాడు సింగ్

అంతా నవ్వారతని మాటకి

"నన్ను మాత్రం ఎంత అన్యాయంగా చంపేశారుసర్! కలేకదా.. ఎంచక్కా నన్నో యువకుణ్ణా, వాళ్ళందరితోనూ బ్రహ్మాండంగా స్టంట్ చేసినట్టు కలగనకూడదూ?" దిగులునటించాడు. భట్టు.

"నన్నుమాత్రం అన్ని ఏర్పాట్లూ సిద్ధం చేసుకుని బయల్దేర బోతుంటే ... అన్యాయంగా నన్ను కేంప్‌కి పంపించాడు తనతో రానీకుండా!" అన్నాడు జయదేవ్.

"ఈకథ అమ్మాయిగారు కూడా వినాల్సింది ఫ్రెండ్ ఫోన్ చేసిందని పరిగెత్తికెళ్ళారుగానీ ఇంత మంచికథ కావాలన్నా దొరకదు" అన్నాడు భట్టు.

"నిజం బావుంది కథ! సారీ! కల! అల్లుడూ ఓ పన్చెయ్యకూడదూ?" సీరియస్‌గా అన్నాడు సింగ్

"ఏవిఁటి సర్?'

'నువ్వు కథలు రాయడం మొదలుపెట్టు. త్వరలో ఓ మంచి రచయితవైపోతావ్!"

"నిజం సర్" అలా చెయ్యండి!" అన్నాడు భట్టు కూడా వుత్సాహంగా.

"అలాగే గానీ రేపు మాతోపాటు మీరు కూడా రండిసర్ భానుగుహ దగ్గరికి. ." సింగ్‌ని వుద్దేశించి అన్నాడు అరవింద్.

"అయ్యబాబోయ్!" గుండెల మీద చెయ్యుంచుకున్నాడతను.

మళ్ళీ అందరూ నవ్వారు

"ఏవిఁటీ అంతలా నవ్వేసుకుంటున్నారు?" అంటూ వచ్చింది కాంతి.

"అల్లుడుగారు తనకల చెప్పార్లే!" అన్నాడు సింగ్.

"అబ్బో! అంత నవ్వేలా వుందా ఆకల? అయినా నేను లేకుండా చెప్పాడేవిఁటి?"

"నువ్వు వింటే దడుసుకుంటావని!"

"ఏవిఁటి.... ఈయనగారి కొచ్చినకల వింటే నేను దడుసుకుంటానా! అంకుల్! నన్ను ఇన్సల్ట్ చేస్తున్నారు మీకు తెలుసా. రేపు భానుగుహ దగ్గరికి నేనుకూడా వెళ్తున్నాను" గర్వంగా అంది కాంతి.

"నువ్వా? భానుగుహకా?" కంగారుగా అన్నాడు అరవింద్.

"అదేవిఁటి కొత్తగా? మనం నలుగురం వెళ్ళామని మొదట్నించీ అనుకుంటున్నదేగా?" తెల్లబోయింది కాంతి.

"అప్పుడనుకున్నాం అనుకో! కానీ....."

"ఇప్పుడేవఁయిందిట?"

"రాత్రి కల....."

"అబ్బబ్బ! ఏవిఁటి అరవింద్! నీ కలకాదు గానీ నీతో పాటూ మాకూ మతి పోగొడుతున్నావ్! నీకలకీ, నా ప్రయాణానికీ ఏవిఁటి సంబంధం?" కాస్త విసుగ్గా అందికాంతి.

"చాలా వుంది "

అరవింద్ కేసి పరిశీలనగా చూసిందామె.

"అరవింద్! నీకు నిజంగానే ఏదో అయింది" అంది భయం భయంగా.

"అది కాదు కాంతీ...."

"అదంతా తర్వాత మాట్లాడు కుందాంగానీ ముందులే!" గంభీరంగా అంది కాంతి.

"ఎందుకు?" బిత్తర పోయాడతను.

"నిన్ను సైకియాట్రిస్ట్ దగ్గరికి తీసికెళ్ళక పోతే నీ పిచ్చి ముదరడం, నీదగ్గర్నించి మాక్కూడా కాస్త పిచ్చి ట్రాన్స్‌ఫర్ అవడం ఖాయం!"

# డాక్టర్ సలహాలు

డా. కె. వెంకటేశ్వరరావు



**ఆర్. ఆర్. – కడప**

నాకు 1981 సం. జ్వరం వచ్చి నప్పుడు, నర్సు ఇంజక్షన్ సీసా జారవిడిచి, క్రిందపడిన మందునే నాకు ఇంజక్ట్ చేసినది. నాకు భయంగా ఉన్నది. ఇది హానికరము కాదా!

కొన్ని సీసాలు క్రింద పడినా పగలవు. ఆసందర్భంలో ఇంజక్షన్ చెయ్యటం వల్ల ప్రమాదం ఉండదు. పగిలిన సీసా నుంచి మందు ఎక్కించటం జరుగదు. ఆరు సం. ల పాటు ఏమీ జరగనందున మీ భయం నిరర్థకం.

**యమ్. హెచ్. బి. – తిరుమల**

ఉబ్బసం ఉన్న వారికి టి. బి. వస్తుందా? ఒకవేళ వస్తే ఆ లక్షణాలు ఎలా ఉంటాయి?

ఉబ్బసం ఉన్న వారికి టి. బి. రాకూడదనే నియమం లేదు.

దగ్గు, కఫం నెలల తరబడి ఉండటం, రోజూ సాయం సమయాలలో జ్వరం తగిలినట్లుండటం, ఆకలిలేమి, శరీరం బరువు తగ్గుతూ రావటం, కొన్ని రోజుల తర్వాత కఫంలో నెత్తురు కనబడటం, ఛాతీ నెప్పి, అధికంగా చెమట మొదలయినవి ఊపిరితిత్తులలో టి. బి. ఉన్నప్పుడు కనబడే రోగ లక్షణాలలో ముఖ్యమైనవి.

ఈ లక్షణాలు ఉన్నవారు కఫ పరీక్ష, ఛాతీ ఎక్సరే, రక్త పరీక్ష మొదలయినవి చేయించి వైద్యులకి చూపించి రోగ నిర్ధారణ చేయించుకోవలసి ఉంటుంది.

**పి. వి. ఎల్. – మొగల్లు**

నాకు చేతి మీద స్పర్శలేని మచ్చ ఏర్పడినది. ఇది లెప్రసి అని భయపడుచున్నాను. లెప్రసికి ఎన్ని రోజులు ఏమందులు వాడాలి?

లెప్రొసీకి డాప్సోన్ (డి. డి. ఎస్.) మాత్రలు రోజుకి 100 మి. గ్రా. వంతున వరుసగా 3 సంవత్సరముల పాటు వాడవలసి వుంటుంది. ఈ కాలగడువు పరీక్షానంతరం వైద్యుల అంచనాను బట్టి వుంటుంది. ఈ గడువు మామూలు టైపుకి మాత్రమే. బార్డర్ లైన్ లేక లెప్రొమేటస్ టైపు ఉన్నప్పుడు ఈ గడువు ఇంకా అధికం అవుతుంది ప్రస్తుతం రీఫామైసిన్, లాంపిరిన్ మందులు వాడి ఈకాల పరిమితిని తగ్గించటానికి ప్రయత్నాలు చేస్తున్నారు.

**జి. యస్. – బళ్ళారి**

నా వయస్సు 23 సం. నాకు ఒకే వృషణము ఉన్నది. ఇంకొకటి అంగము పైన ఉన్నదనిపిస్తున్నది, ముట్టుకొంటే తగులుతుంది. ఇది ఆపరేషన్ చేసి క్రిందకు దింపవచ్చునా?

'అన్‌డిసెండెడ్ టెస్టిస్' అనబడే దీనిని ఆపరేషన్ వల్ల మామూలు చోటుకి చేర్చ వచ్చును.

# మంజీరనాదం

"ఛా! నీకన్నీ వేళాకోళాలే!" బుంగమూతి పెట్టాడు అరవింద్.

అంతా హాయిగా నవ్వేశారు

బిత్తర పోయింది కాంతి.

"ఏవిటి... నేనో మూలకంగారు పడుతుంటే?" అంది విసుగ్గా.

భట్టు, సింగ్, అరవింద్ చెప్పిన కల తాలూకు కథని మరింత భయంకరంగా వర్ణించి చెప్పారు.

కాంతి కూడా పకపకా నవ్వేసింది.

"కాంతీ! నీకు భయంగా లేదూ?" అన్నాడు అరవింద్.

"భయమా ఎందుకు?"

"అదే.... కల...."

"ఛ! డోంట్ బి సిల్లీ. కలలకీ, కథలికీ భయపడ్డానికి నేనేం పసిపిల్లనా? అవసరం అయితే నీకే ధైర్యం చెప్పగల ధైర్యం వుందినాకు" అందికాంతి.

"ఆహా! బయల్దేరింది. మహా! ఝాన్సీరాణి!" వెక్కిరించాడు అరవింద్.

"ఝాన్సీరాణిని కాదు. సాహసయువతి యమునని!.... అవకాశం వస్తే తెలుగు సినిమాల్లోని హీరోలా విలన్స్‌ని చెండాడేస్తాను!" గర్వంగా అంది కాంతి.

మరోసారి నవ్వేశారంతా.

"ఇంతకీ మన ప్రయాణం ఎప్పుడు సర్?" అన్నాడు అరవింద్ జయదేవ్‌తో.

"అన్నీ సిద్ధం! రేపే వెళ్ళాం!... మనం పరిశోధించడానికి ప్రభుత్వం చాలా విధాలుగా సాయం చేస్తానంది" అన్నాడు జయదేవ్.

"ఇంకేం! వెళ్ళి నిధుల్ని తవ్వుకురండి" నవ్వుతూ అన్నాడు సింగ్.

"నిధుల్ని కాదు 'శవాల్ని'! అంది కాంతి.

"అదీకాదు బాబూ! "ప్రేమకి మరణం లేదు" అన్నగ్రంథాన్ని!" భట్టు కూడా నవ్వుతూ అన్నాడు.

"స్వర్ణ మంజీరాలు నాక్కావాలి అరవింద్!" గోముగా అంది కాంతి.

"తెచ్చిస్తాలే" అన్నాడు అరవింద్ సీరియస్‌గా.

"నువ్వు తెచ్చేదేవిటి.... నేనే తెచ్చుకుంటాను" మూతి తిప్పింది కాంతి.

"సరి! సరి! ... ఆకలవుతోంది భోజనానికి లేవండి" అన్నాడు జయదేవ్.

"ఇంతకీ ... కాంతి అడివికి వెళ్తున్నట్టా లేదా?" అమాయకంగా అన్నాడు సింగ్.

"నేను వెళ్తున్నాను" తక్కున అంది కాంతి.

"ఆలోచిస్తాను" అన్నాడు అరవింద్ దర్పంగా.

అందరూ లేచారు భోజనానికి.

అయితే మర్నాడు అరవింద్ వాళ్ళతో కాంతి వెళ్తున్నట్లో, వెళ్ళనట్లో మాత్రం మనకి సరిగ్గా తెలియదు.

(అయిపోయింది)

## అంకితం

శ్రీకృష్ణ దేవరాయల వారు మావారి ముత్తాతల కాలంలో "తచ్చూరు" అనే గ్రామంతో పాటు రావినూతల జగన్నాథయ్య (మా వారి ముత్తాత)గారికి మహిమగల ఓ అమూల్యమైన దైవ విగ్రహాన్ని ఇచ్చారు.

ఆనాటి నించి ఈనాటి వరకు ఆ దైవం మా వెన్నంటి వుంటూ, మమ్మల్ని ఆశీర్వదిస్తూ, "తచ్చూరు"లోని మా స్వగృహంలో నిత్య పూజలందుకుంటోంది.

జమీన్లు, మణులు, మాన్యాలు పోయినా "మీకు నేనున్నాను మీకేలోటూ రాకుండా సదా మీతోటే వుంటాను" అంటూ మమ్మల్ని చల్లగా చూసే మా చల్లని దైవం పార్థసారథి స్వామివారికి భక్తిశ్రద్ధలతో. –రచయిత్రి



# దూరదర్శనం

లత

## అప్నే - పరాయా

ప్రొఫ్యాసర్ సంజయదవ్. ఇది ఏదో కొడుకు మాట విననందున ఆయాస పడి అరిచి ప్రాణం వదిలాడు ఒకాయన – అంతకు మునుపు ఏదో జరిగింది ఎవరో వస్తే మాట్లాడుతూ మిస్సయ్యాను.

ప్రేమచంద్ – ఉర్దూ హిందీ సాహిత్యాలలో జీవనాడి లాటి మహారచయిత. గోదాన్ గబన్ – మొదలయినవి ఆయన కీర్తి పతాకాలు దేశ స్వాతంత్ర్య సమరంలో ఆయన పాల్గొన్నారు. ఎంత వ్రాసినా ఆయన్ని గురించి తక్కువే అవుతుంది – ఆయనకి నమస్కరించడం తప్ప.

హోలీకా ఉపహార్ – అనే కథ ననుసరించిన నాటకం – తన ప్రియురాలికి సిల్కు చీర కొని ఆమె దృష్టిలో చులకన అయిన యువకుడు ఆ చీర అగ్నికాహుతి చేసి ఖద్దరు చీర హోలీ బహుమానంగా ఇస్తాడు. ఆ మరునాడు విదేశీ వస్త్ర దహనోత్సవంలో పాల్గొని పోలీసులచేత దెబ్బలు తింటాడు. అతని ప్రియురాలు ఆస్థితిలో వరమాల వేస్తుంది. అతడు తన రక్తాన్ని ఆమె పాపిట్లో సింధూరంగా అలంకరిస్తాడు. ఆ నాడు ప్రేమలూ బాధ్యతలూ అన్ని స్వతంత్రం కోసమే.

అన్నిటి కన్న బాగుంది బట్టలు కొట్టు సేటు తన విదేశీ దుకాణాన్ని మూసేసి ఖద్దరు దుకాణాన్ని తెరుస్తాడు. విదేశీ వస్తువుల మీద మోజు ఈ నాటికీ పోని భారతీయులకి ఈ కథ కనువిప్పు అవుతుందనే ఆశ మనకేం లేదు. కాని ఆ నాటి శౌర్యం స్వార్థరాహిత్యం. ఈ నాడు ఏవి? మున్షీ ప్రేమచంద్ కాశీ నివాసి. ఇందులో కాశీనే చూపించినట్లున్నారు.

## గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్

రచన ఛార్ల్స్ డికెన్స్. ఈ మహా రచయితవి ఒకటి రెండు చదివాను గాని ఈ గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్ చదివానా? గుర్తు లేదు.

నాటకీకరణ – జేమ్స్ అండ్రూ – చర్చి ప్రాంతపు శ్మశానంలో ఇద్దరు పారిపోయిన ఖైదీలుంటారు. ఆ ఇద్దరిలో ఒకడికి అమాయక బాలుడు చిక్కినందున రాత్రికి భోజనం తెస్తానని ఒట్టు వేయించుకుంటాడు. మరొకడు గాయపడి ఆ సమాధుల మధ్య పిల్లవాడికి కనిపిస్తాడు. కథ అలా ఉంచి ఆ తరపు ఇంగ్లీషు జనం ఎంత అసహ్యంగా మురికిగా కఠినంగా ఉండే వాళ్ళో ఆ ఇంగ్లీషు పల్లెటూరితో చూపించాడు ఛార్లెసుడికెన్సు. అలాటి వాళ్ళికా మహానాగరికులైన భారతీయులు లొంగినది? అహో – విధి విలాసం.

## మనసు గుర్రం – లేదు కళ్ళెం

ఈ నాటిక సినిమా వెనక జరిగే సినిమా కథ. హీరోయిన్ బాగుంది. వాళ్ళ మమ్మీ బాగుంది – చివరికి ఔట్ డోర్‌కి వెళుతూ చెప్పుకొన్న జోకులు బాగున్నాయి. హీరోయిన్‌ని వాళ్ళ మామయ్యే కాబోలు ఎత్తుకు పోయినాడు. కిందటి వారం చూడలేదు – వచ్చే వారం చూడకపోవచ్చు – కరెంటు కోత పాపమా అని? .

ఈ రోజు పిల్లల కార్యక్రమంలో ఒక బొడెమ్మ గార్ని చూపించటమే కాదు "బోడి ముండని నా దగ్గర నగలు ఎక్కడుంటాయి అనిపించారు" టి. వి. లో – ముసలి ముండ కూడా అన్నారు. ముండ అనటం అనౌచిత్యం అని పాఠకుడు ఒకాయన కె. రామలక్ష్మి ఇచ్చే ప్రశ్నలు జవాబుల్లో ప్రశ్నించాడు. రామలక్ష్మి తన జవాబుల్లో లతయినా సరే ఆ మాట అనడం నేను అంగీకరించను అని సమాధానం ఇచ్చింది. మరి ఇలాటి నాటకాన్ని రివ్యూ చేస్తున్న నేను ఆ పదం వాడటం ఎక్కిరించడం తప్పవుతుందా? ఎన్నటికీ కాదు. రామలక్ష్మి పాఠకుడు గారికి టి. వి. ఘోరాలు తెలియక లత పార్లమెంటరీ భాష వాడలేదని బాధ కలగవచ్చును. అది సహజం కూడా.

## బహదూర్ షాజఫర్

బహదూర్‌షాని అరెస్ట్ చేసి ఖైదులో చలిలో చీకటిలో ఇద్దరు పరిచారికలూ ఒక సేవకుడిని మాత్రమే ఉంచుతారు. మెట్కాఫ్‌హీనుడు ఆయనని అవమానిస్తాడు.

. తరతరాలుగా నా రక్తంలో ఉన్న దేశభక్తి వల్లనేమో? నా రక్తం మసిలిపోతున్నది ' ఆ ఆంగ్లేయులు ఎర్రకోటలో తిరగటం చూస్తుంటే. ఢిల్లీలో మందిరాలు పాఠశాలలూ ఖాళీ– ఎక్కడ గాలిబ్ కంఠం అని విచారిస్తున్న బహదూర్‌షా– బహుశా ప్రతి రాష్ట్రపతిలోనూ ఉన్నాడు – ఆయనకు ఢిల్లీ అన్నా ఎర్ర కోటన్నా అంత ప్రేమ. వెంకట్రామన్ గారిలో పోలికలున్నాయి.

## నయా దిశాయే...

ఈ నాటికలో కుశల్ మత్తు మందుల నుంచి బయట పడ్డాడు గాని అజయ్ చచ్చిపోయాడు... భగవంతుడే రక్షించాలి. వాళ్ళనే ప్రేక్షకుల్నీ కూడా– ఇక ఈ నాటిక ఆపితే బాగుంటుంది.

దృష్టిదాన్- రవీంద్రని కథ ఆధారంగా నాటిక.

## రామాయణ్

హనుమ సముద్ర లంఘనం ప్రారంభిస్తాడు. మైనాకుడు ఆతిధ్యం ఇస్తానంటే వద్దంటాడు సురస-సంహికలకి గుణపాఠం చెప్పి- తాటక జోస్యం విని అంతఃపురం వెతుకుతాడు.

కాని విభీషణుడు సీత సమాచారం చెప్పినట్లు ఉంది. ఇతి భవాయీ రామాయణంలో ఉన్నట్లు గుర్తు. ఏదయినా ఔచిత్యం చెడలేదు. సుందర కాండ పారాయణం చేస్తే మంచిదంటారు. చూస్తే ఇంకా మంచిది. హేతువాదులకూ రామ చరిత నమ్మని వారికీ రామాయణం అతిశయోక్తి కావచ్చును. నాకు కాదు.

## జిందగీ

సీరియల్ నాటికలో రెండో భాగం మొదటి భాగం చూడలేదు– విద్యుచ్ఛక్తి లోపం వల్ల– రచన అమృతా ప్రీతమ్.

అమృతాప్రీతమ్ పాకిస్తాన్ నించి వచ్చిన శరణార్థి. అనంతరం ఆలిండియా రేడియోలో ఎనౌన్సరు– ఆ తరువాత మంచి రచయిత్రి. సిగరెట్ చాలా స్టైల్‌గా కాల్చగలదు. ఆమె ప్రేమలతోనూ, సిగరెట్‌తోనూ విసిగి పంజాబీలు వెలి వేశారు. కాని జ్ఞాన పీఠ అవార్డు వచ్చింది ఆమెకు. ఆడపిల్లల కాలేజీ వాతావరణం గురించి ఆమె వ్రాసింది ఈ నాటిక. ఆమె గొప్ప రచయిత్రి. వయసుడిగినా సొగసుడుగని అమృతాప్రీతమ్ ఆమె. □



# నిత్యనూతన సీరియల్




(గత సంచిక తరువాయి)

ఊరోదుపుగత్తెలు రైలు వచ్చుచుండగా నిలుచుందుగు. రైలువంక చూతురు. అందులో కొందరు పిల్లలురైలులో నున్న వారిని చేతులతో బిలుతురు. పిలుచుచున్న కాపు పిల్లలను కిరీటిచూచి శశిరేఖతో చెప్పెను. "సుబ్బన్నపేట మనల బిలుచుచున్నది. చూచితివా" అని. అమెనవ్వెను. రైలు దిగినంతనే ధర్మారావును కిరీటియు కౌగిలించుకొనిరి. దూరమున ఉన్న శశిరేఖ నవ్వెను. ధర్మారావు "చూచితివటోయి! నీ భార్య నవ్వుచున్నది" అనెను. కిరీటి శశిరేఖను దగ్గరకు పిలిచి ముప్వురు ఇంటిదారి పట్టిరి. అరుంధతీ శశిరేఖలు వేయియేండ్ల నాటి అక్కా చెల్లెండ్రవలె కలిసికొనిరి. ప్రతి నిముషము అరుంధతికి శశి దేవతావతారమని పించినది. అంతవడిగా ప్రేమించిన యిల్లాలు, అంత చక్కగా దేవీ ప్రసాదము వడసిన భక్తురాలు–శశిరేఖ అన్నచో అరుంధతికి ఆమె స్త్రీలోకమౌళిరత్న మని పించెను. శశిరేఖ సౌందర్యము నవమల్లికా కుసుమ సౌభాగ్య ప్రతిస్పర్ధి. అచ్చర భూలోకమున కవతరించినట్లున్నది. రాణివాసములో ఉన్న అసూర్యంపశ్య శరీరచ్ఛాయ లామె దేహమున మెరుగెక్కెను. అరుంధతియు సౌందర్య వతియె. ఆమె సౌందర్యము వేరు. ఆమె సౌందర్యము శామంతికా పుష్పము వంటిది. మనిషి అచ్చరవలె ఉండదు, భూలోకమందలి ఒక సౌందర్యవతివలె ఉండును. ఆమె శరీరచ్ఛాయ పచ్చని బంగారము. అందుసితచ్ఛాయలు సమ్మిళితముకాలేదు. అరుంధతి ముఖాంచలముల, దరుముకొని వచ్చుచున్న ప్రేమ భావము గోచరించును. పొంగదగి సహజమైన వినయముచే ఆమె మొగము విరియుట గొంకుచున్న కింజల్కపిశంగి తనవనీరేజ పత్ర సదృశమై ఉండును. అరుంధతి శశిరేఖ నాదరించి యిరువురు ఆ కథలీ కథలు చెప్పుకొనుచుండిరి. అప్పటికి ప్రొద్దు వాటాగినది. శశిరేఖా కిరీటులు భోజనము బెజవాడ స్టేనులో చేసి వచ్చిరి. మధ్యాహ్న మేదో ఫలహారమైన తరువాత కిరీటి ధర్మారావులు జాతీయ కళాశాల వైపునకు పోయిరి. రథంతరి వీరు వత్తురని తెలిసి ధర్మారావు ఇంటికి వచ్చెను. వారు ముప్వురను ఒకరితో నొకరు మాట్లాడు కొనుచుండగా శశిరేఖ "ఎంత మంచి దినమమ్మా! మీ వంటి మంచి వారి నిద్దఱను కలసికొంటి"ననెను.

రథంతరి : అప్పుడే ఎక్కడనైనది? అసలు చూడవలసిన ఆమెను చూడనేలేదు..

శశిరేఖ : ఎవరామె?

రథం : తినబోవుచు రుచులెందుకు? ఆమె ఈపాటికి బయలుదేరి వచ్చుచుండును.

శశి : పెద్ద ఆమెయా? నలుబది ఏండ్లుండునా?

రథం : నలుబది ఏండ్లు ఏమి? నాల్గువేల ఏండ్లు. యుగ యుగాలనాటి స్త్రీ.

శశిరేఖ ఆమె పరాచికము లాడుచున్నదని నవ్వెను. అంతలో గిరిక వచ్చెను. ఆమె నల్లని చీరతాల్చి తెల్లని రైక తొడిగి, సర్వాభరణ శోభితయై బయలుదేరెను. వీధి యంతయు బురదయై ఆమె పాదములకు రాచిన యలక్తకము ప్రక్కల వెంబడి వ్రేళ్ళ వద్ద చెరిగిపోయెను. ఆమె ధర్మారావు ఇంటికి పది అడుగుల దూరమున ఉన్నదనగ ఒక తొందరకత్తెయైన చిలుప వానజల్లువచ్చి ఆమె వస్త్రములు తడిపెను. ఆమె తొందరగా నడచెను. కాని వాన అంతకన్న తొందరగా కురిసెను. తాను వాన నతిక్రమించ లేకపోతి ననుటలో ఆమె నవ్వుచు లోని కరుదెంచి, వచ్చుచునే అరుంధతితో "వదినెగారు! యీ వాన మీకన్న గడుసరి. నన్ను నిముసములో ఇంత చేసినది" అనెను. ఇంతలో అరుంధతీ రథంతరులు కాక మరి ఒక స్త్రీ ఉండుటచే చూచి సిగ్గుపడి ముఖమండపమున నందపరిచితి వెల్లడించెను.

రథంతరి : "భయములేదు, భయము లేదు. ఈమె యింకొక వదినెగారు ర"మ్మనెను.

గిరిక : "చీర తడిసినది ఇంటికి పోయి మరల పొడి చీర కట్టుకుని వచ్చెద"ననెను.

రథంతరి : "మరల తడుపదని నమ్మక మెక్కడిది? నీవు మరీ పసిపిల్లవై పోవుచున్నావు! నీ ఒడలి మీదికి వచ్చిన యౌవనమునైన నీ వెరుగవు కాబోలు! అంత ఆవిదిత శ్రోణీభరమేలనే?" అనెను. గిరిక కన్నులు విస్తరించి "అమ్మో! వదినగారేమో అనుకొంటిని. ఈసారి నా శ్రోణీభరాలసతకు వచ్చుచున్న మేఘము యొక్క వేగమునకు సరి చూచుకొందును" అనెను. అరుంధతి "మరల అంత దూరము పోవుట ఎందులకు? నాదీ క్రొత్త చీర ఒకటున్నది, కట్టుకొందువు కాని" అనెను. శశిరేఖ వారి సంభాషణకు అచ్చెరువు పోయినది. "వీరు ముప్వురును విచిత్ర స్త్రీలు. ఒకరి కన్న ఒకరు పవిత్రశీలలు. ఒకరి కన్నఒకరు వివేకవతులు. కాని ఒక్కరికిని ఆంగ్ల భాషా వాసన ఉన్నట్లు తోచలేదు. మాటలలో రసస్ఫురణ చాలనున్నది. ఈ మూడవ యామెఎవరు? ఈమె కన్నులలో ఏదో దివ్యజ్యోతి కనపడుచున్నది. ఎర్రనై విస్ఫారిన ముఖమండలము, విశాలములయిన నేత్రములు, మిక్కిలి వెడల్పయిన ఫాలము, దీర్ఘ నాసిక, ఉబికిన గండ భాగములు- శరీరమంతయు కఠినమై, మహారోగ్యవతి వలె ఉన్నది. పదునెన్మిదేడులుంద వచ్చును. అనాఘ్రాతమైన పుష్పము. అందుకనియే రేకలు బిగిసి చిక్కనయై ఉన్నది. ఎవరీమె? ఈమె శరీరాంచలముల యందు దేవతాత్వము గోచరించుచున్నది. ఈమె నేత్రములెంత సేపును ఊర్ధ్వగతములే గాని, ఆమె నేల వంక చూచుటలేదు. ఈమె మాటాడు పద్ధతిలో సహజమైన వినయాకృతి కలదు. ఈమె ఎవరై

జరిగిన కథ– 40: రంగారావుగారు దొరసానిని వివాహం చేసుకుంటారు. గవర్నరుగారు సుబ్బన్న పేటలో పురపాలక సంఘ భవనాన్ని ప్రారంభిస్తాడు. జోస్యులు భార్య మంగమ్మను రామేశ్వరము లొంగదీసు కుంటాడు. దేవదాసి గిరిక ప్రతి రోజూ ఆలయానికి పోయి స్వామిని సేవిస్తూ ఉంటుంది. హరప్పనాయడు తాను చేయవలసిన పనులను గురించి ఆలోచిస్తూ ఉంటాడు. జోస్యులను ఎవరో కొట్టి చంపుతారు. కిరీటికి శశిరేఖకు వివాహం అవుతుంది. దొంగనోట్ల కేసులో సినిమా రౌడీ చలపతిని రామేశ్వరమును పోలీసులు నిర్బంధిస్తారు. రామేశ్వరము తనకున్న ఆస్తి నంతటిని మంగమ్మ పేర పెడతాడు. మంగమ్మ ఒకనాడు డబ్బంతా తీసుకుని బెజవాడ వెళ్ళిపోతుంది. రామేశ్వరమునకు ఏడు ఏళ్ళు, చలపతికి ఎనిమిదేళ్ళు శిక్షపడుతుంది.

ఉండును?" రథంతరి గిరికతో "కిరీటి నెరుగుదువా?" అనెను. అరుధతి"తడి గుడ్డలతో ఎంతసేపుండెదవు? చీర కట్టుకొ"మ్మనిన, రథంతరి "నీ చీరఆమెకు సరిపోవునే అనుకొందము, రైక సరిపోవలదా?" అనెను. గిరిక రథంతరి వంక ఒక చూపు చూచెను.. అది సున్నితమై రథంతరి హృదయముదాక గ్రుచ్చుకొనెను. రథంతరి కనులు మూసికొని నమస్కారము చేసెను. మనసులో అనుకొన్నది." స్వామీ! నీ అదృష్టము. నాకు తగినంత సేవ నేనును చేయుచున్నాను" అరుంధతి "ఏమమ్మా! గిరికా! రథంతరి మీద కోపమెందుకు? నీలో ఉన్న రసాంభోధికి రథంతరి ఏతాములెత్తుచున్నది. నీవు స్వామికి మరియు దగ్గరి దానవగుచున్నావు" అనెను.

శశిరేఖకు వారి మాటలలోని అర్థములు తెలియలేదు. ఆమె వచ్చినప్పటి నుండియు అరుంధతీ రథంతరులామె వంకనే చూచుచుండిరి. ఆమెతోనే ప్రసంగించుచుండిరి. ఇంతవరకు తన్నంత ఆదరించిన వారిరువురు ఆమె వచ్చిన తోడనే తన వంకనైన చూడకుండుటకు శశిరేఖ నివ్వెరపోయినది. అరుంధతి తన చీర తెచ్చిగిరిక చేత బలవంతముగా కట్టించినది. గిరిక దానిని ధరించి "మరల నీకీ చీర పనికి వచ్చునా?" అనెను. అరుంధతి "నీవు వయసుచేత పసిదానవు. , నీకు నమస్కరించరాదు" అనెను. అరుంధతి కన్న గిరిక కొన్ని నెలలు చిన్నది. బయట వర్షము మరల విజృంభించినది. ఈసారి చిత్తజల్లుల వలె కాక నిలచి కురియుచున్నది. బయట ఒక మహా ధ్వని కలుగుచున్నది.

రథంతరి : కిరీటి నెరుగుదువా?

గిరిక : ఎఱుగను.

అరుంధతి : ఎఱుగ కేమి? మీ యన్నగారి వెంట తిరుగు కుఱ్ఱవాడు. నిరుడీ ఊరిలో బి. ఎ. చదువుకొనలేదా?

గిరిక : అవునొకటి "రెండు సారులు చూచితిని.

అరుం : ఈమె తీయన భార్య. ఈమె పేరు శశిరేఖ.

అరుంధతి యిట్లు చెప్పుచునే ఉన్నది. గిరిక తనలో తానేదో మాటాడుకొనుచున్నది. రథంతరి "అయనుకొనుచున్నది. పైకనరాదా?" అనెను. గిరిక నవ్వినది. ఆమె నవ్వులో ఒక తన్మయ రేఖ గోచరించినది. శశిరేఖ చక్కగా సంగీతము పాడగలదు. ఆమె "పైకనుడు, వింద" మనెను. గిరిక శశిరేఖ వంక నిర్రివలె చూచినది. అరుంధతి "మా చెవులేమి పాపము చేసినవా? ఒక్క పుణ్యపు మాట మా చెవిని పడనీయరాదా" అనెను. గిరిక "ఏమోనమ్మా! మీ మాటలు నవ్వులో నిజములో తెలియదు. ఏమనుకొనుచున్నాను? ఏమియు అనలేదు రాతిరొక సంగతి జ్ఞాపకము వచ్చినది. అది అనుకొనుచున్నాను."

అరుంధతి : దేవాలయమునకు పోదమా?

రథంతరి : వాన వెలియలేదు.

శశిరేఖ గిరిక వంక చూచినది చూసినట్లే ఉంచెను.



అరుంధతితో ఆమె ఎవరి భార్య" అనెను. అరుంధతి నివ్వెరవోయి శశిరేఖ వంక చూచెను. చూచి "ఎవరి భార్య ఏమిటి? ఆమె దేవదాసి" అనెను. దేవదాసి అనగా తెలుగుదేశమున ఇతర స్థలమున నున్న వారికేమి తెలియును? సుబ్బన్నపేటలోని వారికే తెలియును. తక్కినది తెలియకపోయినను శశిరేఖ కొకటి తెలిసెను. అది ఆమె కులము. బయట వాన కొంచెము తగ్గెను. ఆకాశములో మెఱుపులు స్వర్గమున జరుగుచున్న దేవదానవ యుద్ధసమయముల మెఱపించిన కత్తుల వలె ఉండెను. ఆకాశమున ఉఱుము లొకటి పశ్చిమమున ఉఱుమును, దాని కెదురుగా మఱల ఉత్తర దిక్కున ఉఱుమును. ఆలయములో బ్రాహ్మణులు రెండు బారులు తీర్చి మంత్రపుష్పము చెప్పునట్లున్నది. వేదములు వంతులు వేసికొని గానము చేసినట్లున్నది నేలనున్న గనులు వర్షమునకు పైనున్న కొట్టుకొనిపోగా నశానో ల్లేఖితములై వెలువడిన మహామరకతముల వలె, దారికిరుప్రక్కల పడియున్న, పాచిపట్టి ఆకుపచ్చ రంగు గల బావురుకప్ప లొకదాని కొక డెదురుపడి వనసలు చదువుచున్నట్లు, మేఘములు కూడ ఒకదానినొక డెదురు పడి ఉఱుమ జొచ్చెను. అంతవరకు గిరిక తడిరైకతో ఉండెను.

శశిరేఖ : ఆమె యింత వరకు తడిరైకతోనే ఉండెను.

అరుం : నేను వాడని రైకలేదు. పెట్టిలో ఉన్నవి కూడ వాడినవే!

రథం : నేను జెప్పలేదా? నీరైక చినిగిపోవుట తప్ప లాభములేదు.

గిరిక : నా రైక ఎండినది.

రథంతరి : నేను తాకి చూడనా?

అరుంధతి : నీవు స్వామి కన్న ధూర్తురాలవు.

వాకిటిలో వాన వెలిసినది. గిరిక ఆలయమునకు పోదమనెను. నలువురును బయలుదేరిరి, వారి యింటి నుండి ఆలయమునకు దగ్గర త్రోవ యున్నది. ఆ త్రోవ వెంట జనమెక్కువగా ఉందరు. నలువురును నాల్గురకములైన స్త్రీలు. నలువురి సౌందర్యములు నాల్గురకములు. గిరికా సౌందర్యము స్వామి సమాదరణము చేత పవిత్రమైనదే కాని తక్కిన ముప్వురి సౌందర్యము కొఱతపడినది కాదు. వారు నలువురు నడచుచుండగా నాలుగు మహానదీ ప్రవాహములు కదలినట్లు, నాల్గు ప్రభాతరశజ్యోతిస్సులు వెడలినట్లు, నాలుగు శశికళలు బయలుదేరినట్లు, వీధి అంతయు ధగద్ధగితమైపోయెను. ధగద్ధగితమైన ఆ నేల దివ్యమగుట చేత నిర్ధనమైనది. శశిరేఖ నడచుచు తన్ను తా నెఱుగదు. ఆమె గిరిక మీద పెట్టిన కన్నులు పెట్టినట్టే ఉన్నది. ముప్పురును కలసి ముందు నడచుచుండిరి. ఆమె వెనుక నడచుచుండెను. ఆలయములో నికి పోయిరి. సరస్సున పాద ప్రక్షాళనము కావించిరి. ప్రదక్షిణము చేసిరి, ఆలయములోనికి చనిరి. పై నాకాశము మద్దెల వాయించినట్లు ఆగి ఆగి లోలో మొఱసెను. దేవదాసి అటునిటు చూచెను. శ్రుతిపోయుటకు, దాళము వేయుటకుకు, మద్దెల వాయించుటకు ముప్వురు వచ్చిరి. శ్రుతిపోయుటకు వచ్చినది కబీరు. దేవదాసి కబీరును చూచి నవ్వెను. కబీరు "నేను పురపాలక సంఘ సభ్యుడనైనచో కులవృత్తి జేయరాదా?" అని శ్రుతి సవరించెను. గిరిక తెచ్చిన గజ్జెలు కాళ్ళకు కట్టి పాద ఆరంభించెను. ఆలయములో ఎవ్వరును లేరు. స్వామి ఉన్నాడు. ముగ్గురు వదినెలున్నారు.

సౌరాష్ట్రరాగము – ఆదితాళము

పల్లవి : "ఇద్దరివలెనే కూడి యెవరున్నారు తెల్పరా!

ఒద్దికతో మనవలెనున్నారా?

ముప్వగోపాల!

ఇద్దరివలెనే కూడి యెవరున్నారు తెల్పరా!

చరణం : మున్ను నలరాజు నీవే, ముదిత దమయంతి నేనే

చెన్నుగ శ్రీకృష్ణుడు నీవే శ్రీ రుక్మిణిదేవి నేనే.ఇద్దరి.

చరణం : అల రఘురాముడు నీవే, అయిన సీతాదేవి నేనే;

నిత్యము మదనుడు నీవే నీకు రతీదేవి నేనే.ఇద్దఱి.

సంభోగ శృంగారాభినయము నందు గిరిక విచిత్రముగా నిజముగా స్వామితో ననుభవించిన దాని వలె చేసినది. అరుంధతియు, శశిరేఖయు అచ్చెరువందిరి. అనభ్యస్త విద్యలు, వారిరువురు సరిగా ఇట్టే ఒకానొక రాత్రివేళ భర్తలతో అనిరి. అది కీర్తన, గిరిక పాడుట! నాయకుడు ముప్వగోపాలుడు. ఇద్దరి యొడళులు పులకరించినవి. రాతిరి కథ యిదా? గిరిక అరుంధతికి దగ్గరగా వచ్చి "రాతిరి జరిగినదిదే. దర్శనము మూడు విధములు. రాత్రి స్వప్న దర్శనమైనది. నాకిది చిత్రముగా నున్నది. నేను మీతో మాట్లాడుచుందును. మాట్లాడుచున్నట్లు నాకు తెలియదు" అనెను. మఱలనందుకొని గిరిక–

చెన్నుగ శ్రీకృష్ణుడు నీవే, శ్రీ రుక్మిణీదేవి నేనే. యిద్దఱి. యని పదార్థాభినయము చేయనారంభించెను. శ్రీకృష్ణుడు పూతన చనుబాలు త్రావెను. పూతన చనిపోయెను. స్వామి కాలుసాచి శకటాసురుని దన్నెను. వాడు విఱిగిపోయెను. బరువైన కుమారుని యశోద తొడల నుండి క్రిందికి దించెను. తృణావర్తుడెత్తుకొని పోయెను, వానికి భగవంతుడు బరువెక్కి, వాడు ఒక కొండ మీద కూలెను. వాని శిరస్సు చిదిపెను. స్వామి బృందా వీధి వేణువూదెను. వ్యత్యస్త పాదారవిందుడై భ్రూవి క్షేపముతోడ దాపలిభుజమున చెక్కు గీలిచి, మరకతమయ వేణువుపై కోమల హస్తాంగుళి నఖమాణిక్యము లాడించెను. నెమరు వేయు గోవులు నెమరు మాని తలలెత్తి చూచెను. పరిత్యక్త సంసారలై – ఒకతె నీవి ముడి వేయుచు, ఒకతె వేయుచున్న రైకముడి వేయుట మరచి, మరి ఒకతె ముడువ బోవుచున్న తల ముడువక – పరుగెత్తుకొని పోయిరి. స్వామి చిటికెన వ్రేల గోవర్ధనపర్వతమెత్తెను. ఇంద్రుని ఆజ్ఞచే పరాక్రమించిన పుష్కలావర్త మేఘములు సహస్రధా విజృంభించి ఏనుగు తొండము లంత ధారలతో వర్షింపపర్వతాధో భాగమున గోపాలకు లందరును సుఖముగా విశ్రమించిరి. తరువాత ఇంద్రుడు వచ్చి నమస్కరించెను. స్వామి తప్పు మన్నించెను. "శ్రీరుక్మిణీదేవి నేనే" సముద్ర మథనము



జరిగినది. శంఖచక్రాంకితయై తొలుకారు మెఱుగుకై వడి మేనుతోడి, కలువల నీనెడి చూపుతోడి, చెలువముల మొదలి టింకి సిరిపుట్టెను. ఆమె ఉభయపార్శ్వముల తామరతూండ్లు తొండముల ధరించిన ఏనుగులచేత పరిసేవింపబడుచుండును. భూమి నుండి మైథిలి ఉదయించెను. ఆమె శ్రీరామచంద్రుని అంక భాగమున మురువు కులుకుచుండెను. విదర్భలో శ్రీరుక్మిణీదేవి పుట్టెను. ఆమె ఉత్తరము వ్రాసి బ్రాహ్మణుని పిలిచి స్వామికి కబురు పంపించెను. దుర్గాలయమునకు గౌరీపూజార్థమై చనెను. శైబ్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకసన్నద్ధమై మెఱుపు వంటి రథ మెక్కి మెఱుపు మెఱసినట్లు స్వామి నాలుగైదు బాణములతో సైన్యమంతయు చీకాకు చేసి రుక్మిణి నెత్తుకుపోయెను. "నిత్యము మదనుడు నీవే, నీకు రతీదేవి నేనే" – పుష్పబాణుడైన మదను నభినయించెను. గిరిక ప్రత్యాలీఢపాదయై అల్లె త్రాటిని దృఢముష్టి ముద్రచేలాగి, వామహస్తమున కనిష్ఠికయు బొట్టన వ్రేలును సాచి తక్కిన మూడు వ్రేళ్ళు బిగించి యిక్షుధనుర్హస్తకము బిగించి, వామభుజమున వ్రేలాడుచున్న తూణీరమునుండి చేయి అమ్ము తీసిన వైఖరి ఆకాశమున చంద్రమండలాకృతిగా లాగి ఆ కర్ణాంతపరికృష్ట జ్యావల్లికి సంధించి శరవిమోచనము చేసెను. తచ్ఛరీర లాఘవమున తచ్ఛరాకర్షణ వేగము, శరసంధాన నైపుణి, తత్సమయకృతభ్రూవల్లీ వికట నర్తనము, ఏనాడో చనిపోయిన ధనుర్విద్య అంతయు ప్రత్యక్షీకరించెను. గిరికా! నీతో నీవే కాదు, మఱియెన్ని మహావిషయముల సంస్కృతియో నశింపబోవుచున్నది. మృదంగనిస్వానము చేతను, గజ్జియల మ్రోతల చేతను, తాళపు సవ్వడి చేతను దేవాలయాంతర్భాగము సమావృత్తమైన అంధకారము చేత ఉఱుముచున్న మేఘమువలనే తోచెను. నృత్య రేఖాభిరామయైన దేవదాసి తళుక్కు తళుక్కుమని మెఱయుచుండెను. పీయూషధారా సదృశ రసవర్షము కురియుచుండెను. గంట సేపటికి నృత్య మవసాన దశ నందినది. అభినయ మైపోయినది. గిరిక రతీదేవి వలె శోష పొందెను. కడచిన రాతిరి, స్వప్న గతుడైన స్వామితో పర్వతః పరిభుక్తస్వయౌననయైన వేళ ఎట్లు రత్యంత స్వేద మనోహరమూర్తియై తా నుండెనో అట్లు నిలిచెను. అప్పుడు గిరిక...

"వ్యాకోచః కేశపాశ స్తరళిత మలకై స్స్వేదమోక్ష కపోలౌ

క్లిష్టా బింబాధర శ్రీః కుచకలశరుచా హారితా హారయష్టిః

కాంచీకాంతిర్హతాశాస్త నజఘనపదంపాణినా శ్ఛాద్య సద్యః

పశ్యంతీసత్రపం మాం తదపి విలుళితా ముగ్ధకాంతి ర్ధినోతి."

అన్న అర్థమున కుదాహరణముగా కూర్చుండెను. ఆమె అప్పటికి విలులిత భావము దీపపు వెలుగున నుండి చూచుచున్న స్వామికే తెలియవలెను.

హంగునకై వచ్చిన ముగ్గురును నృత్యాంతావస్థ తెలిసికొని ఆలయగర్భము నుండి వినిర్గమించిరి. మిగిలిన ఓదార్పు రథంతరిపాల బడినది. ఆమె సుప్రీత పీతాంబరుని వలె గిరికను దరిసి జడ ముడి వేసెను. ముంగురులు దిద్దెను. కపోలములు చేలాంచలముతో తుడిచెను. చిక్కు పడిన హారయష్టి సరిదీసెను. వదినెగార్లిద్దరును చెఱియొక రెక్కయు పుచ్చుకొని ఆమెను నిలువబెట్టిరి. అర్చకుడు విష్ణుపాదములిచ్చెను. సంపెంగ పూవు దేవదాసికి కానుకగా ప్రసాదముగా నిచ్చెను. నలువురును ముఖ మండపమున కూర్చుండిరి. శశిరేఖ ఒడలు శశిరేఖకే తెలియదు.




దేవదాసి ఒడలు దేవదాసికే తెలియదు. శశిరేఖకు తానొక కల్పితజగత్తున ఆమానుష ప్రపంచమున దిరుగాడుచున్నట్లు తోచెను. ఈ సంవిధానమే చిత్రముగానున్నది. ధర్మారావు ఎడల సుబ్బన్నపేట ఎడల కిరీటి కంత ప్రేమ ఎందులకో తానిప్పుడు తెలిసికొనినది. తక్కిన ప్రపంచమంతయు నీరసించిపోయినది. ఇచ్చట మాత్రము రసప్రవాహ మట్టిట్టు మోచి నడచుచున్నది. ఆహా! ఇచ్చట ముగ్ధుడు కానివాడెవడు? వీరందరేదో పూర్వజన్మ పుణ్యవిశేషము చేత ఇచట ఉదయించిరి. శ్రీకృష్ణదేవుడు దేవకీదేవి కడుపున పడెను. సర్వదేవతలును మధురలో బృందలో మానుషావతారములెత్తిరి. అట్లే శ్రీకృష్ణస్వామి సుబ్బన్నపేటలో వేణుగోపాలమూర్తి అవతరించెను. ఒకతె రుక్మిణి, ఒకతె సుభద్ర, మరియొకతె సత్యభామ. ఒకడు సాత్యకి, ఒక దర్జునుడు. వీరందఱు ఉదయించిరి కాబోలు! నిజమయిన భక్తి ఎన్నియేని ఊహల కెడమిచ్చును. వీరందరవతారములు కాకపోవచ్చును. ఒకానొక పూర్వజన్మ కృతసంసార లేశముచేత రసస్వరూపము మఱచిపోని సామాన్య జనులే కావచ్చును, ఇంత మంది ఒకచోట ఉండుటయే ఆశ్చర్యము.

ఆ రాత్రి అరుంధతీ ధర్మారావులు కిరీటి శశిరేఖలను పెండ్లి కొడుకు, పెండ్లి కూతురులుగా అలంకరించి పానుపు వేసిరి. రథంతరి, మంగ, రత్నగిరి, మరియు ఇరుగుపొరుగు స్త్రీ లెల్లరును వచ్చిరి. కిరీటి లజ్జాశకలిత మందహాసుడయ్యెను. శశిరేఖ లజ్జాసంసహితమూర్తి అయ్యెను. అరుంధతి ధర్మారావుల బలవంత మెక్కువయ్యెను. వారు గృహాధికారులు. వారి మాట జవదాట నీలులేక పోయెను. పూలచెండ్లాడించిరి. ముత్తయిదువలు పాటలు పాడిరి. ఆ నాడందరితో పాటు ధర్మారావొక ముత్తయిదువ. పరాచికములు కొంత హద్దుమీరినవి. ఎనిమిది నెలలు కాపురము చేసిన భార్యాభర్తల పునస్సంధాన మింకెట్లుండును? ఇది అంతయు అరుంధతి ముచ్చట. ఎవరి దారిన వారు పోవుచు ముత్తయిదువలు తాంబూలములు రవికల గుడ్డలు తీసికొనిపోయిరి. అందరు పదిమంది, ఆత్మీయులే వచ్చిరి. అందరును వెడలిపోయిరి. మంగ వెనుక వెనుక తారాడి అరుంధతితో "అమ్మా! చాల శోభగనున్నది. చిలుకయు, గోరువంకయు వలె ఇద్దరును బంగారపు మొలకలవలెనున్నారు. వారు రెడ్డా? మీకు తక్కన కులముతో సంబంధము నేడు వదలునది కాదు. నన్ను పిలిచితివెందులకు" అనెను. అరుంధతి మంగచేతిలో తాంబూలమిడెను మంగ పుచ్చుకొనుటకు వెనుదీసెను, సావిత్రమ్మగారు "తీసికోవే మంగా! నా యింట తాంబూలమైన దీసికొమ్ము, తక్కినవన్నియు మన యిద్దఱి కొకసారి మే ఆశలు వదలెను గదా" అనెను. ఆమె పుచ్చుకొని

పోయెను. సావిత్రమ్మగారు "మంగ చిన్ననాటెట్లుండెనో నేడు అట్లే యుండెను. అప్పుడును బక్కపలుచగా చువ్వవలె ఉండెడిది ఇప్పుడునట్లే. తల మాత్రము నెరసినది." అనెను. రత్నగిరి ధర్మారావుతో మాట్లాడదలిచినట్లు పోవుచుపోవుచు వెనుకాడెను. ధర్మారావు తదూహ ఎఱిగి దగ్గరకుబోయి "యేమమ్మా!" అనెను. రత్నగిరి ఆఱువదవ పడిలో పడినది. అయినను సవతి కొడుకునొద్ద సిగ్గుపడుట మానలేదు. ఆమె "బాబూ! గిరిక ఏమాత్రము దూరము వచ్చినది .." అనెను. ధర్మారావు ఏమాత్రము దూరము వచ్చినది. యేమాత్రము దూరము వచ్చినదేమిటి? నేటి సాయంకాలమున దేవాలయములో చూడవలయునామెను కడచిన రాత్రి ఆమెకు స్వప్న దర్శనమైనది దర్శనము త్రివిధమని నీకు తెలియును గదా! అందు చిత్రదర్శనములో విశేషము లేదు. అదియు కూడ రసహేతువే కాని భక్తిపథమున పోవు ఇటువంటి నాయికలకు చెప్పుకొనదగినది కాదు ఇంక స్వప్నదర్శనము, సాక్షాద్దర్శనము రెండును భక్తి భావన రంగు నాయికల పాలిట కల్పవృక్షములు గిరికను స్వప్నమునందు స్వామి అంగీకరించెను. ఇట్లే ప్రతి దినమును గిరిక వెంట హంగు పోవుచుండ వలయును. బహు తపస్సులు చేసినకాని ఋషులకు స్వామి గోచరించలేదు. ఇదియు కళాతపస్సు, ఈ తపస్సునకు ధ్యానము - రాగము, జపము - తాళము, స్నానము - నృత్యము, ఇది నిత్యము సమాచరించవలయును. దేవదాసి మనల నందరను పునీతుల చేయబోవుచున్నది. ఆమెను సర్వదా పరిరక్షించుకొనవలెను. ఆమెను గూర్చి నీవంత విచారించరాదు ఇంక కొలది నాళ్ళలో గిరిక మఱియు మఱియు మాఱిపోవును అప్పుడు తొందర పడరాదు. గిరిక కేమి! బంగారుతల్లి మా తండ్రి నన్నేమో మహావైదికుని చేయవలెననుకొనెను. అన్నను రామచంద్రరాజును. గొప్ప విలుకానిని చేసె. అతనికి బ్రహ్మోపదేశము చేసె. అథర్వవేదము పునరుద్ధరించి బ్రహ్మాస్త్రము మొదలైనవి కల్పితములు కావు యదార్థములని ఋజువు చేయించి. జగత్తు మరల క్షత్రియులచే ఏలించ వలయుననుకొన్నాడు శ్రీధరముగారు వేమారెడ్డి కవచితిప్పయ వలె రాజుగారికి కోశాధిగారి అవుననుకున్నాడు. అన్ని ఊహలును సర్వథా సంధ్యూతములై పోయెను ఆయన ఊహలు రెండే- ఒకటి సగము ఫలితమునకు వచ్చినది మరియొకటి సంపూర్ణ ఫలితమునకు వచ్చినది పసరిక మీద నాకాశ లేదు గిరిక, గిరికయా! మా తండ్రి సంపూర్ణ మనోరథమామెయే! గిరికను చూచిన నికెట్లుండనో కాని. నాకు మాత్రము దేవతా స్త్రీలను చూచినట్లుండును కబీరు గిరికను నిత్యము అంటి పెట్టుకుని ఉండవలయును. కాలము చెడ్డది. విగ్రహ నాశకులున్నారు. వారితో విగ్రహము మనకెందుకు" అనెను ధర్మారావు కంఠము గద్గదికతో బొలిచెను. మనిసి నఖశిఖ పర్యంతము పులకి పోవుచుండెను రత్నగిరితో అతడదివర కెన్నడును మాటాడలేదు. ఆమెయు అతనినెన్నడును పలకరించలేదు రత్నగిరి సంతోషమో! ఉత్సాహమో! నడచిపోవుచు ఒక భావమును ప్రకటించెను. అది సహజమో, భరతశాస్త్ర వైశారద్యము వలన కలిగిన ఫలితమో! సంస్కృతమైన తద్భావ ప్రకటన చీకటిని చీల్చివేసెను తటిల్లతలు సరస్వతి పురపులవలె తళతళ మెఱసెను. మేఘము లురిమెను నెమ్మదిగా చినుకు నారంభించెను. చినికి చినికి పెద్ద వాన అయ్యెను దానికి గాలి సాగెను చలి వేసెను శశిరేఖా కిరీటులయు, అరుంధతీధర్మారావులయు గాఢ పరిష్వంగములు పూర్వము సహ్యము. పర మసహ్యమునయ్యెను దుప్పటి ఆపాద మస్తకములాగి శశిరేఖా కిరీటులు నిద్రించిరి కఠోర గర్భిణి అరుంధతి దూరముగానే పండుకొనెను ఆమెకు తొమ్మిదవ నెల వచ్చెనేమో! అంత చలిలో ఆమెకు దుప్పటి అక్కఱలేక పోయెను

అరుం. నేడు మీరిద్దరు ఎచటికి పోయితిరి?

ధర్మా. శివరావుతో మాట్లాడుచుంటిమి.

అరుం : నేడు మేము నలువురము దేవాలయము లోనికి పోతిమి. అచ్చట నేడు గిరిక నృత్యము చేసినది. ఆమె ఎంత విద్యావంతురాలు!ఆమె మనుపటి వలె కాదు. నే నెఱుంగుదునుగదా! ఆమె భక్తి వేఱుగను, విద్య వేరుగను పూర్వముండెడిది. ఇప్పుడు రెండును కలసిపోయినవి. విద్యా ప్రదర్శన వేళ యందే ఆమె భక్తిభావము విజృంభించుచున్నది. కడచిన రాత్రి ఆమెకు స్వప్నమున స్వామి సాక్షాత్కరించెనట. సాక్షాత్కరించి- అని అరుంధతి సిగ్గుపడెను.

ధర్మా : సరియే! తరువాత తెలిసినది.

అరుం : అదీ గడుసుదనమనగా?

-ధర్మా : నే నేమంటిని?

వ్యవహితమైన వారి కౌగిలి మనసు చేత తప్ప శరీరముచేత సుఖావాది కాలేదు. కిరీటి శశిరేఖలు మూడు రాత్రులు కడచినవి. నాల్గవనాడు కిరీటి ప్రయాణమయ్యెను. ధర్మారావు సరే అని అతనిని వెంట పెట్టుకొని దేవాలయాభిముఖముగా పోయెను.

ధర్మా : నీవు దేవదాసి నెరుగుదువా?

కిరీటి : వెనుక నీకొకసారి చూపించితివి. రాత్రి శశిరేఖ చెప్పినది.

ధర్మా : ఏమని?

కిరీటి : ఏమని ఏమిటి? ఆమె మహా భక్తురాలట! మహా విద్యావంతురాలట. ఆమెనంత భక్తురాలిని చేసినది నీవేనట! శశిరేఖ నిన్నొక్కటే మెచ్చుకొనుట.

ధర్మా : శశిరేఖ నిట్లు చేసినది ఎవరు?" ఇద్దరును దేవాలయ ప్రాంతములకు పోయిరి.

ధర్మా : ఇందులో దేవాలయ మెవరిదో తెలియునా?

కిరీటి : పై శిఖరములే తెలియజేయుచున్నవి గదా?

ధర్మా : ఎన్ని దేవాలయములు నీకు కనబడుచున్నవి?

కిరీటి : రెండు.

ధర్మా : అచ్చట ఉన్నవి మూడాలయములు.

కిరీటి : మూడవది ఎచట నున్నది?

ధర్మా : ఆ శివాలయములో ఒక పెడనున్నది. మనమచ్చటికే పోవుచున్నాము. అది సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆలయము. ఈ ఊరునకు సుబ్బన్నపేట అని పేరేల వచ్చెనో నీకు తెలియునా?

కిరీటి : ఒకసారి హాస్టలులో విద్యార్థులందరును చెప్పుకున్నారు. నీకు నా కథకూ ఏదో సంబంధమున్నదని కూడ అనుకున్నారు. కాని శశిరేఖ విరహ వ్యథాకులిత హృదయుడను, నేనప్పుడు విన్నదుగలేదు.

ధర్మా : నాకు, నా స్వామికి ఏమి సంబంధము? ఆయన దారి ఆయనది. నా దారి నాది. నీకొకడు చెప్పవలయును. మనమచ్చటికి పోయిన తరువాత స్వామి నీకెట్లు కనపడునో తెలియదు. అనగా జాతి విగ్రహముగానే గోచరించునో నిజమైన పాము వలెనే కనపడునో? కాని ఒక్కటి మాత్రము చెప్పగలను. ఆయన రెండు శిరస్సుల నాగు.

ఇరువురును కలసి సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆలయాంతర్భాగమునకు పోయిరి. అది ప్రాతః కాలము. గణాచారి గుడిలో నున్నది.

కిరీటి : ఈమెయే కదా గణాచారి?

ధర్మా : స్వామిని చూడుము.

కిరీటి : విగ్రహమంటివి. విగ్రహమే లేదే!

అంతలో కిరీటి సచకిత హృదయుడై రెండడుగులు వెనుకకు వేసి, నిశ్చలదృష్టితో విగ్రహమున్న వైపుననే చూచుచుండెను. ధర్మారావు నమస్కారము చేసెను. కిరీటియు అతని ననుసరించెను. అర్చకుడు విభూతి యిచ్చెను. ఇరువురును దేవాలయమున వెలుపలికి వచ్చిరి. వెడలి వచ్చుచు ధర్మారావు, గణాచారు లొకరినొకరు చూచుకొనిరి. ఆమె తన వంక చూడకుండా పోవుచున్న కిరీటి వంకకు చేతులెత్తి ఆశీర్వదించెను. కిరీటి ధర్మారావులు గుడి వెలికి వచ్చిరి. ధర్మారావు కిరీటి "నేమి కనబడిన"దని అడిగెను.

కిరీటి : నాకిటువంటి వనిన పూర్వ మెపుడును నమ్మికలేదు. కాని, అన్నా! విచిత్రముగ ఉన్నది, దేవాలయములో విగ్రహమునకుబదులుగా సర్పమే ఉన్నదేమి? అది ఎవరిని కఱువదా?

ధర్మా: అసలాయనవి వేయిపడగలు. ఇంక మిగిలినవి



# న్యాయపీఠం



బి.బి.రావు. ఎమ్.ఏ.ఎల్ఎల్.బి.

## నిర్లక్ష్యంగా ట్రక్కు నడిపినందుకు శిక్ష

నన్నేఖాన్ అను డ్రైవర్ 1978 సంవత్సరం, నవంబర్ 14వ తేదీన ట్రక్కు నాలుగు గంటలకు నడుపుతూ మధ్యప్రదేశ్‌లోని నానావాడ్ గ్రామం దగ్గర రోడ్డు మీద పప్పు అనే 8 సంవత్సరాల బాలుడును గుద్దించి వేశాడు. ట్రక్కు క్రింద పడి పప్పు మరణించాడు. పోలీసులు భారత శిక్షాస్మృతిలోని 304– ఎ సెక్షన్ క్రింద ట్రక్కును దుడుకుగాను, నిర్లక్ష్యంగాను నడిపినందుకు పప్పు మరణించినందున కేసు పెట్టారు. బ్రిజ్‌మోహన్ అనే వ్యక్తి ప్రత్యక్షంగా ఈ సంఘటనను చూసి సాక్ష్యం చెప్పాడు. మేజిస్ట్రేట్ కోర్టువారు ఈ సాక్ష్యాన్ని పరిశీలించి, డాక్టర్ రిపోర్టును కూడా చూసి నన్నేఖాన్ నేరము చేసినట్లుగా నిర్ధారణ చేసి అతనికి ఒక సంవత్సరం, కఠిన కారాగార శిక్ష విధించారు. నన్నేఖాన్ జిల్లా జడ్జి గారికి అప్పీలు చేసుకున్నాడు. కానీ అప్పీలు కొట్టి వేశారు. ఈసారి హైకోర్టు వారికి రివిజన్ పిటిషన్ పెట్టుకున్నాడు. నన్నేఖాన్ వాదన ఇలా ఉంది :– ట్రక్కు ఒక కల్వర్టును మెల్లిగా దాటుతుండగా పప్పు రోడ్డు మీద అడ్డంగా పరిగెత్తుతున్నాడు. నన్నేఖాన్ బ్రేకు వేశాడు. బ్రేకులు పని చెయ్యలేదు. పప్పు కుడి ప్రక్క నుంచి ఎడమ ప్రక్కకు పరుగెత్తుతున్నాడు. ట్రక్కుకు కుడి వైపున పెద్ద గొయ్యి ఉంది. అందుచేత ట్రక్కును ఎడమ వైపునకు త్రిప్పాడు. పప్పు కుడి వైపున ట్రక్కును గుద్దుకొని పడ్డాడు. కానీ ఈ వాదనను హైకోర్టువారు అంగీకరించలేదు. మెడికల్ రిపోర్టు ప్రకారం పప్పు కడుపు మీద, తొడల మీద పెద్ద గాయాలు ఉన్నాయి. తలమీద, వీపు మీద గాయాలు లేవు. కనుక పప్పు ట్రక్కు చక్రం క్రింద పడి మరణించినట్లు హైకోర్టువారు తీర్పు చెప్పారు. బ్రేకులు పోవడం అబద్ధమని పప్పు ట్రక్కును గుద్దుకొని పడి పోలేదని డ్రైవర్ దుడుకుగా, నిర్లక్ష్యంగా ట్రక్కును నడుపుతూ, పప్పును మట్టించి వేసాడని హైకోర్టు తీర్పు చెప్తూ 1986లో దివిజన్ పిటిషన్ కొట్టి వేశారు. ☐

### గమనిక

11–17 డిసెంబర్ 87 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో "న్యాయ పీఠం" శీర్షిక క్రింద ప్రచురించబడిన "ఆత్మహత్య నేరం కాదు" లో 33, 34 లైనులలో ఇలా ఉన్నది.

"300 సెక్షన్‌లో ఆత్మహత్య గురించి వివరణ ఉన్నది. కాని 309 సెక్షన్‌లో ఆత్మహత్యకు వివరణ లేదు"

పాఠకులు దయచేసి ఈ విధంగా చదువుకోవలెను.

"300 సెక్షన్‌లో హత్య గురించి వివరణ ఉన్నది, కాని 309 సెక్షన్‌లో ఆత్మహత్యకు వివరణ లేదు."

బి. బి. రావు

# ఈ 'వేమన' పద్యాలు







ధనము చాల గూర్చి ఘనదాన ధర్మముల్
తగిలి చేతికిచ్చు తనయులకును
తేనె గూర్చి యీగె తెరువరుల కొసంగు
విశ్వదాభిరామ వినురవేమ.

## వేయిపడగలు

రెండు. తక్కిన తొమ్మిదివదల తొంబదిఎనిమిదిపడగలు దేశమును సర్వధా యిదివఱకే గ్రహించినవి.

కిరీటి : ప్రతి ఏట ఇచ్చటికి వచ్చి నేనును శశిరేఖయు స్వామికి కొబ్బరికాయలు కొట్టిపోదుము. నేటి సాయంకాలమున ఇద్దరము ఇచటికి వత్తుము. నేను రేపు పోయెదను.

ధర్మా : "అట్లే" అనెను.

ఇరువురును కోటకెదురుగా పోయిరి. దూరము నుండి హరప్పనాయడు వచ్చుచుండెను.

కిరీటి . ఈయనే కదా జమీందారు? నీ వాయనకు కొన్నాళ్ళు చదువు చెప్పితివట కదా?

ధర్మా : చదువు చెప్పినది నేను గాదు. ఈట్సనుదొర. అతనికి నెలకు పన్నెండు వందల రూపాయల జీతము మీ కాలేజి వచ్చినది. ఆ జీతము హరప్ప చదువుకొర కిచ్చుచుండుట అనునది మానినది- హరప్పదగ్గరకు వచ్చెను. అతని రాజఠీవి కిరీటి వంక చూడనీయలేదు.

ధర్మా : ప్రభూ! ఈయనయు నేనును స్వామి ఆలయము లోనికిపోతిమి. సుబ్రహ్మణ్యేశ్వరుడు రెండు తలలతో ఆయనకు ప్రత్యక్షమైనాడు. ఈయన పేరు కిరీటి, నాకు స్నేహితుడు.

హరప్ప కిరీటి వంక చూచి మరల తన కనులు త్రిప్పుకొనెను. హరప్ప వెనుదిరికి పోవుచుండెను. వచ్చినవాడొక్క మాటాడలేదు. పోవుచు పోవుచు అనుకొనెను. "ధర్మారావు గారు చెప్పినది నిజమే! స్వామికి తక్కిన తలలన్నియు నశించిపోయినవి. కాదు కాదు నశించి పోవుట కాదు. దేవాలయముల్తో ఉండిపోయినవి. కిరీటి అదృష్టవంతుడు. నన్ను పెండ్లి చేసికొమ్మందురు. నేనేల చేసికొనవలయును? నేను స్వామి వేయి తలలు చూడవలసిన వాడను గాని, రెండు తలలు చూడవలసిన వాడను కాను. రెండు తలలకు నష్టము లేదు. తక్కిన తలలు నిలుపవలసినవాడను నేను. నేనొకఊరికి ప్రభువును. దేశమునకు కాదు. పూర్వకాలమున ఊరికిని దేశమునకును భేదములేదు. దేశమునాత్మ పూర్వము గ్రామమునందుండెడిది. అందుచే నొక గ్రామము ప్రభువు దేశము ప్రభువుగానైనాడు. ఇప్పుడు గ్రామము చెడిపోయినది. ఇచ్చట శక్తిపోయి దేశము మీద పడి సర్వధా వ్యభిచరించెను. వెలయాలి వలె అయ్యెను. నాకు వేయిపడగలు చూచు గీత లేదు. అది మా తాతల నాటికే పోయినది వెనుదిరిగి పోవుచున్న హరప్పను కిరీటి ధర్మారావులు చూచిరి. ఆయన తెల్లని పట్టు తలపాగ పైని వదలిన కుచ్చు గాలికి , కదలాడి జరీయంచు వలన రత్న విభ్రాజి ఫణామండలముతోడి తోకపై నిలిచి పరువెత్తుచున్న ముందుకు ముందుకు దూకుచున్న పామువలె కనిపించెను.

కిరీటి : ఈయన- ఎన్నియో సారులు చూచితిని. అదియే తలగుడ్డ, అటువంటిదే అంగీ, అటువంటిదే పంచె ధరించి ఉండుట. నిద్రకూడ వానితోడనే పోవునా?

ధర్మా : అసలు నిద్రపోయిన గదా! ఆయన తల్లిగారు చనిపోవు వేళ ఆయనకీ దుస్తులు నియమించి పోయిరట! అందుచేత నాయన సర్వకాలములయందు అట్లే ఉండును.

ఆ సాయం వేళ శశిరేఖా కిరీటులు సుబ్రహ్మణ్యేశ్వరాలయమునకు పోయి కొబ్బరి కాయలు కొట్టిరి. శశిరేఖ అశ్చర్యపోయెను. ఎచ్చటను స్వామి ఇంత ప్రత్యక్షముగ ఉండదు. ఆమె కిరీటిని "ఈ స్వామి ఎవ్వరిని కఱవడా?" అని అడిగినది. కిరిటి ధర్మారావు చెప్పన సమాధానము చెప్పెను అర్చకుడు నాలుగు కొబ్బరికాయలను నాల్గు సగము లతడు తీసుకొని, నాల్గు సగములు వీరి చేతికిచ్చెను. వారు గృహాభిముఖులైరి.

కిరీటి : "వదినగారైన మన వెంట రాలేదేమి?

శశి : "ఆవిడకు నొప్పులు వచ్చుచున్నట్లున్నవి. సామాన్యముగా నెలలు ముదిరిన తరువాత స్త్రీలంత ఓపికగా నుండలేరు. ఆమె విచిత్రమైన మనిసి మనము వచ్చిన మొదటి రోజున గిరికతో కలిసి దేవాలయమునకు వచ్చినది. ఆమె కఠోర గర్భిణి వలెనే ఉండదు. ఈ మూన్నాళ్ళ నుండియు ఇంటిలో ఎంత పని చేసినది?

ఇరువురు ఇంటికి వచ్చిరి. అరుంధతి లేచి తిరుగుచుండెను. శశిరేఖ "అక్కా! ఎట్లున్న"దనెను. అరుంధతి "బిగ్గరగా మాట్లాడకుము" మగవారికి వినపడును. నీ మగనితో అనలేదు గదా!" అనెను.

(ఇంకా ఉంది)

# మహిళా పాఠకుల శీర్షిక

# ఈ కాలం పెళ్ళిళ్ళు

నేడు మన దేశంలో వున్న ముఖ్య సమస్యలలో వివాహ సమస్య ఒకటి. మనదేశంలో ఈ సమస్య రూపుమాసి పోవాలంటే ఈ యుగాంతం తరువాతే నేమో అనిపిస్తోంది.

వరుడు అంటే వరించువాడు.




వధువు అంటే వరింపబడేది అని అర్థం. పూర్వకాలంలో వధువుతో పాటు కొంత ఆస్తిని అప్పగించేవారు. తరువాత కాలంలో డబ్బుగానీ, పొలం గానీ, పశు సంపదగానీ కానుకలుగా వధువుతో పాటు యిచ్చేవారు. వివాహానంతరం వరుడు వధువును, ఆమె జీవితకాలం పోషించాలి. అందుకు గాను వధువు తండ్రి ప్రేమపూర్వకంగా కొంత ఆస్తిని వివాహసమయంలో యిచ్చేవారు. ఆ కానుకలతో సంతోష పడి తమ కుమార్తెను చక్కగా, ప్రేమగా చూడగలడని వారి విశ్వాసం.



ఆ తరువాతి కాలంలో కన్యాశుల్కం అమలులోకి వచ్చింది. ముక్కుపచ్చ లారని పసిపాపలను సైతం కొని వివాహం చేసుకుంటుండేవారు. డబ్బుకి కక్కుర్తిపడి, మరీ చిన్న వయసుగల బాలబాలికలను కూడా వృద్ధులకు యిచ్చి పెళ్ళిచేసేవారు. పర్యవసానంగా చిన్న వయసులోనే వైధవ్యం ప్రాప్తించేది. స్త్రీల జీవితం దుర్భరమైంది ఆనాడు.

తర్వాత కాలంలో వరుల సంఖ్య తగ్గి వధువుల సంఖ్య బాగా పెరగ డంతో వరకట్నం ప్రవేశించింది. ప్రస్తుత సమాజంలో ఆడపిల్లలకు వరకట్నం యిచ్చి పెళ్ళి చేయాలంటే ఒక యజ్ఞం చేసినట్టే వుంటోంది వధువుల తలితండ్రులకు.

సంబంధం మాట్లాడుకోవటానికి వెళ్ళగానే అక్కడ ఎదురయ్యే మొట్ట మొదటి ప్రశ్న 'కట్నం ఎంతిస్తారు?' అని. ఇచ్చే కట్నం నచ్చితేనే పెండ్లి చూపులకు వస్తామంటారు. పెళ్ళి చూపులకు వచ్చిన తరువాత అమ్మాయిని యక్ష ప్రశ్నలు వేసి వేధించుకు తినేస్తారు. ఇంతా కట్నం నచ్చితే చాలదు సుమా! లాంఛనాలు మా స్థాహతుకు తగ్గట్టు జరగాలండి అంటూ చిన్న హెచ్చరిక చేస్తారు. వీటిలో ఏదివ్వకపోయినా ఆ సంబంధానికి నీళ్ళు వొదులుకోవాల్సిందే!

ఇంతా యిచ్చి పెళ్ళిచేసినా కాపురానికి వెళ్ళేటప్పుడు ఇంటిల్లిపాదికీ బట్టలు, సారె అడుగుతారు. తరువాత పెద్దపండుగని ఓ స్కూటర్! తరువాత స్త్రీ గర్భం ధరించగానే శ్రీమంతం పేరుతో కొంత డబ్బు ఖర్చు చేయిస్తారు. అంతటితో ఊరుకోరు. తొమ్మిదవమాసం రాగానే పురిటికి తీసుకుని పొమ్మంటారు. పుట్టిన వాళ్ళకు ఓ తులం బంగారం పెట్ట మంటారు. ఆరు నెలలు గడచీ గడవ గానే అన్నప్రాసన అంటారు. వెండిగిన్నె గుంజుతారు. ఆ తరువాత నోములనీ, పేరంటాలనీ, అవనీ, యివనీ వధువు తలితండ్రుల దగ్గర గుంజుతూనే వుంటారు వరుడి తలితండ్రులు. ప్రస్తుత మన సమాజంలో జరిగే ఈ "కాలం పెళ్ళిళ్ళు" యివి.

ఈ వరకట్నం రూపుమాసిపోదా? అంటే బాధ్యతగల వారందరూ కృషి చేస్తే తప్పకుండా కొన్ని దశాబ్దాల కైనా రూపుమాపొచ్చు. ముఖ్యంగా నేటి

## యువత మేల్కొనాలి!

యువతరంలో మార్పు రావాలి. కేవలం డబ్బు మాత్రమే జీవిత ధ్యేయం కాకూడదు. వరకట్నం సాంఘిక దురాచారం. దీనిని తుద ముట్టించడం ప్రతివాని కర్తవ్యం. అయాచితంగా వచ్చే వరకట్నంతో సంతృప్తిపడి వ్యక్తిత్వాన్ని కోల్పో కూడదు. కనుక మేల్కొవల్సింది నేటి యువతరమే.

– పద్మనాభుని పద్మావతి,
విజయవాడ ◪

కూపన్
ఆంధ్ర సచిత్ర వారపత్రిక

**ఈ కాలం పెళ్ళిళ్ళు**

పంపిన వారి పేరు ..............................................

పూర్తి చిరునామా ..............................................

..............................................

..............................................

పిన్ కోడ్: ..............................

## 17 వ ఏటనే అమ్మమ్మ అయిన అమ్మాయి!

పశ్చిమ ఆఫ్రికాకు చెందిన ముమ్ - జి అనే అమ్మాయికి తన ఏడో ఏట వివాహమై ఎనిమిదో ఏట శోభనమై తొమ్మిదో ఏట పండంటి ఆడబిడ్డ పుట్టిందట. ఆ ఆడబిడ్డ తన ఎనిమిదో ఏట పండంటి పిల్లకు తల్లి అయిందట. ముమ్ - జి - దీని వలన తన 17 వ ఏటనే అమ్మమ్మ అయి, ప్రపంచ చరిత్రలో నే ప్రథమ స్థానం ఆక్రమించుకున్నదట.

## అతి పొడవైన బల్లి!

తిరుపతి తలకోన అడవులలో ఆశ్చర్యకరమైన 18 అడుగుల పొడవు గల బల్లి కనబడిందట. ఇది మొసలి లా మొసలి కన్నా పెద్ద సైజులో వొళ్ళు గగుర్పొడి చేలా వున్నదట - వుండదూ మరి!

## అరబ్ దేశంలో ఆయుర్వేద వైద్యం!

ఆయుర్వేద వైద్యం భారతదేశంలో కన్నా యితర దేశాలలో నే ఎక్కువ గౌరవింపబడుతోందట. చరకుడు వ్రాసిన ఆయుర్వేద "సంహిత" అలనాడే అరబ్ దేశీయులు తమ భాషలోకి అనువదించుకుని ఆచరించారట. 2 వ శతాబ్దానికి చెందిన యీ మహర్షి తరువాత 8 వ శతాబ్దంలో శుశ్రుతుడు అనే మహర్షి శస్త్ర చికిత్స, పరికరాలు, శరీరంలో కుళ్ళిన, చచ్చిన అవయవాన్ని తీసి వేయుట వంటివన్నీ నిర్వచించి వ్రాసిన "శుశ్రుత సంహిత" అనే గ్రంథాన్ని అరబ్ దేశం "కితాబ్ - ఎ - శుశ్రుద్" అనే పేరుతో తమ భాషలోకి అనువదించుకుని దానిని ఆచరించారట- మనమో! వుయ్!! ఇపుడు అరబ్ నుంచి ఆ గ్రంథాలను మన భాషలోకి తెచ్చుకోడానికి వుత్సాహ పడతాం - తామా!

## ఆసుపత్రి పాలైన అల్లుడు!

పులియంపట్టికి చెందిన పళని సామికి, అతని మామగారు పెరియసామికి కట్నం విషయంలో తరుచు పోట్లాట వస్తూ ఉండేదట. ఒకనాటి పోట్లాటలో పెరియసామి, ఆయన కొడుకు చెల్లాను కలిసి పళనిసామిని చితక బాదడమే గాక, కత్తితో పొడిచి పరారై పోయారట. పళనిసామి ఆసుపత్రి పాలైయ్యాడట.

## భార్య అక్రమ సంబంధం - భర్త జైలు పాలు

పొల్లాచికి చెందిన 37 ఏళ్ళ సుబ్బన్ భార్య 30 ఏళ్ళ కరుప్పాళ్ అదే వూరుకు చెందిన 55 ఏళ్ళ పళని అనే ఆసామితో రహస్య సంబంధం పెట్టుకుని తన సామి వూళ్ళో లేనపుడా సామితో తన కామ దాహం తీర్చుకునేదట. ఈ విషయం చెవిన పడ్డ సుబ్బన్ అవునా అని విచారిస్తే "అవూ" అన్నదటామె ఎంచక్కా. దాంతో సుబ్బన్ పెళ్ళాన్ని చితకతన్ని నడి బజార్లో దొరికిన ఆ పళనిని కత్తితో కచకచమని పొడిచేశాడట. పొట్టు తగలాల్సిన చోట తగలక పోడంతో పళని చావు తప్పించుకున్నాడట. సుబ్బన్ జైలుపాలయ్యాడట.

## శృంగార సాహిత్యం లాభసాటి బేరం!

పెట్రేగిపోతున్న శృంగార సాహిత్యాన్ని కాస్త కుదపాయించడానికి ఫ్రెంచి ప్రభుత్వం వో కొత్త రకం చిట్కా కనిపెట్టిందట! ఈ శృంగార సాహిత్యం మీదా, వీడియో క్యాసెట్లమీదా నలభై శాతం పన్ను విధించి, ఆ రాబడిని సత్కార్యాలకు వినియోగించ




తీర్మానించిందట. ఇదేమి చిట్కా అని అడిగిన వారికి ఆ శాఖ సంబంధ అధికారి ఈ శృంగార సాహిత్యాన్ని, వగైరాలను నిర్మూలించడం అసాధ్య మనీ, అవి ఎంత అపితే అంత ఎక్కువగా పైకి లేస్తాయనీ, కనుక వీటిమీద పన్నులు విధిస్తే కనీసం ప్రభుత్వానికి ఆదాయం అయినా వుంటుందని అన్నారట పాయింటే.

## ఇరవై రూపాయలకోసం హత్యాప్రయత్నం!

సేలం జాన్సన్ పేటకు చెందిన 24 ఏళ్ల శేఖర్ అనే అతను తన బావమరది 25 ఏళ్ళ దురైరాజ్‌కు అర్నెల్ల క్రితం వో ఇరవై రూపాయలప్పు యిచ్చాడట. ఆ డబ్బు తిరిగి అడగడంతో యిస్తాను రమ్మని వూరు చివరకలా ఖబుర్లు చెపుతూ తీసుకుపోయి, అక్కడ లటుక్కున శేఖర్ని వో లారీ కింద తోసేయ బోయాడట. దైవికంగా శేఖరు తప్పించుకుని, పోలీసురిపోర్టిచ్చి దురైరాజ్‌ను అరెస్టు చేయించాడట.

## ప్రేమికుల్ని కలిపిన పోలీసులు!

మెట్టూరు సుబ్రహ్మణ్య పురానికి చెందిన 23 ఏళ్ళ రోజ్‌మేరీ అనె ఆమె ఎదురింటి వారబ్బాయి 24 ఏళ్ళ గోవిందరాజు అనె అతన్ని ప్రేమించి, ప్రేమింప చెసుకుందట. అనక వీళ్ళిద్దరూ కలసి తారమంగళం అనెవూరు వెళ్ళి అక్కడ పోలీస్టేషనులో తమ ప్రేమకథ చెప్పి వారి సహాయంతో వో గుడిలో పెళ్ళి చేసేసుకుని, అనక మెట్టూరు పోలీసుసబ్ ఇనస్పెక్టరుతో యీ కథంతా చెప్పి, తమ తమ తలిదండ్రులను సమాధాన పరచమన్నారట. ఆయన వారిని పిలిచి, నచ్చచెప్పి పిల్లల కష్టంతలు వేయించాడట-

## స్టౌ పగిలి యువతి దుర్మరణం

నామగిరిపేటకు చెందిన 30 ఏళ్ళ హంసవల్లి అనె ఆమె తన భర్తకు కాఫీ పెట్టే ప్రయత్నంలో స్టౌను కాస్త తొందర పెట్టే సరికది ధామ్మని పగిలి, అమంటలెగిసి, ఆమె చీరనంటుకున్నాయట. ఆమె ఆ మంటల్తో రోడ్డున పరుగులెట్టి, మంట లింకా పెరగడంతో కాలి, పరితాపంగా చనిపోయిందట.

## ప్రాణం తీసిన ప్రేమాయణం!

అత్తూరుకు చెందిన పళనియమ్మ అనె ఆమె అదే వూరుకు చెందిన పెరుమాళ్ అనే అతనితోటలో పని చేస్తూ అతనితో చక్కగా రహస్య ప్రేమాయణం పెట్టుకుందట. ఈ విషయం తెలిసిన ఆమె భర్త గోవిందరాజులు పిల్ల తల్లివి నీకిదేం తెగులు అని తిట్టి, వో నాలుగు బాదాడట. మొగుడుకు తెలిశాక, యిహ ఆ భయం కూడా పోయి పళనియమ్మ పెట్రేగి పోయిందట. అనక ఆమె అవూరి చివరి నూతిలో శవంగా తేలడంతో పోలీసులు అనుమానించి, పరారైన ఆమె భర్తను వెతుకుతున్నారట.

## అంటరాని కరెంటు తీగ!

హిమాచల ప్రదేశ్‌కు చెందిన మలానా అనె గ్రామానికి అక్కడి ప్రభుత్వం కరెంటు స్థంబాలు నాటి, విద్యుత్ సౌకర్యం కలిగించి గ్రామ పౌరులారా మీ యిళ్ళకు కూడా కరెంటు పెట్టుకోండి అని అంటే వారు మొరాయించారట. ఇంతకీ అసలు కారణం ఆ కరెంటు తీగలను తీసుకు వచ్చిన మొదటి స్థంభం వో హరిజనుని యింటిని తాకిందట. దాంతో ఆ వూరి పూజారి అస్పృశ్యుని యింటిని తాకిన కరెంటు కూడా అంటరానిదేననీ, ఆ కరెంటును ఎవ్వరూ తమ యిళ్ళలోకి ఆహ్వానించరాదనీ అన్నాడట. వోరి వీడి కడుపుడకా! ☐

## సీరియల్

# డి.ఎస్.పి. విజయ్

ఆమూరి సావిత్రి



(గత సంచిక తరువాయి)

ఇంకో రెండు నెలలు గడిచేసరికి కొడుకు గురించిన మనోవ్యధతో మంచం పట్టింది సింగారి.

ఆమె ప్రియుడు తెగించి, తన సావాసగాళ్ళతో వచ్చి సింగారి లేచొచ్చిన గూడెం చుట్టుపట్ల ఆమె కొడుకును ఎత్తుకు రావటానికి మాటేశాడు.

ఈ విషయం తెలిసిన ఇవతలి గూడెపు చెంచులు వేట ప్రారంభించారు. .

సింగారి ప్రియుడు ఎలాగో ప్రాణాలతో బయటపడి తన గూడెం చేరుకుని, ఆమెను తన కొడుకు మీద ఆశ వదిలేసుకోమని... ఇంకో కొడుకును కని, వాడిలో నే మొదటి వాడిని చూసుకోమని హితవు చెప్పాడు.

సింగారి తల్లి మనసు ఎదురు తిరిగింది.

తన కొడుకు మీద తన కింతటి ప్రేమ ఉందని గానీ... అది ఇంత ఉధృతంగా పైకెగసి తనను నలిపేస్తుందని గానీ సింగారి ఎరుగదు.

జ్వరంతో ఉన్న సింగారి తన గుడిశలో మంచం మీద పడుకుని ఉంది...

మూడొంతుల మంది అడివికి పోయారు

పిల్లలంతా గుడిశల మధ్య చేరి ఆడుకుంటున్నారు .. ముసలీముతకా గుడిశ బయట చతికిల పడి మాట్లాడుకుంటున్నారు...

నెమ్మదిగా లేచి బయట కొచ్చి నిలబడింది సింగారి. ఆడుకుంటున్న పిల్లల్ని చూస్తుంటే ఆమెకు తన కొడుకేగుర్తొస్తున్నాడు.

పిచ్చి తండ్రి! ఎలా ఉన్నాడో! వాడు కూడా ఇలాగే తన కోసం దిగులు పెట్టుకుని, చిక్కి శల్యమై ఉంటాడు! తన మొగుడు మారు మనువు చేసుకున్నాట్ట ఈ కూన నెవరు చూసుకుంటున్నారో! తనసలు తల్లేనా?

తన సుఖమే చూసుకుని ఆ పసికూన నలా వదిలేసి వచ్చిన తను తల్లి కాదు. రాక్షసి!

గోడకి జార్లబడి వెక్కి వెక్కి ఏడుస్తోంది సింగారి.. ఎంత ఏడ్చినా కడుపు లోంచి తన్ను కొస్తున్న బాధ తగ్గటం లేదు.

చివరికిహ నిగ్రహించుకోలేని సింగారి ఒక స్థిర నిశ్చయాని కొచ్చిన దానిలా లేచి, గుడిశ తలుపు లాగి గొళ్ళెం పెట్టి తన గూడెం వేపు నడక సాగించింది.

కొడుకును ఒక్కసారి చూడాలనే కోరిక కున్న శక్తి ఆమె భయాన్ని పోగొట్టి, నడిచే శక్తినిస్తోంది.

అడివిలో ప్రతి చోటూ తెలుసా పిల్లకు

అలాగే నీరసంగా: గంటల తరబడీ నడిచి తన గూడెం దరి దాపులకు చేరుకుంది.

> జరిగిన కథ-25: గోదావరి వరదల్లో మాధవరావు టుంబం కొట్టుకు పోతుంది. వైజయంతి ఏమయిందో తెలియదు. కొత్త సి ఐ జగన్నాథం జరపబోయిన అత్యాచారాన్ని నివారించి విజయ్ సిఐతో శత్రుత్వం తెచ్చుకుంటాడు. ఆ సందర్భంగా పరిచయమైన చెంచులతో వాళ్ళ గూడానికి వెళ్ళి పరిశోధన ప్రారంభిస్తాడు. చెంచీతకు మరో గూడెం యువకుడు పోతరాజుతో మనసు కలుస్తుంది.

శత్రువుల బారి నుంచి, కొన ప్రాణాలతో కట్టు బట్టలతో బయట పడ్డ కాందిసీకురాలిలా ఉన్నది సింగారి.

బిడ్డను కోల్పోయిన పేదతల్లిలా ఉందామె. దూరాన్నుంచి ఆ గూడెపు గుడిశలు కనిపిస్తున్నాయి... ఒక గుడిశ సమీపంలో చెట్టు చాటున దట్టంగా అల్లుకున్న పొదల చాటున దాగి గుడిశ బయట ఆడుకుంటున్న కొడుకును కళ్ళ నిండుగా... ఆర్తిగా చూసుకుంటోంది సింగారి.

ఒక్కసారి లేచెళ్ళి వాడిని గుండెల కదుముకోవాలనే కోరిక ఆమెను వెర్రెక్కిస్తోంది... నిగ్రహించుకోలేక పోతోంది. బాణాలాట ఆడుకుంటున్నారు పిల్లలు... ఆమె కొడుకు విసిరిన బాణం సింగారి దాక్కున్న పొదల ముందున్న చెట్టుకు గుచ్చుకుంది.

బాణం లాక్కోటానికి చెట్టు దగ్గర కొస్తున్న కొడుకును ఉద్వేగంగా చూస్తోంది సింగారి

చెట్టు నుంచి బాణం లాగుతున్న కొడుకును చూసి ఇహ ఆపుకోలేక "కూనా!?" అన్నదామె

తల్లి పిలుపు వాడికి గుర్తే చెట్టు చాటు కొచ్చి, పొదల మధ్య నుంచి పైకి లేచిన తల్లిని ఆశ్చర్యంగా.. అపనమ్మకంగా చూసి ఒక్క ఊపున వెళ్ళి ఆమె మెడను కావలించుకుని, చీర కుచ్చెళ్ళలో మొహం దాచుకుని వెక్కిళ్ళు పెట్టి ఏడవ సాగాడు వాడు.

వాడిని గుండెల కదుముకుని, మోకాళ్ళ మీద కూచుని ముద్దులు కురిపిస్తూ . కన్నీళ్ళు కారుస్తూ బాహ్య స్మృతిని కోల్పోయింది సింగారి.

అడివిలో ప్రతి చెట్టు.. ప్రతి పొదా ఆ తల్లీ కొడుకుల్ని జాలిగా, విషాదంగా చూస్తోంది .

ఉన్నట్టుండి కెవ్వున అరిచాడా కుర్రాడు. ఒక బాణం సూటిగా వచ్చి వాడి వెన్నులో దిగబడింది

పెద్దగా అరుస్తూ.. వాడిని చేతుల మధ్య దాచుకోటానికి వృథా ప్రయత్నం చేస్తూ తల ఎత్తిందామె

మండే కళ్ళతో... క్రూరమృగంలా ఉన్న భర్తని చూసి ఒక్కసారిగా స్పృహ తెచ్చుకుని, కుర్రాడిని గుండెల కదుముకుని పరుగెత్త సాగింది సింగారి...

కుర్రాడి శరీరం నుంచి కారుతున్న రక్తం ఆమె చేతుల్ని, ఒంటినీ ఎర్రగా తడిపేస్తోంది...

ఆమె పూర్తిగా పరుగందుకోక ముందే వెనుక నుంచి వరసగా వచ్చి తగిలాయి బాణాలు..

మొదలు నరికిన చెట్టులా కుర్రాడితో సహా కూలిపోయిందామె .

కుర్రాడు అప్పటికే చచ్చిపోయాడు.

ఆ రెండు శవాల్నీ గురప్ప పందిట్లోకి ఈడ్చుకొచ్చారు. సింగారి మొగుడి మొహం కక్షతో... విజయగర్వంతో పైశాచికంగా ఉంది...

అడివిలో నుంచి తిరిగి వచ్చిన విజయ్ ఈ దృశ్యాన్ని చూసి నిర్ఘాంతపోయాడు. అతనిలో ఆవేశం కట్టలు తెంచుకుంది...

"మీరు మనుషులా పశువులా? నిండు ప్రాణాలని నిలువునా తీస్తారా




అసలు తల్లీ బిడ్డల్నీ విడదీసే హక్కు మీకెవరిచ్చారు? స్కౌండ్రల్స్ అంటూ విరుచుకుపడ్డాడు

ఆడు నా కొడుకు ఆడి మీద దానికేం హక్కు లేదు ఒకసారి ఈడ నుంచి వెళ్ళిపోయాక తిరిగి ఇక్కడడుగెట్టకూడదు పెట్టిందా ఇంతే మొండిగా అన్నాడు సింగారి మొగుడు

అందరి మొహాల్లోనూ వాడి మాటలకు మద్దతు కనపడుతోంది విజయ్ అలా సింగారి తరుపున వాదించటం వాళ్ళకి నచ్చలేదు

గూడెంలో వాళ్ళంతా చాలా ఆవేశంగా ఉన్నారు అక్కడి వాతావరణం నిండా టెన్షన్

ఇలాంటప్పుడక్కడ ఎక్కువగా వాదించటం ప్రమాదం గురప్ప విజయ్‌ని బ్రతిమాలి అవతలికి తీసి కెళ్ళిపోయాడు. •

'ఇదేం సాంప్రదాయం? ఆ పిల్లకు మొగుడంటే మొహం మొత్తి అవతలికి పోయింది

కన్నబిడ్డను ఒక్కసారి వచ్చి కళ్ళతో చూసుకున్నందుకామెనూ, బిడ్డనూ ఇలా పైశాచికంగా చంపుతారా!

ఛీగా . అందరూ కలిసి దీన్ని సమర్ధిస్తారా! కుల పెద్దవయి వండీ నువ్వూ వాళ్ళ చర్యలను అంగీకరిస్తావా!

సింగారి మొగుడు కూడా ఇంకో దాన్ని పెళ్ళి చేసుకున్నాడుగా? మరి వాడి నెందుకు చంపరు?

ఆమె చేసిన తప్పునే తిరిగి అతనూ చేసినప్పుడు ఆమె మీద అతనికసలు అధికార మెక్కడిది?

సింగారినీ, ఆమె కొడుకునూ చంపినందుకు వాడిని అరెస్ట్ చేసి, ఉరి శిక్ష పడేలా చేస్తాను అంటూ పైరయి పోతున్న విజయ్‌ని శాంతపరచ లేక చస్తున్నాడు గురప్ప!

'నిన్ను నమ్మి ఆశ్రయమిస్తే మమ్మల్నిలా వెన్నుపోటు పొడుస్తావా! మా వాళ్ళని తీసికెళ్ళి ఉరి శిక్ష వేయించి పోలీసుల్ని మా మీదకు ఉసి గొలుపుతావా!" అనే ప్రశ్నను గురప్ప కళ్ళలో చదవగలిగిన విజయ్ కొద్దిగా తగ్గాడు

"నీకు తెలవదు దొరా ఈ కట్టుబాట్లు ఆచారాలు ఈ నాటివి కావు ఇవి ఇంతే

అలా వెళ్ళి పోదలుచుకుంటే పిల్లల గురించి ముందే ఆలోచించుకోవాల కాదని వెళ్ళిపోయినప్పుడు ఇహ వీళ్ళ గురించి పట్టించుకోగూడదు

మా కులంలో కట్టుబాటు తప్పితే ఎవరూ ఊరుకోరు వీటి సంగతి తెలిసుండీ అలా పారిపోవటం తెగించి మళ్ళీ ఇలా పిల్లల కోసం రావటం తప్పు

గూడెంలో అంతా ఆవేశంగా ఉన్నారు నువ్వు మా ఆచారాల జోలికి రాకు దొరా అన్నాడు గురప్ప

# నచ్చిన సన్నివేశం

"మమ్మీ నేనేమడిగినా చేస్తుంది. కానీ తన దగ్గరే ఉంచుకోమంటే మాత్రం ఒప్పుకోనేదికాదు. నేను ఏడిస్తే మమ్మీకూడా ఏడ్చేది.

అందుకే నేను అసలు ఏడవను. మమ్మీ నాదగ్గర నుండి వెళ్ళి పోయే టప్పుడు ఏడు పొచ్చినా ఆపు కుంటాను. తనెళ్ళి పోయాక ఏడుస్తాను.

ప్రతి ఫెస్టివల్‌కి, నా పుట్టిన్రోజుకి మమ్మీ వైజాగ్ వచ్చేది. ఆ ఒక్కరోజు నాతో ఉండేది.

తను నాకోసం ఏడుస్తూనే ఉంటుంది.

మమ్మీకి నేనంటే ఎంతఇష్టమో!

"అంకుల్ మీరెప్పుడు ఏడిపిస్తారు మమ్మీని?"



ఈ సన్నివేశం ప్రతి మాతృహృదయాన్ని కదిలించేలా ఉంది.

—జె. జ్యోతి, ఆటో నగర్,
విశాఖపట్నం

* * *

కర్తవ్య నిర్వహణలో రాత్రనక, పగలనక శ్రమిస్తూ ఎదురయ్యే సమస్యల్ని వీరోచితంగా ప్రతిఘటిస్తూ శారీరకంగానూ, మానసికంగానూ అలసినవేళ వేడి నీళ్ళ స్నానం చేసి రిలాక్సవుతున్న సమయంలో నానీ ఎంతో ప్రేమతో, ఆప్యాయతతో ఇచ్చిన చాక్‌లేట్ తీసుకొన్న డి. ఎస్. పి. విజయ్ విషయం ఏమిటని అడిగితే, బర్త్‌డే అని చెప్పటం, విజయ్ అతన్ని ప్రేమతో అనురాగ అతిశయంతో అక్కున చేర్చుకొని మంచి మనసుతో ఆశీస్సుల నివ్వటం, ఆ శుభ సందర్భంలో తల్లిలేని లోటును మాటలద్వారా నాని చెప్పిన తీరు, ఆ పదాలు మనసున్న ప్రతి పాఠకుడ్ని, పాఠకురాల్ని కదిలించి కన్నీరు రప్పించకమానదు.

ఆ పసిమనసు క్కావల్సింది వేళకు తిండి, వేసుకోడాన్కి డ్రస్, సర్వదా



సదుపాయాలు కావు. తల్లి నీడలో నడవాలని, ఆ తల్లి ఒడిలో బజ్జోవాలని, తల్లి లాలనలో ఆనంద డోలికల్లో ఊయల లూగాలని, ముద్దు ముద్దు మాటల్తో తల్లిని మురిపించాలని, ఆ తల్లి చెప్పే చిట్టి పొట్టి కథలు విని అబ్బుర పడాలని, తన బుడి బుడి నడకలతో, చిలిపి చిలిపి చేష్టలతో, ప్రశ్నలతో అమ్మని ఉక్కిరి బిక్కిరి చేయాలని పడుతున్న ఆ తనయుని తపన, ఆవేదన, ఆత్మక్షోభ నివేదనకు అక్షర రూపమిచ్చిన రచయిత్రి శైలి, భావం, పదాల పొందిక ప్రశంసనీయం. విజయ్ ఆదరణ, ఆ చిన్నారి అపురూప ప్రవృత్తి నిజంగా ఆ సన్నివేశానికి నిండుదనాన్ని, శోభను చేకూర్చటం గమనార్హం.

-వై. చంద్రశేఖరరెడ్డి,
చిత్తూరు

* * *

డి. ఎస్. పి. విజయ్ సీరియల్‌లో విజయ్ సౌందర్య విషయమ్మై మురళీధర్‌తో చెప్పడం, మురళి ఆమె పట్ల మక్కువ చూపడం, మురళీధర్ సౌందర్యను కలుసుకొని పరిచయం చేసుకోవడం, సౌందర్య కోరికపై మురళీధర్ మరొక రోజు క్యాంపులో ఉండటానికి నిర్ణయించుకొనేందుకు ఆలోచించడం వంటి సన్నివేశం నాకు బాగా నచ్చినది.

సౌందర్య- మురళీధర్, హోటల్ మయూరిలో ఫామిలీ రూములో ఆర్డర్ చేయటం లాంటి సన్నివేశాలు చలన



## డి ఎస్ పి విజయం

"నీ కూతురయితే... ఇలా చంపితే.. ఈ మాటే అంటావా?" అక్కసుగా అన్నాడు విజయ్.

"నా కూతురయినా అంతే. అప్పుడు కూడా నేను మా ఆచారాన్ని




ఎదిరించను. దాని మొగుడు దాన్నిలా చంపుతున్నా నోరెత్తను" స్థిరంగా అన్నాడు గురప్ప....

సింగారి, దాని కొడుకుల హత్య చెంచీత మనసు మీద బలంగా పని చేసింది...

తమ సాంప్రదాయాల గురించి ఆమెకు తెలుసు.

చిన్నప్పుడెప్పుడో ఇలాంటి హత్యను చూసింది కూడా. తరవాత ఎవరూ ఇలా సాహసించలేదు. మళ్లీ ఇన్నాళ్ళకి సింగారి, ఆమె కొడుకుల హత్య చెంచీత ఎదిగిన మనసును విపరీతంగా స్పందింప చేసింది. రేపు తను... తన కొడుకు...

తన చిన్నారి కూన కుచ్చు కూడా రేపిలాగే రక్తం మడుగులో గిలగిలా తన్నుకుంటూ...

భరించలేనట్టు కళ్ళు మూసుకుందామె.

ఆ రోజు... ఆ రాత్రి ఆలోచించి, ఆలోచించి సంఘర్షణతో నలిగిపోయిన చెంచీత తెల్లవారు ఝామున ఒక నిర్ణయానికొచ్చేసింది.

గుడిశలో నుంచి బయట కొచ్చిందామె...

చీకట్లో చెట్లు దయ్యాల్లా జుట్లు విరబోసుకున్నట్టున్నాయి... గుడిశ ఎదురుగా కాస్త దూరంలో ఉన్న చింత చెట్టు కేసి నడిచింది చెంచీత....

గురప్ప వాకిట్లోకి చెంచు గూడెం మొత్తం చేరింది. గోల గోలగా

చిత్రము మనముందు నడుస్తున్న ట్టుగా ఉంది.

– ఎస్. సాయిపోతన, కశింకోట (విశాఖ)

★ ★ ★

సౌందర్యను శ్రీధర్ ప్రేమించి నట్లు నటించి వివాహము చేసు



కొంటాను అని మాట ఇచ్చి ఆమెను ఒక ఆటబొమ్మగా వాడుకొని ఆమె జీవితమును సుడిగుండముగా మార్చి నాడు. అయినను ఆమె సమాన్య స్త్రీగా కృశించి పోక స్త్రీవంచితుడు అయిన శ్రీధర్ని, అతని అనుచరులను కలిపి బ్లూస్టార్ వ్యాపారము రూపు మాపుటకు, అమాయకపు స్త్రీల జీవితాలు బలికాకుండ వుండడానికి, డి. ఎస్ పి విజయ్ సహాయము కోరిన వెంటనే జాప్యం చేయక తన వృత్తి రీత్యా విద్యుక్తధర్మంను నిర్వర్తించి అమాయకపు స్త్రీలను కాపాడిన ఘనత డి. ఎస్. పి. విజయ్‌కే దక్కింది. అందువలన ఆ సన్నివేశము నాకెంతో నచ్చినది.

–యమ్. కృష్ణకుమారి, సరస్వతిపురం (కడప)

★ ★ ★

"ఒక ఫియట్ కారు అజంతా ఎంటర్‌ప్రయిజెస్ ముందు ఆగింది.

'దానికి ముందు ఓ అంబాసిడర్ వెళ్ళిపోయింది. వెనుక కాస్త దూరంలో ఇంకో కారు దీన్ని ఫాలో అవుతోంది....

డ్రైవరు, వెనుక సీట్లో ఉన్న మిగతా ముగ్గురూ కారులోనే ఉన్నారు. మఫ్టీలో ఉన్న విజయ్ కారు దిగి



షాపులో కొచ్చాడు.

"హెరాల్డ్ రాబిన్స్ నవలలున్నాయా?..." అంటూ పేర్లు చెపుతున్న ఆ యువకుడిని ఎగాదిగా చూశాడు షాపు ఓనర్ నరహరి.

పుస్తకాల ర్యాక్ దగ్గర అటు తిరిగి నిలబడ్డ నరహరి వెనక్కు పుస్తకాలు చూసే నెపంతో సమీపంగా వెళ్ళాడు విజయ్. నరహరి భుజం మీదుగా చెయ్యిచాపి "అదిగో ఆ పుస్తకం తియ్యండి" అన్నాడు. అలా చూపించటానికి వెళ్ళిన విజయ్ చెయ్యి వెనక్కు వస్తున్నట్లే వచ్చి నరహరి మెడను కత్తిలా తాకింది.

సస్పెన్స్‌తో ఊపిరి తిప్పుకోనివ్వని ఈ సన్నివేశం నాకు మరీ మరీ నచ్చింది.

శైలి సుందరంగా.... సన్నివేశాల అల్లిక పటిష్ఠంగా ఉన్నది.

-సి. హెచ్. వెంకటేశ్వర్లు, చెరుకూరు (ప్రకాశం)

★ ★ ★

"కళ్ళు తెరుచుకొని చీకట్లోకి దెయ్యంలా చూస్తూ పడుకుంది సౌందర్య....

భయం... జుగుప్స... నిస్సహాయత ఆమెను వివశురాల్ని చేస్తున్నాయి.

ఒళ్ళంతా పచ్చిపుండులా... మనసు అంతకన్నా పచ్చిగా ఉంది...

పగతో రగిలిపోతుందామె...

ఆ శ్రీధర్‌గాడిని హత్య చేస్తే?



తను ఉరికంబమెక్కినా.... కొందరు ఆడపిల్లలయినా అతని బారినుంచి రక్షింపబడుతారుగా!

వాడిని ముక్కలు ముక్కలుగా నరకాలి... లేదా... వాడు కటకటాల వెనుక బడి, కుళ్ళి చచ్చేలాగా నయినా చెయ్యాలి. అతను చేసిన పనికి నిశ్శబ్దంగా విలపిస్తూ పిరికిదానిలా పడుండటం తన చేతకాదు. అలాంటి వాళ్ళమీద ఎవరో ఒకరు తిరగబడాలి...

ఆ పని తనే చేసి విజయం సాధిస్తుంది..."

దారుణంగా శ్రీధర్ చేతిలో మోసపోయిన సౌందర్య పిరికిదానిలా ఏడ్చి ఆత్మహత్య చేసుకోకుండా ఇలా ధైర్యంగా తిరగబడటం నాకు ఎంతో నచ్చింది.

-కల్యూరి నాగరత్నమ్మ, జమ్మలపాలెం (ప్రకాశం) ■

---

మాట్లాడుకుంటూ

అరుపులు శోకాలు

చటుక్కున కళ్ళు తెరిచి అయోమయంగా చూశాడు విజయ్ ఏడుపులు గురప్ప వాకిట్లో నుంచి వినపడ్డం చూసి అదుర్దాగా లేచి బయట కొచ్చాడు

పందిరి కిందకు చూసిన విజయ్ దిగ్భ్రాంతితో నిశ్చేష్టుడయ్యాడు

అందమైన చెంచీత వికృతమైన శవాకారంగా మారి గురప్ప పందిరి కింద పడుకోబెట్టబడి ఉంది

ఉరి పోసుకు చనిపోయిందామె!

కుచ్చూ నీలి గొంతెండి పోయేలా ఏడుస్తున్నారు, గురప్ప చేతుల్లో మొహం దాచుకుని కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నాడు కొందరతన్ని ఓదారుస్తున్నారు

చెంచీత మొగుడు కుచ్చును ఆపలేక సతమతమవుతున్నాడు అందర్నీ విదిలించుకుని తల్లి వేపు పరుగెడుతున్నాడు వాడు తల్లి మీద పడి ఏడుస్తున్నాడు

భరించలేనంత మానసిక సంఘర్షణకు గురయి బతకటానికి ఏ విధమైన మార్గమూ దొరకనప్పుడే మనిషి ఆత్మహత్య వేపు పరుగెడతాడు

ఎంతటి కష్టాల్లో ఉన్నా మానవుడు బ్రతకటానికే ప్రయత్నిస్తాడు అందుకే పోరాడతాడు "

చెంచీతకు ఇంతటి విరక్తి దేనికి కలిగింది? ఏ సంఘటన లామె నందుకు పురి కొల్పాయి?! బలవంతంగా ప్రాణాలు తీసుకుందామనుకునేంత దారుణమైన



హింస కామె ఎలా గురయింది?

ముఖ్యంగా... సింగారి చనిపోయిన వెంటనే చెంచీత ఎందుకు ఆత్మహత్య చేసుకోవాలి సొచ్చింది.

ఈ రెంటికీ ఏమిటి సంబంధం?

విజయ్ మనసులో చప్పున ఏ సంఘటన మెరిసింది రంగారావు ఉనికి కోసం గాలిస్తూ తిరుగుతున్న విజయ్ ఓ సారి చెంచీతా పోతరాజుల్ని చూశాడు కానీ... అతను వాళ్ళ నంతగా పట్టించుకోలేదు.

మొన్నటి సింగారి, ఆమె కొడుకుల హత్యతో పోతరాజు చెంచీతల కలయికను కలిపి చూస్తే చెంచీత ఎందుకు ఆత్మహత్య చేసుకుందో అర్థమయింది విజయ్‌కి ఎవర్నీ ఒదులుకోలేని చెంచీత చివరికీ పరిష్కారాన్ని ఎన్నుకుంది.

తల్లి కోసం అలమటిస్తూ లేగదూడల్లా దరి చేరబోయిన అమాయకమైన పసిబిడ్డల్ని కూడా ఆచారాల పేరుతో వధించే కిరాతకులైన చెంచుల్ని మొదటిసారిగా అసహ్యించుకున్నాడు విజయ్.

వీళ్ళ మూర్ఖత్వాన్ని ఎలా మార్చాలి?

ఈ ప్రశ్న విజయ్‌ని వేధిస్తోంది...

ఏడుపులు మొత్తుకోళ్ళ మధ్య... చెంచీత అంత్య క్రియలు జరిగాయి.

ఒక బాధ్యత గల పోలీసాఫీసర్‌గా హంతకుల్ని పట్టుకుని చట్టం ముందు నిలబెట్టలేకపోయినందుకు బాధగా ఉంది విజయ్‌కి.

నమ్మి ఆశ్రయమిచ్చిన వాళ్ళని అంతకంటే కిరాతకంగా వెన్నుపోటు పొడవలేక వెనుకాడుతున్నాడు.

వృత్తి ధర్మానికీ మానవత్వానికీ మధ్య నలిగిపోతున్నాడు విజయ్.

తను ఇప్పుడు వీళ్ళ నరెస్టు చేస్తే మొత్తం గూడెమంతా చెదిరి పోతారు. ఎరప్ప ఇహ జన్మలో తనను నమ్మడు. వీళ్ళు సహాయం లేకుండా రంగారావు స్థావరాన్ని కనిపెట్టటం... తిరుగులేని సాక్ష్యాధారాలతో అతన్ని పట్టుకోటం పూర్తిగా అసాధ్యం.

ఈ చెంచుల కన్నా రంగారావు అతి క్రూరుడు. . ఈ దేశపు ఆడబడుచుల్ని విదేశాలకు తార్చే దేశద్రోహి. సంఘ విద్రోహి.

ఒక పెద్ద గీత ముందు అంత కన్నా పెద్ద గీత గీస్తే మొదటి గీత చిన్నదవుతుంది.

చెంచుల్నీ రంగారావునీ కంపేర్ చేసుకుంటే బాధ్యత రంగారావు వేపే మొగ్గింది.

ప్రస్తుతం వీళ్ళ సంగతి వాయిదా వేసి ముందు వాడి సంగతే తేల్చాలి.

ఇలా అనుకున్నాక చెంచుల్ని అరెస్ట్ చేసే విషయాన్ని వాయిదా వేసుకున్నాడు విజయ్.

కానీ... ఏమాత్రం వీలయినా వీళ్ళలో అతి చిన్న మార్పయినా తీసుకురావాలనే పట్టుదల మాత్రం అతన్నొదిలి పోలేదు.

* * * *

అర్ధరాత్రి మెలకువ వచ్చిన విజయ్‌కి దాహంగా అనిపించి లేచి కూర్చున్నాడు...

పందిరి గుంజ నానుకుని ఒక ఆకారం కూలబడి ఉంది. జాగ్రత్తగా చూశాడు విజయ్...

చుక్కల గుడ్డి వెలుతురులో అతన్ని గురప్పగా గుర్తించాడు. గుడ్డ మొహాన కప్పుకుని నిశ్శబ్దంగా దుఃఖిస్తున్నాడతను...

అతనికి చెంచీతంటే ఎంత ప్రేమో విజయ్‌కి తెలుసు. అతని దగ్గర కెళ్ళి "గురప్పా!" అని పిలిచాడు ఆదరంగా. ఆ ఆదరణ అతనిలో దుఃఖాన్ని ఇంకా అధికం చేసింది. ఆ ఉద్ధృతం తగ్గే వరకూ వేచి ఉన్నాడు విజయ్

"దొరా... నా కూన ఎందుకిలా బలవంతంగా ప్రాణాలు తీసుకోవాలి? అంత కష్టమే మొచ్చింది? దాని బాధేమిటో నాకు చెప్పొచ్చుగా? గుండెల్లో దాచుకుని కాపాడుకునే వాడిని గదా దొరా. అది లేకుండా నేనెలా బతకను?" తడిసిన గొంతుతో అన్నాడు గురప్ప.

"తన కష్టమేమిటో నీతో చెప్పుకున్నా... నువ్వు తీర్చవనే అనుమానంతో... నీ మీద నమ్మకం లేకనే ఆమె అలా చేసి ఉంటుంది ఏ దారీ తోచక బలవంతంగా చచ్చిపోయింది" అన్నాడు విజయ్.

"అంత కష్టం దానికేమొచ్చింది. మొగుడేమన్నా అంటే. . నాకు చెపితే నేను మందలించేవాడిని గదా?"

"మొగుడు ఏమన్నా అంటమే తప్ప. ఆడదానికి వేరే ఏ కష్టమూ ఉండదా?"

"ఏముంటది? కూన ల్లేరనే బాధ కూడా లేదు గదా దానికి?"

పోతరాజు సంగతి చెప్పాడు విజయ్. చెంచీత ఆత్మహత్యకు గల కారణాన్ని వివరించాడు.

"చెంచీత ఆడితో కనపడిందా? ఎప్పుడు దొరా? నా కెందుకు చెప్పలేదు?"

## గడుసులోకం

–బాబు






# ధర్మపథం

# జకార పంచకం



ఇదివరలో ఒకప్పుడు వకార పంచకం గురించి వివరించడం జరిగింది. అది – వకారం మొదట వచ్చే అయిదు – వస్త్రం, వపువు (శరీరం), వాక్కు, విద్య, వినయం అనేవి. మనిషికి గౌరవం కలగాలంటే ఆ అయిదూ తప్పని సరిగా ఉండాలి. పరిశుద్ధమైన వస్త్రం, శరీరం, మాట, మేలైన విద్య, వినయం ఉండాలని అభిప్రాయం. ఆవిధంగానే జకారం పదాదిని గల అయిదు అందరికీ అతి ప్రధాన మైనవి! గౌరవనీయమైనవి. సేవింప దగినవి! వానిని గురించిన యీ శ్లోకం ప్రసిద్ధమై ఉన్నది.

"జననీ జన్మ భూమిశ్చ
జాహ్నవీచ జనార్దనః,
జనక శ్చైతి పంచైతే
జకారాద్యాః ప్రకీర్తితః."

జనని తల్లి, జన్మభూమి తాను పుట్టిన ఊరు, జాహ్నవి గంగానది. జనార్దనుడు శ్రీహరి, జనకుడు తండ్రి. ఈ అయిదూ జకారాది పదాలు.

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అనే పెద్దల సూక్తి ప్రసిద్ధంగా ఉన్నది. స్వర్గంకంటె కూడా తల్లీ, పుట్టిన ప్రదేశం గొప్పదని దీనిఅర్థం. దైవసమాన మైన తల్లి పట్ల ఎట్టి గౌరవాభి మానాలు ఉండాలో జన్మభూమి యందు కూడా అట్టి ఆదరాభిమానాలుండాలి. ఉంటాయి కూడా. జకారాది పదాల్లో జననికే ప్రథమ స్థానం ఇవ్వబడింది. తల్లిని గౌరవిస్తే వేరే దైవారాధన అవసరం లేదని అంటారు. ఆవిధంగానే జన్మస్థలంపై గొప్ప అభిమానం ఉంటుంది.

గంగానది పరమ పవిత్ర మైనది. గంగాజలంలో స్నానం చేయుటవల్ల, ఆ జలాన్ని పానం చేయుటవల్ల సమస్త పాపాలు నశిస్తాయి. పరిశుద్ధ గంగా జలాన్ని పాత్రలలో నింపుకొని మూతలు అతికించి ఏళ్ల తరబడి నిలవ చేసికొని పుణ్యదినాల్లో శిరస్సుపై చల్లుకొని పానం చెయ్యడం ఆస్తికుల సంప్రదాయం. గంగాజలాన్ని గౌరవించనివారు ఉండరు. ఈ విధంగానే భగవంతుడైన జనార్దనుణ్ణి ఆస్తికు లందరూ తప్పక పూజిస్తారు. న విష్ణోః పరదేవతా" శ్రీహరిని మించిన మరొక దేవత లేదు. త్రిమతస్థులూ ఆదేవదేవుని కొలుస్తూ ఉంటారు. జనకునికి పుత్రునిపై వాత్సల్యం ఎక్కువ. ఆయన ఎంతో ధనం ఖర్చు పెట్టి విద్యాబుద్ధులు నేర్పి స్వయంగా జీవించడానికి అవకాశాలు కల్పిస్తాడు. వృద్ధాప్యంలో ఆ తండ్రిని, తల్లిని ఆదుకొని వారికి శ్రమలేకుండా దినం తీర్చడం పుత్రుని విధి. ఈ జకార పంచకాన్ని గౌరవించి, పూజించిన నాడే నలుగురిలోనూ గౌరవం పొందుతాడు.

–బులుసు వేంకటరమణయ్య

అన్నాడు గురప్ప.

"ఎందుకు చెప్పాలి? చెప్పి ఆ ఇద్దర్నీ మీ బాణాలకు ఎరగా వెయ్యాలా? ఆమెకు నచ్చ చెప్పి, మందలించి వెనక్కి తీసుకు రాగల ఓర్పు కనీసం నీకయినా ఉందా?

సమయం చూసి ఆమెను నేనే అడగాలనుకున్నాను. కానీ... ఆమె నాకా అవకాశం ఇవ్వలేదు... ఎవరికీ ఏ విధమైన శ్రమా లేకుండా తనే నిష్క్రమించింది".

"నేను కుల పెద్దనయి ఉండి నా కూతురి తప్పును నేనెలా కప్పి పెట్టుకుంటాను దొరా? అందరి శిక్షనూ అంగీకరించినప్పుడు... నా కూతురుకు వాళ్ళు వేసే శిక్షను కూడా అంగీకరించాలి గదా?"

తన, పర అనే భేదం లేని గురప్ప నీతి విజయ్ మనసును తాకింది.

"ఇలాంటి నీతి, నిజాయితీ మన నాయకులకు కూడా ఉంటే..." అనుకోబోయి ఆ ఊహ కూడా అసాధ్యమే అనే సంగతి గుర్తొచ్చి ఆగిపోయాడు.

గురప్ప ఇంకా ఏడుస్తూనే ఉన్నాడు...

"గురప్పా! ఎందుకీ ఏడుపు? ఒక వేళ ఆమె బ్రతికున్నా... సింగారిని చంపినట్టు మీరే స్వయంగా చెంచీతను కూడా చంపేసేవారు గదా? అప్పుడు లేని బాధ నీకు ఇప్పుడు మాత్రం దేనికి? ఆమెలో ఆ ఉద్రేకాన్నెవరూ ఆపలేరు.

తను చెయ్యబోయే పనికి కొడుకు ప్రాణాలను కూడా పణంగా పెట్టలేక... తనా పని చెయ్యకుండా ఉండలేక... తను చచ్చి, కొడుకును రక్షించుకుందామె.

ఆడదాన్ని... ఆమె కడుపు చలవని నిలువునా ఛీల్చే కిరాతకులైన మీ మగ జాతికి ఆమె మాతృత్వపు మమత లేంతెలుస్తాయి?

ఏడవాల్సింది నువ్వు కాదు. ఉంటే... నీ భార్య! ఆమె అదృష్టవంతురాలు గనక... ఈ దారుణాన్ని చూడకుండా వెళ్ళిపోయింది.

ఆడదాన్ని సాధించటానికి... కాలి కింద తొక్కి-పెట్టటానికి, ఆమె బలహీనతని గుప్పెట్లో పెట్టుకోటానికి మాత్రమే మీరు "పిల్లలు తండ్రికే చెందాలి" అనే సాంప్రదాయాన్ని సృష్టించుకున్నారు.

అంతే గానీ మీకసలు బిడ్డల మీద నిజమైన ప్రేమ ఉంటుందా? నీకు మాత్రం ఎక్కడ నుంచొచ్చిందని ఇంతగా విలపిస్తున్నావు?" ఆవేశంగా అన్నాడు విజయ్.

(ఇంకా ఉంది)

# చెప్పులు – చేష్టలు

"ఓ వందనా వందనా" తలుపు తట్టింది సులోచన

యింటి పనులు చక్కబెట్టుకుని, స్నానం చేసి జడల్లుకుంటున్న వందనకు ఆ స్వరం చిర పరిచితురాలిదిలా తోచేసరికి ఆ వ్యక్తిని గుర్తు చేసుకుంటూ వచ్చి తలుపు తీసింది

గుమ్మంలో అందమైన చిరు నవ్వుతో పాత నేస్తం

వందన నయనాలు ఆనందంతో విప్పారాయ్.

"రా రా" తీయగా పిలుస్తూ లోనికి తీసుకెళ్ళింది.

సులోచన సోఫాలో కూర్చుంటూ యిల్లంతా ఒక్కసారి కలియజూచి "హోమ్ సైన్స్ బి.యస్.సి స్టూడెంటువనిపించుకున్నావ్." చిరునవ్వుతో అంది.

"ఏం? ఏం చూసి అంటున్నావ్?" కన్నులతో నవ్వుతూ ప్రశ్నించింది.

"ఎక్కడ వుండాల్సినవి అక్కడ వుండి వాటి వాటి స్థానానికి విలువనిస్తున్నాయ్. నిజంగా యిల్లు సర్దటం కూడా ఒక కళే". అంటూ కాలు మీద కాలేసుకుని మరో ప్రక్కకు తిరిగి టి.వి. పైనున్న ఫ్లవర్‌వాజ్‌ను ముచ్చటగా చూస్తోంది సులోచన.

సులోచన కాలి చెప్పుల్ని అప్పుడు చూసింది వందన. జుగుప్సతో కుంచించుకుపోగా క్షణం మాట్లాడలేదు. ఆ చెప్పున సుద్దమట్టి అతుక్కుని కాస్త బయటకు అసహ్యంగా కనిపిస్తుంటే, ఆ చెప్పు వంక, అప్పుడే తుడిచిన నల్లని పాలిష్ స్టోన్స్ వంక మార్చి మార్చి చూస్తోంది. మట్టి సుద్దతో పాటు కాస్త పేడను కూడా పులుముకొచ్చిన ఆ చెప్పులు "మేము నిష్పక్షపాతులం" అన్నట్టు నిగనిగలాడే ఆ నేల మీద వాటి ప్రతిరూపాల్ని ప్రింటు చేసాయ్.

వచ్చిన ఆ నేస్తం యిల్లంతా ఆ చెప్పులతోనే కలియ తిరిగి గల గల మాట్లాడి వెళ్ళిపోయింది

అప్పుడు మధ్యాహ్నం ఒకటయింది కరాబయిన నేలను నీరసంతో రెండోసారి తుడిచి భోంచేసి పడుకుంది వందన

కంటిపై రెప్ప పడటం లేదు చెప్పులు వాకిట్లో విడవకుండా వాటితోనే యింట్లోకి వచ్చి పడక గదులు, వంట యిల్లును కూడా చుట్టబెట్టే మనుష్యుల గురించి ఆలోచిస్తోంది




ఓసారి శ్రీవారి స్నేహితుడు కాళేశ్వరరావు మార్కెట్, ఆ చుట్టు పక్కల తిరిగి తిరిగి వచ్చాడు. వుమ్మి వగైరా తొక్కిన అవే కిర్రు చెప్పుల్తో లోని గదుల్లోకి వచ్చి ఆరోగ్య సూత్రాల గురించి అరగంట చర్చించి వెళ్ళాడు. అతను వచ్చే ముందే వర్షం పడిందేమో నేలంతా చిత్తడిగా వుంది. అతను చెప్పు వేసిన చోటల్లా నల్లగుడ్డ కప్పినట్టే ఈగలు ముసురుకోగా "చూసారా! ఏం తొక్కి వచ్చాడో ఏమో? ఆ చెప్పుకింద ఎంత అనారోగ్యముందో, ఎన్ని క్రిములుంటాయో చూడండీ? అయినా ఆ మాత్రం తెలియదా! వీధులు తిరిగి చెప్పుల్తో యింట్లోకి రావచ్చా? కుళ్ళుని, కల్మషాన్ని, తడిని, పొడిని తొక్కిన ఆ చెప్పులతోనే సరాసరి యింట్లోకి."

"స్టుపిడ్ స్టుపిడ్" ఎంతో స్మార్ట్‌గా అంటూ "యీసారి ఓ బోర్డు పెడతా. సంస్కారం గల వారెవరైనా దుమ్ము ధూళి తొక్కిన కాలి చెప్పులను వరండా కిందగా విడిచి లోనికి రావలయును అని తెలిసిందా శ్రీమతిగారూ" అన్నారు చిలిపిగా నవ్వుతూ.

"ఏమో బాబోయ్! అది పద్ధతికాదు చదువుకున్న వారిలో కూడా కొందరికి కాలి జోడు బయట విడిచి రావాలని తెలియటం లేదు. సరాసరి లోనికి వచ్చి యిల్లంతా కలియతిరిగి వెళుతున్నారు" అంది కాస్త ఏహ్యంతో.

"దానికో పద్ధతి చెప్తాగాని రావోయ్" అంటూ మురిపెంగా దగ్గరకు జరుపుకుని ఆమెలో రేగిన అసహ్యాన్ని తన చర్య ద్వారా మరపింపజేసాడు.

భర్త స్నేహితుడే కాదు. తన స్నేహితులూ అంతే. యీ రోజు సులోచన ఏం చేసింది? పేడను, మట్టిని తొక్కిన చెప్పుల్తో యిల్లంతా అచ్చులు వేసి వెళ్ళింది. వూరంతా తొక్కి వచ్చిన చెప్పులతో యింట్లోకి రావటం, అదే చెప్పులతో యిల్లంతా తిరగటం కూడా అనారోగ్యంలో ఓ భాగమే. చెప్పేస్తా. వాళ్ళ ముందు చెప్పలేక, వాళ్ళు వెళ్ళిన తరువాత మానసిక సంఘర్షణలో నలిగేకంటే "చెప్పులు అక్కడ విడవండి" అని చెప్పేస్తా.

ఆ తీర్మానానికి వచ్చిన వందన కనుల ముందు మగత తెరలు దిగుతూండగా మెల్లగా కనులు మూసుకుంది.

—శ్రీమతి పెన్నేరు పాప

‘ఉత్తరాలు’ శీర్షికకి రాసేవారు

తమ పేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.




"అమ్మా.. బావ లెటర్ రాశాడే" పరుగెత్తు కొచ్చింది సుజాత.

"ఇంకా చిన్న పిల్లవనుకుంటున్నావా, ఏమిటా పరుగులు? ఏం రాశాడో చదువు" చెప్పింది జానకమ్మ నీరసంగా.

"అలాగే" అంటూ తల్లి ప్రక్కన కూర్చుని లెటర్ విప్పి పెద్దగా చదవసాగింది సుజాత

గౌరవనీయులైన అత్తగారికి,

మీరంతా కులాసా అని తలుస్తాను భారతికి కొద్ది రోజుల్నుంచీ ఒంట్లో బాగుండటం లేదు హాస్పిటల్లో చేర్పించాను. బాబుని చూసుకోవడం కష్టంగా ఉంది. అందువల్ల, కొన్ని రోజులు సుజాతనుగానీ, విమలనుగానీ పంపవల్సింది.

ఇట్లు

సుధాకర్

"అయ్యో, అయ్యో, భారతికేమైంది, రాయిలా ఉండేది, ఒంట్లో బాగుండకపోవడమేమిటి? హాస్పిటల్లో చేర్పించడమేమిటి? మామూలు జ్వరమో, దగ్గో అయితే చేర్చరు కదా, ఏమైందో నా తల్లికి?" జానకమ్మ ఏడుపు మొదలెట్టింది.

ఆ ఏడుపు విని వంట గదిలో నుండి పెద్ద కోడలు అరుణ గబ గబా వచ్చింది ఏమింటేమిటంటూ

"పెద్దక్కకు వంట్లో బాగులేదని హాస్పిటల్లో జాయిన్ చేశారట, బావ లెటర్ రాశాడు" చెప్పింది సుజాత.

"అరె! ఏమైందట తనకి, అసలు ఎప్పట్నుంచి జబ్బు" ఆత్రంగా అడిగింది అరుణ.

"ఏమోనమ్మా. ఆ వివరాలేం రాయలేదు, చిన్నప్పట్నుంచీ తల నొప్పైనా ఎరగదు, ఇప్పుడేమైందో, ఏమిటో బిడ్డకి, నేనేమో ఈ మలేరియాతో మంచంలో పడున్నాను. వెళ్దామన్నా ఓపిక లేదు ఏం దారి భగవంతుడా?" జానకమ్మ నీరసంతో కళ్ళు తిరిగినట్లయి మంచం మీద వాలిపోయింది.

ఆ రోజు మధ్యాహ్నం భోజనాల దగ్గర అందరూ ఉన్నప్పుడు ఆలోచించారు సుజాతనా పంపేది, విమలనా అని.

"నే వెళ్ళను బాబూ, నాకు పరీక్షలు దగ్గర కొస్తున్నాయి. నే వెళ్ళి అక్కడ కూర్చుంటే నా టెన్త్ గోవిందా కొట్టినట్లే" ఖచ్చితంగా చెప్పింది సుజాత, విమలక్కనే పంపండి అని

ఆ అమ్మాయికి చదువు మీద పెద్ద ఆసక్తి లేదు. కానీ, కాలేజ్‌లో చేరాలనే ఉబలాటం బాగా ఉంది. కాలేజ్ లైఫ్ గురించి పంచ రంగుల కలలు కంటుంది. 6 నుండి 10 వరకూ ఒకే స్కూల్లో ఒకే వాతావరణంలో గడిపిన పిల్లలు బోర్ ఫీలవుతారు. కాలేజి అనగానే లైఫే మారినట్లు ఉంటుంది వాళ్ళకి. కొత్త ఫ్రెండ్స్, కొత్త వాతావరణం. సీతాకోక చిలుకల్లాంటి అమ్మాయిలూ, చిచ్చుర పిడుగుల్లాంటి అబ్బాయిలూ, భయపడక్కరలేని లెక్చరర్లూ. అదో క్రొత్త ప్రపంచం హైస్కూలు చదువు ముగించిన పిల్లలకు. అందుకనే సాధారణంగా అవకాశం ఉన్నంత వరకూ ఎవరూ మానరు.

"అదేమిటే సుజా, నీ ఎగ్జామ్స్‌కు ఇంకా ఐదు నెలల టైముంది. విమలకు ఒక్క నెల కూడా లేదు, దాన్ని వెళ్ళమంటావేమిటి? అది మాత్రం చదువుకో వద్దూ," పెద్దన్న శంకర్ విసుక్కున్నాడు సుజాతను.

"అదంతా నాకు తెలవదు, నేను మాత్రం వెళ్ళనంతే" విసురుగా అక్కణ్నుంచీ వెళ్ళిపోయింది సుజాత.

ఆఖరు పిల్లవటం మూలాన సుజాతకు గారాబం ఎక్కువ. అదీగాక పనిదొంగ. అక్కడికి వెళ్ళి ఇంటి పనితో బాటు హాస్పిటల్ చుట్టూ తిరగడం తన వల్ల కాదనుకుంది. ఎంత చెప్పినా వినలేదు.

"పోనీలే అన్నయ్యా, నేనే వెళ్తాను. అక్కడే వీలు చూసుకుని చదువుకుంటాను.." సర్ది చెప్పింది విమల.

విమలకు డిగ్రీ చదువాలని చాలా కోరకగా ఉన్నా, యింటర్ పూర్తవటంతో నే మ్యారేజ్ సెటిలవడంతో చదువు ఆపేసింది.

విమల దురదృష్టం వల్ల ఆ పెళ్ళి కూడా మూణ్ణాళ్ళ ముచ్చటగా ముగిసింది. వ్యసన పరుడైన భర్త వల్ల సుఖపడకపోయినా రెండేళ్ళ కాపురానికి గుర్తుగా ఒక పాపకు తల్లయి యాక్సిడెంట్లో భర్తను పోగొట్టుకుని పుట్టింటికి చేరింది. పోషించవలసి రావడం కష్టంగా ఉన్నా, అణకువగల పని మనిషి దొరికినందు వల్ల ఇద్దరు వదినెలకు హాయిగానే ఉంది. పనంతా విమల మీద వదిలేసి పెద్ద వదిన పెత్తనాలకు వెళ్తే, పసి పిల్ల వాడి వంకె పెట్టుకుని చిన్న వదిన బొత్తిగా పని ముట్టు కోవటం మానివేసింది. లేవలేని తల్లి చూస్తూ ఊరుకోవడం తప్ప చేసేదేమీ లేకపోయింది.

విమల పరిస్థితంతా చూసిన సుధాకర్, బావ మరదులను మందలించాడు. ప్రైవేట్‌గా బి.ఏ.కి కట్టి ప్యాసైతే ఏదో చిన్న ఉద్యోగం వస్తుంది. ఒకరి దయా దాక్షిణ్యాల మీద ఆధారపడకుండా తన కాళ్ళ మీద తను నిలబడి, తన పాపను కూడా పోషించుకో గల్గుతుందని చెప్పాడు. సుధాకర్ ప్రోత్సాహం వలనే విమల ఎంట్రన్సూ, ఫస్టియరూ పూర్తి చేసి ఇప్పుడు సెకండియర్‌కు చదువుతోంది.

భారతికి వచ్చింది గుండె జబ్బు. సుధాకర్ ఎన్ని తిప్పలు పడినా భారతిని దక్కించుకోలేకపోయాడు.

* * *

అప్పుడే భారతి పోయి మూడు నెలలయింది. ఎగ్జామ్స్ వ్రాయడానికి విమల తిరిగి వచ్చేసింది. పసి పిల్లవాడితో చాలా తిప్పలు పడుతున్నాడు సుధాకర్. అతనికి తల్లి ఉన్నది గానీ, ఆమె ఆయాసం మనిషి. రెండు రోజులు కులాసాగా ఉంటే నాలుగు రోజులు మంచంలో ఉంటుంది.

కొన్నాళ్ళకు శంకర్‌కు ఒక మంచి ఆలోచన వచ్చింది. సుజాత పెళ్ళికి కట్నంగానీ, లాంఛనాలూ, మిగతా ఖర్చులూ అన్నీ కలిసి యాభై వేలదాకా అవుతాయి. అలా కాక సుజాతను సుధాకర్‌కే ఇచ్చి చేస్తే?

అతను రెండో పెళ్ళి వాడనేగానీ, పెద్ద వయసు లేదు. అందగాడు, ఆస్తిపరుడు, అదీగాక పెద్ద ఉద్యోగం. తాము యాభై కాదు, అరవై వేలు ఖర్చు పెట్టినా అంత మంచి సంబంధం తేలేరు.

తన ఆలోచన ఇంట్లో అందరికీ చెప్పాడు శంకర్. అందరూ ఒప్పుకున్నారు. భారతి కొడుకుని సవతి తల్లయితే సరిగ్గా చూడదనీ, సుజాతయితే అక్క కొడుకని బాగా చూసుకుంటుందనీ జానకమ్మ ఆశ పడింది. సుజాత ఏమంటుందోనని మొదట సందేహించారుగానీ విచిత్రం సుజాత కూడా ఒప్పుకుంది. 10వ తరగతి పోవటం వల్ల కాలేజ్‌లో చేరాలనే కోరిక తీరలేదు. బావ అందగాడు, పెద్ద ఉద్యోగస్తుడు తిరస్కరించడానికి ఆమెకేమీ కారణం దొరకలేదు.

శంకర్ సుధాకర్ తల్లి దండ్రులను కూడా సంప్రదించాడు. వాళ్ళూ సంతోషంగా ఒప్పుకున్నారు. ఇక మిగిలింది సుధాకరే.

సంగతి వినగానే సుధాకర్ ఇంతెత్తున మండి పడ్డాడు. నేను భారతిని మర్చిపోలేను. మళ్ళీ పెళ్ళి చేసుకోనని ఖచ్చితంగా చెప్పాడు.

అప్పుడు మొదలయింది అతనికి అసలయిన బాధ. తల్లి, తండ్రి, అత్తగారు, శంకర్ వీలు దొరికినప్పుడల్లా ఒకొక్కళ్ళూ అతనికి నచ్చ చెప్పడం మొదలుపెట్టారు.

ఆడ దిక్కు లేని సంసారం అర్థాన్నమవుతుంది, వయసులో ఉన్న వాడివి ఇప్పుడేదో బాధలో అలా

అన్నా ర్నానను జీవితం దుర్భరమవుతుంది. దుర్వ్యసనాలు అలవడతాయి. ఈ బాధంతా ఎందుకు? పోనీ ఆ పసి వాడి ముఖం చూసైనా ఒప్పుకో, వాడి ఆలనా పాలనా ఎవరు చూస్తారు? రేపు సుజాతకు పెళ్ళయిపోతే తర్వాత కావాలంటే నీకు భార్య దొరుకుతుంది గానీ, ఆ పిల్లాడికి తల్లి దొరకదు. అందు చేత, పెద్ద వాళ్ళం, మేమెందుకు చెప్తున్నామో ఆలోచించుకో" అంటూ చెవులో జోరీగలాగా పోరు పెట్టసాగారు.

వినగా, వినగా సుధాకర్‌కీ నిజమేనన్పించింది. ఆ రోజు అందరూ ఉన్నప్పుడు అతనొక బాంబు పేల్చాడు, విమలను చేసుకుంటానంటూ.

విన్న వాళ్ళందరికీ మతి పోయింది. నిక్షేపంగా సుజాతనిస్తామంటే, విధవరాలు, పిల్ల తల్లి విమలను చేసుకుంటానంటాడేమిటా అని.

"నీకేమన్నా మతి పోయిందేమిట్రా... విధవదాన్ని చేసుకుంటానంటావు. నీకేం తక్కువ? అందమా, ఆస్తా, ఉద్యోగమా? పోనీ వయసు ముదిరిన వాడివా? కో అంటే కోటి మంది వస్తారు కట్నం కూడా తీసుకుని... ఏదో సుజాతయితే పిల్లాణ్ణి బాగా చూసుకుంటుందని ఒప్పుకున్నాంగానీ, విధవరాల్ని చేసుకోవడానికి నీకేం ఖర్మ? నేను ఛస్తే ఒప్పుకోను, నువ్వినకపోతే బావిలో దూకి ఛస్తానంతే" సుధాకర్ తల్లి మాణిక్యమ్మ రంకెలు వేసింది.

"విమల సంగతంతా అయిపోయింది. దాని ఖర్మ అలా కాలి, మొగుడు పోయాడు కానీ దాని పెళ్ళికేం తక్కువ ఖర్చు పెట్టామా? ఇప్పుడీ సుధాకర్ సుజాతను చేసుకోకపోతే మళ్ళీ దాని పెళ్ళికి ఎన్ని వేలు ఖర్చుపెట్టాలో" ఇదీ శంకర్ దూ(దు)రాలోచన.

"దానికదృష్టం లేక మొగుడు పోయాడు. దానికి మళ్ళీ పెళ్ళేమిటీ? పిల్ల తల్లి కూడానూ... ఏదో కోడళ్ళు చూసినా చూడకపోయినా విమల దగ్గరుందామనుకున్నానే" ఇది జానకమ్మ ఆలోచన.

"అంత హోదాగల ఉద్యోగం చేస్తున్న వాడివి, విధవరాలు, పిల్లతల్లిని చేసుకుంటే సంఘంలో మన పరువేం కావాలి? రేపు నేను తలెత్తుకు తిరగ్గలనా? నువ్వీ పెళ్ళి చేసుకుంటే జన్మలో నీ ముఖం చూడనంతే" గాండ్రించారు సుధాకర్ తండ్రి వెంకట్రావు.

"విధవరాలు, విధవరాలు అంటారేగానీ, నిజానికి నేను మాత్రం కాదా? భార్య లేనందు వల్ల నాకొచ్చే కష్ట నష్టాలు విమలకు మాత్రం రావా? తనకు మాత్రం ఎంత వయసుందని? ముందు జీవితమంతా ఒంటరిగా ఆ పిల్లలను పెంచటమంటే ఎంత కష్టం, మరో మాట. భారతి వీక్ హార్ట్ మనిషవటం వల్ల, మళ్ళీ ప్రెగ్నెన్సీ వస్తే కష్టమని నేను ఫామిలీ ప్లానింగ్ ఆపరేషన్ చేయించు కున్నాను మీకెవ్వరికీ తెలియకుండా.

చిన్నతనం వల్ల సుజాతకు ఇప్పుడు తెలియదు గానీ, తర్వాత ఎప్పటికీ తను తల్లిని కాలేనని కుమిలిపోదా? ఆ బాధ వల్ల పిల్ల వాణ్ణి కూడా సరిగ్గా చూస్తుందని నమ్మకమేమిటి?

మంచి పని చేస్తున్నందుకు నన్ను అభినందించక అందరూ ప్రతిఘటిస్తారేం? మీరసలు మనుష్యులు కాదా?" సుధాకర్ నిగ్గదీశాడు అందరినీ.

"అది కాదురా, విమల జాతకం మంచిది కాకపోబట్టే కదా ముందు భర్త పోయాడు. మళ్ళీ రేపు నీకేమన్నా అయితే" మాణిక్యమ్మ కొంచెం




మెత్తబడుతూ అన్నది.

"నిజమే, విమల జాతకం మంచిది కాకే భర్త పోయాడనుకుందాం. మరి భారతి ఎందుకు పోయింది. నను చేసుకున్నందుకు రేపు విమలకేమన్నా అవ్వచ్చు కదా" ఎదురు ప్రశ్న వేశాడు సుధాకర్.

"అసలీ మాయలాడి ఏదో చేసి నా కొడుకుని బుట్టలో వేసుకుంది. అందుకే చెప్పినా వినటం లేదు" వెంకట్రావుగారు మళ్ళీ మొదటికొచ్చారు.

"బావా... అసలు నన్నడిగావా ముందు నువ్వు? ఈ పెళ్ళి నాకూ ఇష్టం లేదు. నేను నష్టజాతకురాల్ని. నువ్వు సుజాతనే చేసుకో" ఏడుస్తూ లోపలికి వెళ్ళిపోయింది విమల.

"విమలా, నిజంగా నీకిష్టం లేదా? నా ముఖం చూసి నిజం చెప్పు? లేక వాళ్ళందరూ వద్దంటున్నారనా? నిజంగా నీకిష్టం లేకపోతే బలవంత మేమీ లేదు. లేకపోతే నీ భర్తను మరిచిపోలేక పోతున్నావా?" గదిలో ఒంటరిగా కూర్చుని ఏడుస్తున్న విమలను అడిగాడు సుధాకర్.

"భర్త అతను? హుఁ ఉన్నన్నాళ్ళూ నరకం చూపించాడు. భరించలేక పుట్టింటికి వస్తే ఒప్పుకోరు, చావో, బ్రతుకో అక్కడే భరించమంటారు. చద్దామంటే నా ప్రాణానికి పిల్ల ఒకతి. అదృష్టమో, దురదృష్టమో అతను పోయినాకే నా ప్రాణం సుఖంగా ఉంది."

"మరేమిటి నీ అభ్యంతరం?"

"సిరిరా మోకాలడ్డటం లాగా నువ్వింత మంచి మనసుతో నన్ను చేసుకుంటానంటే వద్దనడానికి నేనేం పిచ్చిదాన్ని కాదు. కానీ, ఎవ్వరూ హర్షించని మన పెళ్ళి ఏం సుఖవంతమవుతుంది? అందరూ నిన్ను చులకనగా చూస్తారేమోననే నా బాధ" మనసులోని మాట చెప్పింది విమల.

"నిజంగా మంచి మనసు గల వాళ్ళయితే మన పెళ్ళిని మనస్ఫూర్తిగా హర్షిస్తారు. విమలా వీళ్ళంతా స్వార్థపరులు. వీళ్ళతో మనకి పనేమిటి? నువ్వొప్పుకున్నావు, నాకదే చాలు" ఆనందంగా అన్నాడు సుధాకర్. □

# డేవిస్ కప్ ఫైనల్స్‌లో స్థాయిని పెంచుకున్న భారత దేశం

డేవిస్ కప్ యీ ఏడు ఫైనల్స్‌లో మనదేశ జట్టు ఓటమి నిరాశ కలిగించినా, నిస్పృహ చెందాల్సిన పని లేదు. మనదేశ టెన్నిస్ రంగములో 1987 బాగా ఆడారు అనవచ్చు. మనదేశం జట్టు డేవిస్ కప్ ఫైనల్స్‌లో పాల్గొనటం ఇది మూడవ సారి. 87 ఏళ్ళ సుదీర్ఘ చరిత్ర కలిగిన డేవిస్ కప్‌లో మనదేశం 51 సార్లు మాత్రమే పాల్గొన్నది. 1966 లో ఛాలెంజ్ రౌండులో మొదటి సారిగా ఆడి ఆస్ట్రేలియాచే మెల్బోర్న్‌లో 4–1 స్కోరుతో ఓడించబడింది. 1974 లో ఫైనల్స్‌లో దక్షిణ ఆఫ్రికాతో ఆడవలసి, సిద్ధాంత రీత్యా పోటీ నుండి విరమించుకున్నది. 1987 లో మూడవసారి ఫైనల్స్‌లో ఆడి ఓటమి పొందింది.

డేవిస్ కప్ పోటీలు 1900 లో ప్రారంభం కాగా మనదేశం తొలి సారిగా 1921 లో పాల్గొన్నది. మొదటి రౌండులో ఫ్రాన్స్‌ను 4–1 స్కోరుతో ఓడించి జపాన్ చేతిలో 0–5 స్కోరుతో ఓడించబడింది. ఈ పోటీలు ఫ్రాన్స్‌లోని పారిస్ రేసింగ్ క్లబ్ ఎర్రమట్టి కోర్టులలో జరిగాయి. అప్పటికి స్వీడన్ యీ పోటీలలో ప్రవేశించలేదు. ఆ పోటీలలో మన జట్టులో ఎస్. ఎం. జాకోబ్ అనే ఆంగ్లో – ఇండియన్ (జ్యూయిష్) ఆడాడు.

1922 లో రుమేనియాపై 5–0 గెల్చి, స్పెయిన్‌చే 1–4 ఓడించబడింది. 1923 లో ఐర్లాండు చేతిలో 2–3 ఓటమి పొందింది. 1924 లో హాలెండ్‌పై 4–1 విజయం ఫ్రాన్స్‌చే 1–4 స్కోరుతో యూరోపియన్ జోన్‌లో ఓటమి పొందింది.

1925 లో మొదటిసారిగా సెమీ ఫైనల్సు స్థాయికి చేరింది. బెల్జియంను బ్రెస్సెల్స్‌లో, ఆస్ట్రియాను వియన్నాలో ఓడించారు. జాకోబ్ రెండు రౌండులు గెల్చి 'రబ్బర్' (నాలుగు సింగిల్స్) సాధించి, వింబుల్డన్ పోటీలలో గాయమగుటచే తర్వాత డేవిస్ కప్ పోటీలలో ఆడలేకపోయాడు. మన జట్టు జాకోబ్ లేకపోవుట వలన 1–4 హాలండ్ ఓడిపోయింది. మన జట్టు రెండు పోటీలలో విజయం సాధించటం యిదే ప్రథమం.

1926 లో యూరోపియన్ జోన్ రెండవ రౌండులో చెకోస్లావేకియా చేత 1927 లో యూరోపియన్ జోన్ సెమీ ఫైనల్సుకు చేరినది. స్పెయిన్, యుగోస్లావేకియాలను ఓడించి డెన్మార్క్‌చే ఓడించబడినది. 1928 లో స్విట్జర్లాండ్‌ను ఓడించి స్పెయిన్‌చే ఓటమి పొందినది. 1930 లో రెండవ రౌండులో జపాన్ ఓడించినది. 1932 లో జర్మనీచే 0–5 స్కోర్‌తో ఓడించబడినది. 1934 స్విట్జర్లాండుచే ప్రథమ రౌండులో, 1938, 39 లో బెల్జియంచే ఓడించబడినది. రెండవ ప్రపంచ యుద్ధము వలన పోటీలకు విరామం వచ్చినది.

1947, 48 లో ఫ్రాన్స్, బ్రిటన్‌లు గెల్చాయి. 1952 లో తొలి సారిగా ఈస్ట్ జోన్ విజేత అయినది. సుమంత్ మిశ్రా, నరేష్‌కుమార్‌లు మన జట్టులో ఆడారు. ఈస్ట్ జోన్‌లో యితర దేశాలు పాల్గొనక పోవటం వల్ల మనకు గెలుపు దక్కింది. ఇటలీచే 3–2 స్కోరుతో ఓడించబడింది.

1953 లో తిరిగి ఈస్ట్ జోన్ విజేత అయింది. సెమీ ఫైనల్స్‌లో బెల్జియంచే ఓడించబడినది. 1954 లో మూడవ రౌండులో ఫ్రాన్స్‌చే ఓటమి పొందింది.


మొట్ట మొదటి భారతీయ డేవిస్ కప్ ఆటగాడు ఎస్. ఎం. జాకోబ్

మరుసటి ఏడు ఇంగ్లాండుచే రెండవ రౌండులో ఓడించబడింది. 1956 లో అమెరికా ఇంటర్ – జోన్ పోటీలో 4–1 స్కోరుతో గెల్చింది. 1957 లో ఈస్ట్ జోన్ సెమీ ఫైనల్స్‌లో ఓటమి పొందింది. మళ్ళీ ఏడు ఇటలీ రెండవ రౌండులో మనపై గెల్చింది. 1959 లో ఇంటర్ – జోనల్ ఫైనల్స్‌కి చేరింది. ఆస్ట్రేలియాచే 1–4 స్కోరుతో ఓడించబడింది. 1960 లో ఫిలిప్పైన్స్ జోనల్ ఫైనల్స్‌లో ఓడించింది. 1961 లో ఈస్ట్ జోన్ ఛాంపియన్ అయింది. సెమీ ఫైనల్స్‌లో అమెరికా చేతిలో 3–2 స్కోరుతో ఓటమి పొందింది. ఇంటర్ – జోనల్ ఫైనల్స్‌లో 1962 లో మెక్సికోచే 0–5, 1963 లో అమెరికాచే 0–5, 1964 లో ఫిలిప్పైన్స్‌చే, 1965 లో స్పెయిన్‌చే ఓటమి పొందినది.

1966 లో 30 వ సారి డేవిస్ కప్ పోటీలలో ఆడింది. శ్రీలంకపై 5–0, జపాన్ 4–1 గెల్చి ఈస్ట్ జోన్ విజేత అయింది. యూరోపియన్ 'బి' జోన్ విజేతలు అయిన పశ్చిమ జర్మనీపై 3–2 గెల్చి, బ్రెజిల్‌ను 3–2 స్కోరుతో ఓడించి తొలి సారిగా ఛాలెంజి రౌండులో ప్రవేశించినది. మెల్బోర్న్‌లో ఆస్ట్రేలియాచే 4–1 స్కోరుతో ఓడించబడింది. రామనాథన్ కృష్ణన్, అద్భుత ప్రతిభ చూపి మన జట్టు విజయాలకు కృషి చేసారు. కృష్ణన్, జయదీప్ ముఖర్జీ జంట న్యూకోంబ్, రోచ్‌పై గెల్చు పొందాయి.

1967 లో దక్షిణ ఆఫ్రికాచే అంతర్ – మండల సెమీ ఫైనల్స్‌లో ఓడించబడింది. 1968 లో

( 82 వ పేజీ చూడండి)

కలకత్తాలో 1966 డేవిస్ కప్ (బ్రెజిల్‌తో ఆడిన మన జట్టుతో పాటు బ్రెజిల్ జట్టుని కూడా చిత్రంలో చూడవచ్చు)






## ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్స్

సంస్కృతం కొందరు మడికట్టుకున్న వారి భాష, వ్యవహారానికి పనికిరాదు– అనే అపోహలను ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్స్‌లో జరిగిన చర్చలు, విద్యార్థులు, అభిమానులు అభినయించిన నాటక నాటికలు కూకటివేళ్ళతో పెరికి వేశాయి. డిసెంబర్ 25, 26, 27లలో జరిగిన ఈ కాన్ఫరెన్స్ రెండవనాటి సాయంకాలం ఇంద్రజాల మ్మన్నే సంపూర్ణ సాంఘిక నాటిక ప్రేక్షకులను తన్మయులను చేసి, సంస్కృతం ఇంత సరళమా, ఇంత సులభ గ్రాహ్యమా, ప్రజాసామాన్యానికి కూడా ఇంత రంజకమా– అని ఆశ్చర్యం కలిగించింది. నేటి సమాజంలోని కుటిల కుతంత్రాలకు దర్పణం ఈ సంస్కృత నాటిక. రోడ్డు ప్రక్కన గారడీ ప్రదర్శించి పొట్ట పోసుకునేవారు ఇతివృత్తంగా రచించిన ఈ నాటిక సమాజంలోని నల్ల వ్యాపారిని, స్వార్థపరుడైన రాజకీయవాదిని, అసత్యవాది అయిన వకీలును, పాశ్చాత్య వ్యామోహంతో కొట్టుకొని పోతున్న కొత్త తరం భారత యువతిని విమర్శిస్తూ, కల్మషం లేని హృదయంతో ప్రజానీకం అజ్ఞానాన్ని తొలగించి, విజ్ఞానాన్ని బోధించే ఉపాధ్యాయునికి జేజేలు పెడుతుంది. దీనిని అభిరాజేంద్ర మిశ్ర రచించారు.

బంధో రే బంధో రే శృణుమమ వచనమ్
ఇంద్రజాలే మదీయే విద్యేహి నయనమ్
కో యా దృష్టా పారితా కలికతా
డిల్లీ రాజధానీ గృహిణీ మమజాతా

అనే గేయంతో ప్రారంభమయింది. ఈ గేయం జానపద బాణీ ప్రేక్షకులను నాటకం వైపునకు లాక్కుంది. దీనిలో ఇంద్రజాలికుడుగా శ్రీ చింతపల్లి కృష్ణారావు, సహాయకులుగా శ్రీయుతులు రంగి సత్యనారాయణ, సి. వి. రామానుజం, లాయర్‌గా జి. శ్రీధరరెడ్డి, నల్ల బజారు వ్యాపారిగా కె. వి. ఎన్. ఎస్. కుమార్, రాజకీయ నాయకుడుగా మణికంఠన్, ఉపాధ్యాయుడుగా బి. వి. ఎస్. ఆంజనేయులు నటించారు. నటుల సంభాషణ, మాతృ భాష సంభాషణలాగ అతి సరళంగా ప్రేక్షకుల మనస్సును ఆకట్టుకొనే విధంగా కుతూహలం కలిగించే రీతిగా సాగింది. దీనిలో పాల్గొన్న వారంతా సంస్కృత ఎం. ఎ లు, విద్యార్థులు. శ్రీకృష్ణాచార్య వర్ధేద్కర్ స్మారక సంస్కృత విద్యాలయం విద్యార్థినీ విద్యార్థులు వాసవదత్త నాటకంలోని ఒక అంశాన్ని చక్కగా నటించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృత ఎం. ఎ. విద్యార్థినుల బృందగానం, గడ్డి అన్నారం శాంతి నికేతనం ఉన్నత పాఠశాల విద్యార్థినుల బృందగానం శ్రోతలను ఆనందింప జేసింది. వీటిలో 'నమామి రాష్ట్ర భారతం' అనే గేయం సమయానుకూలమై శ్రోతలను దేశ సమైక్య ప్రవణులను చేసింది. కేంద్రీయ విద్యాలయం విద్యార్థి మణికంఠన్ సంస్కృతంలో దుర్యోధన ఏకపాత్రాభినయం చేసి ప్రేక్షకుల ప్రశంసలు పొందారు. ఈ కాన్ఫరెన్స్ ఐదవ సమావేశం డిసెంబర్, 25 26 27లలో వైభవోపేతంగా జరిగింది ప్రారంభోత్సవం 25 మధ్యాహ్నం ఇందిరా ప్రియదర్శినీ హాలులో జరిగింది. సుప్రసిద్ధ సాహిత్య సేవకులు శ్రీ దేవులపల్లి రామానుజరావు ప్రారంభోత్సవం జరిపారు. సుప్రసిద్ధ కవి, వాస్తు శిల్పి శ్రీ ఉండేల మాలకొండారెడ్డి స్వాగతం చెప్పారు. అధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం కులపతి డాక్టర్ తూమాటి దోణప్ప అధ్యక్ష భాషణంలో విదేశీయం పనికి రాదనేవారు, స్వదేశీయమేదీ పనికిరాదనేవారు విద్వాంసులలో వున్నారని, ఉభయ పద్ధతుల మేళవింపుతో పరిశోధన జరగాలన్నారు. ప్రస్తుతం రాష్ట్రంలోని వివిధ విశ్వవిద్యాలయాల తెలుగు సంస్కృత చరిత్రాది శాఖలలో జరుగుతున్న పరిశోధనను ఆయనను ఆయన సింహావలోకనం చేస్తూ ఆయుర్వేద, ఖగోళ, శకున, శిల్ప, సాముద్రిక, రత్నాది శాస్త్రాలలో పరిశోధన జరగాలన్నారు. బౌద్ధంలోను, బాణ ప్రహసనాదులలో పరిశోధన జరిగితే ప్రజాసామాన్య జీవితం తెలుస్తుందని, తెలుగులో జానపద సంస్కృతిపై శాస్త్రీయ పరిశోధన జరగాలని, తెలుగులో జరిగే పరిశోధన చరిత్ర పురాతత్త్వ శాస్త్ర జీవ పరిణామ శాస్త్రాదులతో సయోధ్యతో జరగాలని, సాహిత్యమనేది సంస్కృతి సర్వస్వం గనుక సాహిత్యాన్ని సర్వ దృక్కోణాలతో చూడాలని, భాషలోను విరివిగా పరిశోధనలు జరగాలని అన్నారు. తెలుగును అధికార భాషగా అమలు పరచడంలో కృతకృత్యులం కాలేదని, శిక్షణా శిబిరాలు నెలకొల్పి, ఉద్యోగులతో చర్చా సదస్సులు నిర్వహించి, గ్రామ స్థాయి నుండి సోషియో లింగ్విస్టిక్ సర్వేలు జరిపి, తద్వారా సేకరించిన సమాచారాన్ని రాష్ట్ర స్థాయిలో ప్రమాణీకరించాలని,సూచించారు. అలాగే తెలుగును బోధన మాధ్యమికంగా రూపొందించ డంలో ఓరియంటల్ కాన్ఫరెన్స్‌లు ప్రభుత్వానికి దారి చూపాలని అన్నారు. ఈ సందర్భంలో ఆయన కొన్ని సూచనలు చేశారు. 1. పరిశోధన సంస్థల పరిధిలోకి గాని, విశ్వవిద్యాలయాల ఆవరణలోకి గాని రాకుండా స్వతంత్రంగా గుబాళిస్తున్న పండితుల విజ్ఞాన సామనస్యాలను వినియోగించుకొని, వారి పరిశోధనలకు తగిన గుర్తింపు ఇవ్వాలి. 2. విశ్వవిద్యాలయాల పరిశోధన మండలులు మరింత అర్థవంతంగా పనిచేయాలి. 3. పరిశోధనా జాబితాలు ఎప్పటికప్పుడు ప్రకటించాలి. 4. పరిశోధనాంశాల నిధిని (టాపిక్ బ్యాంక్) ఏర్పాటు చేసుకోవాలి. 5. భాషా సాహిత్యేతర రంగాలకు కూడ పరిశోధన విస్తరించాలి. 6. యువతరం అవసరాల దృష్ట్యా విశ్వవిద్యాలయాలలోను పరిశోధక శిక్షణ శిబిరాలు, సదస్సులు మున్నగునవి నిర్వహించాలి. 7. సిద్ధాంత గ్రంథ నిర్ణేతలు మొగమాటం వదలాలి. 8. సిద్ధాంత గ్రంథాలను ప్రచురించాలి. దానికి తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సాహాయ్యం చేస్తుంది. 9. వివిధ విశ్వవిద్యాలయాలలో జరిగే పరిశోధనల సమన్వయం జరగాలి. ఈ కాన్ఫరెన్సులు తిరునాళ్ళలాగా కాక శ్రద్ధాసక్తులతో జరగాలి. ఈ కాన్ఫరెన్సుల్లో ప్రతిసారి సంస్కృతాంధ్ర భాషా సాహిత్యాలకు అపూర్వ సేవ చేసిన ఇద్దరు ప్రాచీన పద్ధతి విద్వాంసులను సన్మానించడం సముదాచారం. ఆ ప్రకారం ఈమారు శ్రీయుతులు తిరుమల రామచంద్ర, శ్రీ కేశవపంతుల నరసింహ శాస్త్రిగార్లను కాశ్మీర్ శాలువతో నూటపదార్లతో సన్మానించారు. శ్రీ దేవులపల్లి రామానుజరావు ఈ సన్మానం జరిపారు. కాన్ఫరెన్స్ స్థాపకాధ్యక్షులు డాక్టర్ బి. రామరాజు, స్థాపక కార్యదర్శి డాక్టర్ చివుకుల మార్కండేయశాస్త్రి సన్మానితులయారు. ఈ కాన్ఫరెన్సు పేరవ వివిధ భాగాలుగా విడిపోయి చర్చలు జరిపింది. మొత్తం ఎనిమిది విభాగాలుగా విడిపోయింది:– 1. వేద ధర్మనాలు– అధ్యక్షులు

వరంగల్లో స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ 40వ వార్షికోత్సవ సందర్భంగా డా. నేరెళ్ళ వేణుమాధవ్‌కి ప్రదర్శనానంతరం సన్మానం చేస్తున్న ఎస్. బి. హెచ్. సెక్రటరీ మరియు ఆంధ్రప్రదేశ్ ఇస్కస్ సెక్రటరీ ఎన్. సీతారాంరావు, 1988 లో శ్రీ వేణుమాధవ్‌ను ఇస్కస్ పక్షాన రష్యా పంపిస్తున్నట్టు వెల్లడించారు. వేదిక మీద ఎస్. బి. హెచ్. వైస్ ప్రెసిడెంట్ శ్రీ పి. లక్ష్మీనారాయణ మరియు మొహిత్‌సేన్‌లని కూడా చూడవచ్చు.



## హైదరాబాద్ నోట్‌బుక్

**డాక్టర్ శ్రీ మన్నారాయణమూర్తి, 2 ప్రాచీన సంస్కృతం- ఆచార్య పి జి లాల్యే, 3 ప్రాచీన తెలుగు-** డాక్టర్ పి వెంకటరాజు, 4 ఆదునిక తెలుగు సాంహిత్యం- ప్రొఫెసర్ కె వి రామకోటి శాస్త్రి, 5 తెలుగు బాష- ఆచార్య చేకూరి రామారావు, 6 తెలుగు వ్యాకరణం, చందస్సు- ఆచార్య అమరేశం రాజేశ్వరశర్మ, 7 చరిత్ర, సంస్కృతి- ఆచార్య ఎస్ ఎల్ ఎస్ హనుమంతరావు, 8 జానపద సంపద- ఆచార్య నాయని కృష్ణకుమారి కాన్ఫరెన్స్‌కు వందకు పైగా పరిశోదన పత్రాలు అందాయి ఉన్నత స్థాయిలో వున్నాయి మొదటి రెండు విబాగాలలో విద్వాంసులు మహావేశంతో వాదోపవాదాలు జరుపుకొన్నారు యువ విద్వాంసుడు డాక్టర్ శ్రీపాద సుబ్రహ్మణ్య పారిభాషికావచ్ఛేదకత్వ విచారః, శ్రీ సి హెచ్ సీతారామశర్మ పూర్వ మిమాంసాయా మపిదేవతాయాః విగ్రహాది పంచకస్వీకారః, డాక్టర్ కె కమలమ్మ సావిత్రి, డాక్టర్ పి శశిరేఖ చాణుక్యుని అర్ధ శాస్త్రంలో వివిధ శాస్త్రాల ప్రస్తావన అనే పత్రాలు శ్రోతలను విశేషంగా ఆకర్షించాయి ఆదునిక తెలుగు విధానంలో కాళోజీ మొదలయిన జీవత్కవులపై పరిశోధన పత్రాలు బాగున్నాయి

జానపద సాహిత్య విబాగంలో శ్రీమతి ఎం ఆండాళమ్మ జానపద విజ్ఞానంలో కుండ అనే వ్యాసం ఆసక్తిదాయకంగా వుంది ప్రాచీన తెలుగు సాహిత్య విభాగంలో డాక్టర్ కె కమలమ్మ శ్రీ అవధానం చంద్రశేఖరశర్మ సేతుబంధ కావ్యానువాదాన్ని పరిచయం చేయడం సముచితంగా వుంది ఈ పదేళ్లలో అలాటి ప్రౌఢ ప్రబందం రాలేదని నా అబిప్రాయం చరిత్ర సంస్కృతి విబాగంలో డాక్టర్ ఎం ప్రబాకరరావు మదుర నేలిన తెలుగు నాయక రాజుల నాణెములు, డాక్టర్ బి రామారావు మధ్య యుగాంధ్రలో వైద్యారోగ్య విషయాలు, డాక్టర్ రపీవుృప్ ఉరుదూ గ్రందాల ద్వారా కుతుబ్‌షాహీల తెలుగు సంస్కృతాబిమానం- అనే వ్యాసాలు చాల విషయాలు తెలిపాయి డాక్టర్ రఫీవుృఫ్ అనేక నూతనాంశాలు తెలిపే కుతుబ్‌షాహీల పర సంస్కృతాదరణను వివరించారు ఈ విభాగంలో శ్రీ తిరుమల రాచంద్ర మాహుకుని హారమేఖల అనే ప్రాకృత వైద్య గ్రంథం పరిచయం చేశారు 27వ తేదీ సాయంకాలం ముగింపు సమావేశంలో డాక్టర్ రామరాజు ప్రసంగించారు కార్యదర్శి డాక్టర్ లాల్యే, ప్రదాన కార్యదర్శి డాక్టర్ శ్రీ హరి కృతజ్ఞతలు తెలిపారు చర్చలలో పాల్గొన్న రెండు వందల పైచిలుకు ప్రతినిధుల పక్షాన శ్రీ విశ్వనాథ గోపాలకృష్ణ శర్మ కృతజ్ఞతలు తెలిపారు కాన్ఫరెన్సు నిర్వాహకులు మూడునాళ్ళూ, ప్రతినిధులుకు ఇతరులకు వసతి, బోజన, సదుపాయం చక్కగా చేశారు చివరకు ఒక్క విషయం ఈ సమావేశంలో తర్వాతి కాన్ఫరెన్స్ ఆరవ సమావేశం పాలకవర్గం ఎన్నుకోవాలి డిసెంబర్ 26న జరిగిన ఎన్నికల ఏర్పాట్లలో అవకతవకలు జరిగాయని పలువురు సభ్యులు ఫిర్యాదు చేసినందున అధ్యక్షులు డాక్టర్ ద్రోణప్ప పరిశీలించి, పాత పాలకవర్గం కొనసాగవచ్చునా, కొత్తది వుంచాలా, రెండూ రద్దు చేసి, కొత్త ఎన్నికలు జరపాలా అనే మూడు ప్రతిపాదనలపై వోటింగ్ జరపాలన్నారు ఆ విధంగా జరిగిన రహస్యపు వోటింగ్‌లో పాత పాలక వర్గం కొనసాగాలనే ప్రతిపాదనకు అత్యధికమైన మెజారిటీ రావడం వల్ల వచ్చే రెండు సంవత్సరాలకు పాత పాలకవర్గమే కొనసాగాలని నిర్ణయమైంది ఈ రహస్యపు వోటింగ్‌ను మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య డాక్టర్ వి రామచంద్ర, తిరుమల రామచంద్ర నిర్వహించి ఫలితాలు ప్రకటించారు

### ఉపశ్రుతిః—

ఆ మద్య ఒక మహా నాయకుడు ఒక సభలో ప్రసంగించారు, ఎలా వుంది ప్రసంగం?— అనడిగాను ఒక శ్రోతను, నేను వెళ్లలేదు గనుక ప్రసంగం కదలించింది, లాలించింది, సంతృప్తిపరచింది— అన్నారు ఆయన అంత బాగుందా?— అన్నాను నా వివరణ వినండి— అంటూ ఆయన వివరించారు— ప్రసంగం ఆరంభమయిన కొంత సేపటికి జనం వెళ్లడం ప్రారంబించారు కనుక కదలించింది కొందరు నిద్రపోయారు కనుక లాలించింది చివరకు లేచి చాలు, చాలు అన్నారు కనుక సంతోష పరచింది

— **తిరుమల రామచంద్ర**

## డేవిస్ కప్......

(80 వ పేజీ తరువాయి)

అమెరికాచే, 1969 లో రుమేనియాచే, 1970 లో పశ్చిమ జర్మనీచే, ఓడించబడింది 1971 లో ఈస్ట్ జోన్ గెల్చి, సెమీ ఫైనల్సులో రుమేనియాచే (1-4) ఓడించబడింది 1972 లో, 1973 లో ఆస్ట్రేలియాచే ఓడించబడింది

1974 లో రెండవ సారి మనదేశం సెమీ ఫైనల్సుకు చేరింది కలకత్తాలో జరిగిన ఈస్ట్ జోన్ ఫైనల్సులో ఆస్ట్రేలియాపై (3-2) విజయం పొందింది అంతర్-మండల ఫైనల్సులో రష్యాపై (3-1) గెలుపొందింది ఫైనల్సులో దక్షిణ ఆఫ్రికాపై ఆడవలసి వచ్చుటచే సిద్ధాంత రీత్యా మనదేశం పోటీ నుండి విరమించుకున్నది ఆస్ట్రేలియా - ఇండియా మధ్య పోటీ 327 గేమ్స్ జరిగి రికార్డు నెలకొల్పింది మన జట్టులో మొదటిసారిగా జసజీత్‌సింగ్ అనే సిక్కు ఆడాడు.

1975 లో, 1976 లో న్యూజిలాండ్‌చే 1-3, 12-3, 1977 ఆస్ట్రేలియాచే 0-5, 1978 లో న్యూజిలాండ్‌చే 1-4, 1979 లో ఆస్ట్రేలియాచే 2-3, 1980 లో దక్షిణ కొరియాచే ఓడించబడినది 1981 లో ఈస్ట్ జోన్ ఫైనల్సులో ఇండోనీషియాపై గెలుపొంది తిరిగి వరల్డ్ గ్రూపులో ప్రవేశించింది

1982 లో అమెరికా, రష్యాలచే ఓడించబడినది 1983 లో జపాన్‌పై గెల్చి తిరిగి వరల్డ్ గ్రూపులో చేరింది 1984 లో ఫ్రాన్స్, డెన్మార్క్‌లచే వరల్డ్ గ్రూపులో ఓడించబడింది 1985 లో కలకత్తాలో ఇటలీపై గెల్చి, బెంగుళూరులో స్వీడన్‌చే వరల్డ్ గ్రూపులో ఓడించబడింది 1986 లో కలకత్తాలో చెకోస్లోవేకియాచే ఓడించబడి, ఢిల్లీలో రష్యాపై గెల్చి (రెలిగేషన్ తప్పించుటకు) వరల్డ్ గ్రూపులో ప్రవేశించినది

ఈ ఏడు ఢిల్లీలో అర్జంటీనా, ఇజ్రాయిల్‌పై అఖండ విజయం పొందింది సిడ్నీలో ఆస్ట్రేలియాపై 3-2 పై శ్రమతో కూడిన గెల్పు పొందింది

స్వీడన్‌లో డిసెంబరు 18, 19, 20న జరిగిన ఫైనల్సులో స్వీడన్‌ను ఢీకొన్నది స్వీడన్ అన్ని పోటీలలో గెల్చి నాల్గవసారి డేవిస్ కప్ కైవసం చేసుకున్నది స్వీడన్ యిప్పటికి ఆరు సార్లు ఫైనల్సుకు చేరి నాలుగు సార్లు డేవిస్ కప్ గెల్చినది. స్వీడన్ టీములో యిద్దరు ప్రపంచ అగ్రగామి ఆటగాళ్ళు ఉండగా మన జట్టులో ప్రపంచ ఉత్తమ 100 ఆటగాళ్ళలో ఒకరు ఉన్నారు స్వీడన్ ఆటగాళ్ళు మాట్స్‌విలాండర్ ప్రపంచ తృతీయ స్థానం, స్టెఫన్ ఎడ్‌బర్గ్ ద్వితీయ స్థానములో ఉన్నారు విలాండర్ 22-8-62లో, ఎడ్‌బర్గ్ 19-1-66లో జన్మించారు నిస్ట్రామ్ 14, జరీడ్ 16వ స్థానములో కలరు పెరన్ ఫార్స్ 29, కారల్‌సన్ 11వ స్థానంలో ఉన్నారు వీరితో చూచుకుంటే మన ఆటగాళ్ళు రమేష్ కృష్ణన్, విజయ్ అమృతరాజ్, ఆనంద్ అమృతరాజ్‌లు సరియైన ఉజ్జీ కాదు మన జట్టు విజయం అసంభవం అని ముందే నిర్ణయించ బడినది కాని రమేష్ ఒక పోటీలో అయినా గెలుస్తాడని అనుకున్నారు అది జరగ లేదు మన జట్టు ఫైనల్సులో ఓటమి పొందటం వల్ల నిస్పృహ చెందవలసిన అవసరము లేదు అంతర్జాతీయ టెన్నిస్ రంగములో మన స్థాయి పెరిగింది

87 ఏళ్ళ క్రితం డ్విట్ ఎఫ్. డేవిస్ బహూకరించిన రజిత కప్‌తో బాటు రెండు లక్షల డాలర్లు స్వీడన్ జట్టుకు బహూకరించ బడ్డాయి. —ముకరమ్

**Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.**
**Phones : Business : 61247, 61248, 75569 Editorial · 75667**